# మహాభారతోపన్యాసలహరి

మహాభారతములోని వివిధాంశాలపై
ప్రముఖ సాహితీవేత్తల
ఉపన్యాస వ్యాస సంకలనం

*సంపాదకులు:*
డా॥ బి. జయరాములు

శ్రీ శృంగేరి శారదా శంకరమఠం, మోతీనగర్, హైదరాబాద్
తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ భాషాసాంస్కృతిక శాఖ సౌజన్యంతో
***మరియు***
ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్ & కామర్స్, హైదరాబాద్ వారి
ఆర్థిక సహకారంతో ముద్రితం

*ప్రచురణ*



(రి. సంఖ్య 1/64)

**యువభారతి**
తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాద్ - 500 001

MAHAABHAARATHOPANYAASALAHARI
(*A collection of Lectures on MAHABHARATHA delivered by eminent scholars*)



| | | |
|---|---|---|
| ప్రచురణ సంఖ్య | : | **205** |
| ప్రథమ ముద్రణ | : | **31 డిసెంబర్ 2022** |
| ప్రతులు | : | **1000** |
| ద్వితీయ ముద్రణ | : | **18 ఫిబ్రవరి 2023**<br>**శుభకృత్ నామ సం. మహాశివరాత్రి** |
| ప్రతులు | : | **1000** |
| ముద్రణ సహకారం | : | 'పుస్తకశిల్పి' **తాళ్లపల్లి మురళీధర గౌడు** |
| ముఖచిత్ర రూపకల్పన | : | **నవ్య ప్రింటర్స్**<br>మోతీనగర్, హైదరాబాద్. |
| డి.టి.పి & లే అవుట్ | : | **మను గ్రాఫిక్స్**<br>చిక్కడపల్లి, హైదరాబాద్ |
| ముద్రణ | : | **కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్**<br>విద్యానగర్, హైదరాబాద్-500 044 |
| ప్రతులకు | : | **యువభారతి**<br>తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు<br>తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001.<br>చరవాణి : 98499 09896, 93913 73684 |
| వెల | : | **రూ. 200/-  $ 10** |

**ప్రచురణ పూర్వ విరాళం చెల్లించిన సాహితీ బంధువులకు రూ.100/-కే అందించబడింది.**

**Dr. K.V.RAMANA CHARY,** IAS (R)
ADVISOR TO GOVERNMENT
(Culture, Tourism, Endowments,
Youth & Media Affairs) &
CHAIRMAN
Telangana Brahmana Samkshema Parishad



3rd Floor
O/o. Commissioner
(Endowments)
Boggulakunta, Abids
Hyderabad - 500 001



## నా 'నుడి'

సత్సంకల్పంతో
యువభారతి సంస్థ తలపెట్టిన
మహాభారతోపన్యాస లహరి
విజయవంతం కావాలని —
తెలుగు లోగిళ్లలో
విలువల వెలుగులు
వెల్లివిరియాలని
ఆకాంక్షిస్తూ......
శుభాభినందనలతో -

(కెవిరమణ)
221222



"పద్య కళాప్రవీణ", "కవి దిగ్గజ"
డా. ఆచార్య ఫణీంద్ర
తెలుగు విశ్వవిద్యాలయ కీర్తి పురస్కార గ్రహీత
అధ్యక్షులు, "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ

# జగద్ధితంబుగన్

కడచిన 59 వత్సరాలుగా తెలుగు నాట, "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ – "చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవటం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించటం మంచిది" అన్న సూక్తి స్ఫూర్తిగా, సామాజికోపయుక్తమైన అనేక సత్సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తూ, యువతకు సౌమనస్యం, సౌశీల్యం సంతరింపజేసేందుకు ఉపకరించే విధంగా పండితోత్తములచే, సాహితీవేత్తలచే ఇంతవరకు .. ద్విశత గ్రంథాలను వ్రాయించి, ప్రచురించి, ప్రజా బాహుళ్యానికి ఉపాయనంగా సమర్పించిన విషయం సర్వ జన విదితమే!

ఈ ప్రయత్నంలో భాగంగా, లోగడ "యువభారతి" సంస్థ – "కావ్యలహరి", "చైతన్య లహరి", "సంస్కృత సాహితీ లహరి", "జగద్గురు సాహితీ లహరి", "రామాయణ సుధా లహరి" వంటి మన సంస్కృతి, సంప్రదాయ, సదాచారాల పట్ల యువతరానికి సదవగాహనను కల్పించే అనేక ప్రసంగ కార్యక్రమాలను నిర్వహించి, గ్రంథాల రూపంలో అందించిన విషయం సైతం జగద్విదితమే!

ఆ పరంపరలో భాగంగానే .. ప్రస్తుతం "యువభారతి" షష్ఠ్యబ్దిలో అడుగిడిన శుభ తరుణంలో, నన్నయ మహాకవి సహస్రాబ్ది సందర్భాన్ని కూడ పురస్కరించుకొని, తెలుగు మహాభారత మహాకావ్య సారాంశాన్ని, సందేశాన్ని మన ఈ అధునాతన సమాజానికి, ముఖ్యంగా యువతరానికి హితకరంగా అన్వయిస్తూ .. "మహాభారత తోపన్యాస లహరి" పేరిట ఒక మహత్తరమైన కార్యక్రమానికి రూపకల్పన చేసామని తెలియజేయడానికి మిక్కిలి ఆనందిస్తున్నాం.

సాధారణంగా గతంలో కొన్ని సంస్థలు మహాభారతంపై ఏర్పాటు చేసిన వివిధ కార్యక్రమాలను ఆ మహేతిహాసంలోని పర్వాల పరంగానో .. లేదా, కవిత్రయంగా నుతింపబడుతున్న నన్నయ, తిక్కన, ఎఱ్ఱన మహాకవుల కవితా వైదుష్య వైవిధ్యాల పరంగానో – ప్రసంగ సప్తాహాలను నిర్వహించడం మనకు అనుభవైక వేద్యమే! కానీ యువభారతి ఒక విశిష్టమైన, వినూత్నమైన పంథాలో ఈ "మహాభారతోపన్యాసలహరి" కార్యక్రమాన్ని రూపొందించింది. శ్రీమదాంధ్ర మహాభారతంలోని అవతారికలో ఆదికవి నన్నయ విరచించిన ఈ పద్యాన్ని వీక్షించండి.

*ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని,*
*యధ్యాత్మవిదులు వేదాంతమనియు,*
*నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని,*
*కవివృషభులు మహాకావ్యమనియు,*
*లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహమని,*
*యైతిహాసికు లితిహాస మనియు,*
*పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ*
*యంబని మహి గొనియాడుచుండ –*

*వివిధ వేద తత్త్వవేది వేదవ్యాసు*
*డాది ముని పరాశరాత్మజుండు,*
*విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై*
*పరగుచుండ జేసె భారతంబు!*

ఈ పద్య రత్నంలోని ఆంతర్యం ప్రాతిపదికగా .. సమకాలీన యువతకు, భావి తరాలకు "మహాభారత మహాకావ్య" వైశిష్ట్యం, ఔన్నత్యంతోబాటు అందులోని ధర్మ సూక్ష్మాలు, దివ్య సందేశం – సులభగ్రాహ్యంగా అవగతమయ్యేలా ఈ "లహరి" ప్రసంగ కార్యక్రమాలను 24/12/2022 నుండి 31/12/2022 వరకు వరుసగా ఎనిమిది రోజులపాటు నిర్వహించి, ఆ ప్రసంగ పాఠాలను గ్రంథ రూపంలో కూడ వెలువరించేందుకు సంకల్పించాం.

మా సంకల్పానికి చేయూతను, బలాన్ని చేకూరుస్తూ, మేము కోరిన వెంటనే జగత్ప్రసిద్ధులైన సంస్కృతాంధ్ర పండితులు, ప్రవచనకారులు దయతో ఆ యా అంశాలపై ప్రసంగించేందుకు తమ అంగీకృతిని తెలియజేయడమే కాకుండా, సకాలంలో ఆ ప్రసంగ పాఠాలను అందించి, ఈ గ్రంథ ముద్రణను ఉన్న కొద్ది సమయంలో పూర్తి చేయగలిగేందుకు సహకరించారు. "మహాభారతం – ధర్మశాస్త్రం" అన్న అంశంపై ప్రసంగించిన ఆచార్య శలాక రఘునాథ శర్మ గారికి, "మహా భారతం – ఇతిహాసం" అన్న అంశంపై ప్రసంగించిన డా. మైలవరపు శ్రీనివాసరావు గారికి, "మహా భారతం – వేదాంతం" అన్న అంశంపై ప్రసంగించిన బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ గారికి, "మహా భారతం – నీతి శాస్త్రం" అన్న అంశంపై ప్రసంగించిన ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి గారికి, "మహా భారతం – మహాకావ్యం" అన్న అంశంపై ప్రసంగించిన "పద్మశ్రీ" పురస్కార గ్రహీత డా. గరికిపాటి నరసింహారావు గారికి, "మహా భారతం – బహు పురాణ సముచ్చయం" అన్న అంశంపై ప్రసంగించిన విదుషీమణి డా. ఎన్. అనంతలక్ష్మి గారికి, "మహా భారతం – సర్వ లక్ష్య సంగ్రహం" అన్న అంశంపై ప్రసంగించిన అవధాని డా. కడిమిళ్ళ వరప్రసాద్ గారికి, "మహా భారతం – భగవద్గీత" అన్న అంశంపై ప్రసంగించిన శ్రీ ఎల్. వి. గంగాధర శాస్త్రి గారికి – మా "యువభారతి" సంస్థ పక్షాన, విశ్వవ్యాప్తంగా విస్తరించి ఉన్న తెలుగు సాహిత్యాభిమానుల పక్షాన – హృదయ పూర్వక అభివాదాలను, ధన్యవాదాలను సమర్పించుకొంటున్నాం.

ఈ బృహత్ కార్యక్రమాన్ని అత్యంత వైభవోపేతంగా నిర్వహించేందుకు మాకు కొండంత అండగా నిలిచిన – తెలుగు సాహితీ సాంస్కృతిక క్షేత్రంలో కల్పద్రుమంలా భాసిల్లుతున్న "తెలంగాణ ప్రభుత్వ సలహాదారు" డా. కె.వి. రమణాచారి గారికి నత మస్తకులమై నమోవాకాలను సమర్పిస్తున్నాం. ఈ మహోన్నత కార్యక్రమానికి తమ సౌజన్యాన్ని ప్రకటించి, కార్యక్రమ నిర్వహణలో సంయుక్తంగా పాలుపంచుకొన్న తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వానికి, ముఖ్యంగా తెలంగాణ రాష్ట్ర భాషాసాంస్కృతిక శాఖ సంచాలకులు డా. మామిడి హరికృష్ణ గారికి మా కృతజ్ఞతాంజలిని సమర్పిస్తున్నాం. ఈ "మహాభారతోపన్యాస లహరి" ప్రసంగ కార్యక్రమాలను నిర్వహించేందుకు పవిత్రమైన వేదికను సమకూర్చిన "శ్రీ శృంగేరి శంకరమఠం", మోతీనగర్, హైదరాబాదు

యాజమాన్యానికి, ముఖ్యంగా శ్రీ సి.ఎస్.ఆర్.మూర్తి గారికి మా సంస్థ పక్షాన అభివందనాలను తెలియజేస్తున్నాం. ఈ ఉత్కృష్ట కార్యక్రమాన్ని దిగ్విజయంగా నిర్వహించేందుకు శ్రమించిన మా సంస్థ వరిష్ఠ సభ్యులకు, కార్యకర్తలకు అభినందనలను అందజేస్తున్నాను.

అత్యున్నత ప్రమాణాలతో సాగిన ఈ ప్రసంగాలను ఎప్పటిలాగే .. అక్షరబద్ధం చేసి శాశ్వతత్వం సమకూర్చినందుకు “యువభారతి” సంస్థ సంతోషిస్తున్నది. సహస్ర వర్షాల పూర్వం – “మహాభారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్!” అని ప్రవచించాడు నన్నయ భట్టారకుడు. ఈ సహస్రాబ్ది సందర్భంగా – ఆ “జగద్ధిత” యజ్ఞానికి సమిధ నొక్కటి ఈ గ్రంథ రూపంలో సమర్పిస్తున్నందుకు మా సంస్థ గర్విస్తున్నది. ప్రతి తెలుగు లోగిలిలో ఈ గ్రంథం విలసిల్లాలని, ప్రతి తెలుగు హృదయాన్ని ఈ గ్రంథం అలరించాలని ఆకాంక్షిస్తూ ... అభ్యర్థిస్తూ ...

హైదరాబాదు, తేది: 31/12/2022 —ఆచార్య ఫణీంద్ర





“చుట్టూరా ఆవరించుకొని వున్న
చీకటిని తిట్టుకుంటూ
వూరికే కూర్చోవడం కంటే,
ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా
వెలిగించడం మంచిది”

*ఈ వాక్యమే మా యువభారతి ఊపిరి*



డా॥ బ్రాహ్మణపల్లి జయరాములు
ప్రధాన సంపాదకులు
యువభారతి ప్రచురణలు

# మానవ మూల్యాలు నెలకొల్పే "మహాభారతోపన్యాసలహరి"

*"అమితాఖ్యానక శాఖలం బొలిచి, వేదార్థామల చ్ఛాయమై*
*సుమహద్వర్గ చతుష్క పుష్ప వితతిన్ శోభిల్లి, కృష్ణార్జునో*
*త్తమ నానాగుణ కీర్తనార్థ ఫలమై, ద్వైపాయనోద్యాన జా*
*త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసుర ప్రార్థ్యమై"* (ఆది 1-66)

భారతీయులకు మహాభారతం పారిజాత కల్పవృక్షం లాంటిది. అడిగిన కోర్కెలన్నీ తీరుస్తుంది పారిజాత దివ్యవృక్షం. మానవులు కోరేవి పురుషార్థ (ధర్మ, అర్థ, కామ, మోక్ష) ఫలాలు. వాటికి సంబంధించి తెలియదగిన విశేషాలన్నింటినీ చెప్పేది మహాభారతం.

ఆంధ్ర మహాభారతం యొక్క సహస్రాబ్ది ఉత్సవాలు రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ ఘనంగా జరుపుకుంటున్నాం. రాజరాజ నరేంద్రుడు రాజ్యాభిషిక్తుడై వేయి సంవత్సరాలైన సందర్భంగా ఆయన కోరిక మేరకు నన్నయ భారత రచనకుపక్రమించడం వల్ల మనం మహాభారత సహస్రాబ్ది ఉత్సవాలను జరుపుకుంటున్నాం. భారతదేశమంతటా స్వాతంత్ర్య వజ్రోత్సవాలు కూడా ఘనంగా జరుపుకుంటున్నాం.

ఈ రెండు ఉత్సవాలే గాక ఆంధ్రదేశమంతటా తన భాషా సాహిత్య సేవల ద్వారా రెండువందల సాహిత్య గ్రంథాలను ప్రచురించి, అనేక సాహిత్య సభలు నిర్వహించిన "యువభారతి" (సాహితీ సాంస్కృతిక సంస్థ) అరవైయవ ఏట అడుగు పెడుతోంది. ఈ సందర్భంగా "యువభారతి" కార్యవర్గం, సంస్థ యొక్క షష్ఠ్యబ్ది

ఉత్సవాలను సంవత్సరమంతా ఘనంగా నిర్వహించాలని నిర్ణయించుకుంది. యువభారతి ఏ కార్యక్రమం చేసినా విశిష్టంగా, వినూత్నంగా ఉండాలని సంకల్పిస్తుంది. ఇంతకు పూర్వం అనేక కార్యక్రమాలు నిర్వహించాం. వాటిలో 'లహరి' పేరిట నిర్వహించిన కార్యక్రమాలు చాలా విశిష్టమైనవి. చాలా విలువైన గ్రంథాలను ఆ సందర్భంగా వెలువరించడం జరిగింది. ఇప్పుడు 'యువభారతి వజ్రోత్సవ ప్రచురణ'గా దిగ్దంతులైన, ఉద్ధండులైన లబ్ధ ప్రతిష్ఠులైన సాహితీమూర్తులచే వ్యాసాలు వ్రాయించి, వారి ప్రసంగాలను ఏర్పాటు చేసింది. వారి వ్యాసాలను "మహాభారతోపన్యాసలహరి" పేరిట గ్రంథరూపంగా వెలువరిస్తూంది.

ఈ "మహాభారతోపన్యాసలహరి"కి మూలమైంది ఆంధ్రమహాభారతంలోని ఈ కింది పద్యమే.

*"ధర్మ తత్త్వజ్ఞులు ధర్మ శాస్త్రంబని*
*యధ్యాత్మ విదులు వేదాంత మనియు*
*నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని*
*కవి వృషభులు మహా కావ్యమనియు*
*లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహమని*
*యైతిహాసిక లితిహాసమనియుఁ*
*బరమ పౌరాణికుల్ బహు పురాణ సముచ్చ*
*యంబని మహిఁగొనియాడు చుండ*

*వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసుఁ*
*డాది ముని పరాశరాత్మజుండు*
*విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై*
*పరగుచుండఁ జేసె భారతంబు"* (భార. ఆది-1-32)

భారతం - ధర్మశాస్త్రం, వేదాంతం, నీతిశాస్త్రం, మహాకావ్యం. సర్వలక్ష్య సంగ్రహం, ఇతిహాసం, పురాణ సముచ్చయం.

*ఇప్పుడెందుకీ భారతం?* : గ్రంథం వెలువడి వేయి సంవత్సరాలవుతూంది. అనేకమంది పరిశోధకులు దీనిపై పరిశోధనలు చేశారు. విమర్శకులు విమర్శలు

వెలయించారు. వక్తలు ఉపన్యాసాలిచ్చారు. ప్రవచన కర్తలు సుదీర్ఘ ప్రవచనాలు చేశారు. అనేక గ్రంథాలు మహాభారతం గురించి వెలువడ్డాయి కదా! మరలనిదేల భారతం? అని ప్రశ్నించవచ్చు నెవరైనా. యువభారతి ఈ కార్యక్రమాన్నెందుకు చేపట్టింది? అనే సంశయం ఏర్పడవచ్చు. ఒక్కసారి మన సమాజం వైపు, నేటి యువత వైపు దృష్టి సారిద్దాం–

ఈనాటి యువత ఏం కోరుతూంది? ఏం ఆలోచిస్తూంది? నేటి యువత కోరుతున్నది – 6,5,4,3,2,1... అంటే ఆరంకెల జీతం, అయిదు రోజుల పని దినాలుండాలని. (ఇంద్రియాల సుఖం), నాలుగు చక్రాల వాహనం, మూడు పడకల గదులున్న ఇల్లు లేదా ఫ్లాట్, మేమిద్దరం భార్య నేను. మాకు ఒక్క సంతానం ఉంటే చాలు అని ఆలోచిస్తున్నారు. కాని భారతీయ మూలాల్లోకి వెళ్ళి పరిశీలిస్తే ఈ అంకెలనే, వేరే విధంగా మనం సమన్వయించుకోవచ్చు. ఆరు– అరిషడ్వర్గాలకు (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలకు) సంకేతంగా గ్రహిస్తే మన ప్రాచీన వాఙ్మయం వాటిని జయించాలని చెబుతూంది. అయిదు – పంచేంద్రియాలను (త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వ, ఘ్రాణాలు) నిగ్రహించుకోవాలి.నాలుగు –చతుర్విధ పురుషార్థాలు (ధర్మ, అర్థ, కామ, మోక్షాలు), వాటి ఫలాలను సాధించాలి. మూడు – త్రిగుణాలు (సత్త్వం, రజస్సు, తమస్సులు) మూడింటిలో తమోగుణం లేకుండా చేసుకొని, రజోగుణాన్ని బాగా తగ్గించుకొని, సత్త్వగుణాన్ని పెంపొందించుకోవాలి. రెండు – సుఖదుఃఖాలు, రాగద్వేషాలు మొదలైన ద్వంద్వాలకు అతీతుడుగా జీవించాలి. ఒకటి – ఈ విశ్వానికంతటికి ఈ సృష్టికర్త, ఈ విశ్వమంతటా వ్యాపించి ఉన్న పరమాత్మ ఒక్కడే అనే భావన కలిగి ఉండాలని పెద్దలు భావించేవారు.

నేడు ఆర్థిక సంబంధాలు తప్ప, మానవ సంబంధాలు, మానవ మూల్యాలు అస్తినాస్తి విచికిత్సగా ఉన్నాయి. నేటి యువతలో మూల్యాలు (విలువలు) నెలకొల్పడానికి మళ్ళీ "మహాభారతోపన్యాసాలు" అవసరమని భావించింది యువభారతి. వైయక్తిక విలువలు, సామాజిక విలువలు, సాంస్కృతిక విలువలు, ధార్మిక విలువలు, ఆధ్యాత్మిక విలువలు మొ।। విలువలు నేటి సమాజంలో లుప్తమై పోయిన తరుణంలో వాటిని మళ్ళీ నేటి యువతలో పాదుకొల్పితే, భావి సమాజం విలువలు కలిగిన సమాజంగా పరిణమిస్తుందనే భావనతో ఈ ప్రాజెక్టును యువభారతి చేపట్టడం జరిగింది.

మహాభారతంలోని ధర్మాల ద్వారా ధార్మిక విలువలు, వేదాంతం ద్వారా ఆధ్యాత్మిక విలువలు, నీతి ద్వారా వైయక్తిక విలువలు. కాంతి సమ్మిత కావ్య లక్షణాల ద్వారా సత్ప్రవర్తన, ఇతిహాస సంబంధ విషయాల ద్వారా సామాజిక విలువలు, పురాణ విషయాల ద్వారా సాంస్కృతిక విలువలు నేటి సమాజానికి అందించాలనే లక్ష్యంతో ఈ "మహాభారతోపన్యాసాలు" ఏర్పాటు చేయడం జరిగింది. అంతేకాదు 'వ్యక్తిత్వ వికాసం' కలిగించే భగవద్గీత ద్వారా ఉన్నత వ్యక్తిత్వం కలిగిన వారికి నేటి యువతను తీర్చి దిద్దే ఉద్దేశంతో ఈ కార్యక్రమం చేపట్టడం జరిగింది. వీటికి సంబంధించి ఎనిమిది వ్యాసాలు రచింపజేసి, ఆ రచయితల చేతనే ప్రసంగ పరంపరను ఏర్పాటు చేసింది యువభారతి, ఆ వ్యాసాలను వరుసగా పరిచయం చేస్తాను.

మొదటి ఉపన్యాసం నేటి సమాజంలో ధార్మిక విలువలను నెలకొల్పడంలో తోడ్పడేది. దీనికి సంబంధించిన "మహాభారతము - ధర్మశాస్త్రము" అనే వ్యాసం రచించిన వారు సంస్కృతాంధ్ర విద్వన్మణి ఆచార్య శలాక రఘునాథశర్మగారు. ఆయన భారత రాష్ట్రపతి పురస్కార గ్రహీత. ఆయన వ్యాసంలో - దుష్టశిక్షణ, శిష్ట రక్షణ, ధర్మస్థాపన - మూడింటికి ఒకే పేరు ధర్మం అన్నారు. ధర్మం, ధర్మతత్త్వం గురించి వేదం చెప్పిందేమిటో వివరించిన మనుస్మృతి ధర్మశాస్త్రంలో ప్రమాణగ్రంథమని, దానిలోని విషయాలు వివరించారు. వేదం, స్మృతి, సదాచారం, ఆత్మపరితుష్టి - ఈ నాలుగు రూపాలుగా ధర్మం ఉంటుందన్నారు. ధర్మాన్ని పది అంశాల్లో తెలుసుకోవచ్చని మనుస్మృతిలోని (6-92) శ్లోకాన్నుదాహరించారు-

*ధృతిః క్షమాదమో ఽ స్తేయం శౌచమింద్రియ నిగ్రహః;*
*ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్ ॥*

ధృతి, క్షమ, దమం, అస్తేయం, శౌచం, ఇంద్రియ నిగ్రహం, ధీః (అంటే శాస్త్ర జ్ఞానాదుల ద్వారా తత్త్వజ్ఞానాన్ని పొందడం), విద్య (ఆత్మజ్ఞానం), సత్యం, అక్రోధం - అనే పదింటి లక్షణాలను వివరించి, భారత ఇతివృత్తంతో చక్కగా సమన్వయం చేసి వివరించారు. ఈ వ్యాసం చదివితే ధర్మం అంటే ఏమిటో తెలిసి, మనం వాటిని ఆచరణలో పెడితే మనం ధార్మికులుగా మారుతాం, ఇది చదివి ఆచరించిన ప్రతి వ్యక్తిలో ధార్మిక విలువలు నెలకొంటాయనడంలో సందేహం లేదు.

"మహాభారతము–ఇతిహాసము" అనే వ్యాసాన్ని ప్రముఖ ప్రవచనకర్త, సంస్కృతాంధ్ర విద్వన్మణి డా. మైలవరపు శ్రీనివాసరావుగారు విశ్లేషణాత్మకంగా రచించారు. ఇతి – ఈ విధంగా, ఆస – జరిగింది, హ– అట– ఇలా జరిగిందట అని జరిగిన విషయాన్ని యథాతథంగా వివరించడం ఇతిహాసమని చెప్పి, కవిత్రయం వారు చెప్పిన ఇతివృత్తాలను క్రమంగా విశ్లేషించి విశదీకరించారు. దుష్యంతుని కథ, కచుడు మృత సంజీవని తేవడం, ఏకలవ్యుని వృత్తాంతం, శిశుపాల వధ, ద్రౌపది వస్త్రాపహరణం, పునర్ద్యూతం మొ॥ వాటిని నన్నయ ఉన్నదున్నట్లు రచించాడన్నారు. అలాగే ఎఱ్ఱన సావిత్రీసత్యవంతుల ఉపాఖ్యానం కూడా వ్యాసభారతంలో ఉన్నదున్నట్లే రాశాడన్నారు. తిక్కన పాండవులు విరాటుని కొల్వులో మారు రూపాలలో ప్రవేశించే సమయంలో ఆయుధాల కట్టను అక్కడి వారితో "శతవృద్ధ జనని శవం" అని ధర్మజుడన్న మాటను ఉటంకించి, విశ్లేషణ సాగించారు. ఒకే ఇతిహాస ధోరణిలో అన్ని కథలూ ఉన్నాయంటూ కద్రువ – వినతల వృత్తాంతాన్ని, గాంధారీ కుంతిల కథను అని చక్కగా వివరించారు. నలదమయంతులు – ధర్మజుల ద్రౌపది కథలను సమన్వయించి చూపారు. భారతోపాఖ్యానాలన్నిటా చివర ధర్మమే గెలుస్తుందన్నారు. రామాయణంలో అవతారం, భారతంలో ఉత్తారం– అని, రామాయణ, భారత కథలు ఒకే మూల సూత్రం మీద ఆధారపడి కనిపిస్తాయని నిర్ధారించారు. ఇలా ఆయన విశ్లేషణను పరిశీలిస్తే అన్ని కాలాల్లోనూ వ్యక్తుల ప్రవర్తన ఎలా ఉంటుందో తెలుసుకొని, సామాజిక విలువలను ఎలా పెంపొందించుకోవచ్చో తెలుస్తుంది. మంచి, చెడులను గ్రహించి, వాటిలో మంచిని స్వీకరిస్తే ఏ సమాజంలోనైనా విలువలు నిలిచి ఉంటాయని మైలవరపు వారి వ్యాసం ద్వారా మనం గ్రహించగలం.

వ్యక్తైనా, సమాజమైనా ఆధ్యాత్మిక విలువలు లేకుండా జీవిస్తుందంటే, ఆ వ్యక్తైనా, ఆ సమాజమైనా అశాంతితో, అలజడితో జీవించాల్సి వస్తుంది. వేదాంత దృక్పథం కలిగినవారు, తాము సత్త్వగుణ సంపన్నులై శాంతిగా జీవిస్తూ, సమాజంలో అశాంతి కలుగకుండా ఉండడానికి దోహదం చేస్తారు. అలాంటి వేదాంతం భారతంలో ఎలా నిక్షిప్తమై ఉందో సుప్రసిద్ధ ప్రవచనకర్త, ప్రముఖ కవి, బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మగారు "మహాభారతము – వేదాంతము" అనే తమ వ్యాసంలో సాకల్యంగా వివరించారు.

లౌకికానికి ధర్మం, పరమార్థానికి జ్ఞానమని, అధ్యాత్మ విద్య, వేదాంతం పర్యాయ పదాలని, అంతిమ జ్ఞానం వేదాంతం, అంతిమ పురుషార్థం మోక్షం అని, ఈ రెండూ పరమార్థమని విశదీకరించారు. "ఊరట జ్ఞానం చేతనే" – అనే ఉపశీర్షికతో శౌనకుడు యుధిష్ఠిరునికి చెప్పిన మాటలలో "దుఃఖానికి ఔషధం జ్ఞానమే" అన్న విషయం స్పష్టమైందన్నారు. అరణ్యవాసంలో ధర్మజునికి సత్సంగం లభించిందని దానిలో మార్కండేయ మహర్షి ధర్మజునికి చెప్పిన 'ధర్మ వ్యాధోపాఖ్యానం' మకుటాయమాన మైందని, దాన్ని చక్కగా విశ్లేషించి చూపారు. పుట్టుకతో ఏ వర్ణం వాడైనా ధర్మ, జ్ఞానాల చేత అధికుడై అధ్యాత్మ నిష్ఠుడుగా పరమ పురుషార్థాన్ని పొందవచ్చని, ఈ వృత్తాంతం తేటపరుస్తుందన్నారు. అలాగే అరణ్యపర్వం చివర "యక్ష ప్రశ్నలకు వేదాంత సమాధానం"లో ధర్మజుడు యక్షునికి. సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వాల పట్ల సమబుద్ధి కలవాడే", సర్వథ అని ద్వంద్వాతీత స్థితిని సమాధానంగా ఇవ్వడం బ్రహ్మనిష్ఠుని స్థితి వివరిస్తుందన్నారు. "సనత్సుజాతుని బోధ" ధర్మ జ్ఞానాల అనుబంధాన్ని తెల్పిందన్నారు. గీతాశాస్త్రాన్ని తిక్కన సారంగా అందించాడన్నారు. "భీష్ముడు చెప్పిన జ్ఞానామృతం" ప్రవృత్తి, నివృత్తులకు సంబంధించిందని చెబుతూ, ఆయన చెప్పిన ఇరవై ఉపాఖ్యానాల్ని పేర్కొని, వాటిలో "జాజిలి తులాధార వృత్తాంతం" మకుటాయమానమైందన్నారు. "ఏ ఆశ్రమమైనా వేదాంతానికి యోగ్యమే" అని తేల్చారు. 'ఏకాంత భక్తికి ప్రాధాన్యం' అన్నారు. 'సనత్కుమార వచనం' చెప్పింది అద్భుత వేదాంత సారమని, విష్ణు సహస్రనామస్తోత్రం (అనుశాసనపర్వం), శివనామస్తోత్రం 'అభేదభక్తి'ని ప్రతిపాదించాయన్నారు. 'అనుగీతలో అందాలు' వివరించి, 'రాజసూయ యాగంతో సర్వంసహా చక్రవర్తియైన ధర్మజుడు సర్వం కోల్పోయి, అరణ్యవాసంలో "మమ" కారాన్ని విడిచి, అజ్ఞాతవాసంలో "అహం"కారాన్ని వదిలి, ఉద్యోగించి మహాప్రస్థానం ద్వారా స్వర్గారోహణాన్ని పొందడమే వేదాంత జ్ఞానాన్ని స్ఫురింప జేస్తుంది – అన్నారు. ఈ వ్యాసం చదివి, జీర్ణించుకుంటే అధ్యాత్మ విలువలు నెలకొనడం ఖాయం.

నేటి సమాజంలో నైతిక విలువలు పతనమవుతున్నాయని విజ్ఞులంతా భావిస్తున్నారు. నేటివారిలో ముఖ్యంగా యువతలో నైతిక విలువలు పాదుకొల్పడానికి జాతీయవాది, ప్రముఖవక్త, సంస్కృతాంధ్ర విద్వాంసులు ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి గారి వ్యాసం "మహాభారతం– నీతిశాస్త్రం" తప్పకుండా దోహదం చేస్తుంది. వేదనీతే భారతనీతి అంటూ సత్యాన్ని ప్రతిపాదించిన శకుంతలోపాఖ్యానం (నుతజలపూరితంబు

లగు...) నీతిని తెల్పారు. న్యాయం, సత్ప్రవర్తన, నియమం – వీటిని శాసించేదే శాస్త్రం అన్నారు. మహాభారత ఆఖ్యాన, ఉపాఖ్యానాల్లో నీతి ఉందని సోదాహరణంగా విశదీకరించారు. విదురుడు, భీష్ముడు, శ్రీకృష్ణుడు, వ్యాసుడు, ధర్మరాజు మొదలైనవారి నీతిబోధలు భారతమంతటా ప్రకాశిస్తాయని, వాటిలో వ్యక్తిగత, కుటుంబ, సామాజిక, రాజనీతికి సంబంధించినవి వివిధ పద్ధతులలో వివరించబడ్డాయన్నారు. గీత, సనత్సుజాతీయం, విష్ణు సహస్రనామం – వేదాంత భక్తి నీతి శాస్త్రాలంటూ, – ఇలా సహస్ర విధాలుగా భారతం నీతి శాస్త్ర మయింది – అని ముక్తాయింపునిచ్చారు.

మానవుడు, నిరంతర ఉపదేశాల వల్ల మార్పు చెందే అవకాశం ఉంటుంది. ఆ ఉపదేశం కాంతాసమ్మితంగా ఉంటే దాన్ని ఆనందంగా గ్రహిస్తాడు వ్యక్తి (సద్యః నిర్వృతయే, కాంతా సమ్మిత తయోపదేశయుజే). భారతాన్ని మహా కావ్యమని, దానిలోని ఉపదేశం గ్రహిస్తే సమాజం బాగుపడుతుందని, పద్మశ్రీ పురస్కార గ్రహీత, మహా సహస్రావధాని డా.గరికిపాటి నరసింహారావుగారు తమ వ్యాసం "మహాభారతము–మహాకావ్యము"లో వివరించారు. "తెలుగుభారతంలో ఉండే నవరస భరితమైన కవిత్వాన్ని రుచి చూపించడమే ఈ వ్యాస రచనలో ఉద్దేశం" అంటూ మొదలెట్టి అనేక విషయాలను తమ వ్యాసంలో పొందుపరిచారు. ఆదిపర్వంలో సత్యవతీ దేవికి వ్యాసుడు చేసే ఉపదేశంలో–

*అతిక్రాంత సుఖాః కాలాః పర్యుపస్థిత దారుణాః ।*
*శ్వః శ్వః పాపిష్ఠ దివసాః పృథివీ గతయౌవనా ॥*

"పృథివీగతయౌవనా" అని గొప్ప కవితాత్మక ప్రయోగం చేశాడని, దాన్ని నన్నయగారు–

*మతి దలపగ సంసారం*
*బతి చంచల, మెండ మావులట్టుల సంప*
*త్ప్రతతు లతి క్షణికంబులు*
*గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్*

(ఆది. 5–159) అని స్వేచ్ఛానువాదం చేశారన్నారు.

భీముడు జరాసంధుని చంపే సమయంలో గిరిగిర తిప్పడం వర్ణించిన పద్యంలోని శబ్దప్రయోగ చాతుర్యం  వివరిస్తూ –

"…. వాతసుతుండు వీచె శతవారము లుద్దత చండవాత సం" మొదటి 'వాత'. మధ్యలో 'తవా', చివర మళ్ళీ వాత – అనే అక్షర ప్రయోగాలు చూస్తే, అటూ ఇటూ జరాసంధుడి దేహాన్ని తిప్పి పడేసిన విషయం ధ్వనిస్తుందన్నారు. "సింగం బాకటితో…" (విరాట. 4–95) అనే పద్యాన్ని వ్యాఖ్యానిస్తూ ద్రోణుడన్న మాటల్ని నేటి మన విద్యావ్యవస్థ కన్వయించి చూపారు. ఇలా చాలా విషయాలను రసపరంగా, ఉపదేశ పరంగా వివరిస్తూ, చివర – 'ఆదిపర్వంలో కుక్కకు అవమానం జరగడంతో ప్రారంభమైన ఇతివృత్తం మహాప్రస్థానంలో కుక్కకు సన్మానంతో ముగిసిందని, బాధపెట్టిన వారిని మళ్ళీ సంతోషపెట్టేవరకు జీవితంలో శాంతి ఉండదు' అనేది భారత సందేశమని పేర్కొన్నారు. మన జీవితంలో జనన మరణ చక్రం లాగా భారత, భాగవతాల కథాచక్రాన్ని కూడా నిర్మాణం చేసిన వేదవ్యాసునికి అంజలి ఘటిస్తూ వ్యాసం ముగించారు. మహాభారతంలో కావ్యవిశేషాలనేకం తెలుసుకోవడమే గాక చక్కటి సామాజిక సందేశాన్ని కూడా మనం ఈ వ్యాసం ద్వారా పొందగలం. ఈ వ్యాసం తప్పక చదివి పాఠకులు ఆనందోపదేశాలని పొందవచ్చు.

తర్వాతి వ్యాసం ప్రముఖ మహిళా (ఏకైక) ప్రవచనకారిణి, విద్వన్మణి డా.ఎన్.అనంతలక్ష్మిగారు రచించిన "మహాభారతము– బహుపురాణ సముచ్చయము". అష్టాదశ పురాణాలు, రామాయణము, భారతము, విష్ణు, శివధర్మాలు పండితులచే "జయం" అనే పేరుతో వ్యవహరింపబడతాయని భవిష్యపురాణోక్తి– అని చెబుతూ, పురాణ పంచలక్షణాలు (స్వర్గశ్చ ప్రతిసర్గశ్చ…) భారతంలోను ఉన్నాయన్నారు. రాజకుటుంబాల చరిత్ర, సృష్టిస్థితి లయాదులు, మన్వంతరాలు ఎంతో విస్తృతంగా వర్ణింపబడ్డాయని చెప్పి, వంశాను చరితం అన్నదానికి ప్రాధాన్యమిస్తూ భారత రచన సాగిందని చెప్పారు. శాంతి పర్వగాథలు, తక్కిన పర్వాల్లోని పురాణగాథలు – వీటన్నిటి ప్రయోజనం అష్టాదశ పురాణ సారం ప్రతిపాదించడం అన్నారు. 'అన్ని పురాణాల్లో ఉన్న పురాగాథలు చాలావరకు భారతేతిహాసంలో దర్శనమిస్తాయి' అని చెబుతూ – యయాతి చరిత్ర, సావిత్రి ఉపాఖ్యానం మొదలైనవి పురాణాల్లోను, భారతంలోనూ

ఒకేవిధంగా కనబడతాయని, దీర్ఘతముడి వృత్తాంతం మత్స్యపురాణంలో మార్కండేయ పురాణ ప్రశస్తి భారతంలో ఉందన్నారు. వాయుపురాణ, భీష్మ పర్వాల్లో ఉన్న భూగోళ వర్ణన ఒక్కటే. స్కాంద పురాణంలోని స్కందుడి చరిత్ర, సూర్యాష్టోత్తర శతనామాలు, సుకన్యాచ్యవనుల వృత్తాంతం మహాభారతంలోనూ ఉన్నాయన్నారు. విష్ణుపురాణంలోని కథలు, పద్మపురాణంలోని ఎన్నో చరిత్రలు, తీర్థవృత్తాంతాలు, మాహాత్మ్యాదులు భారతంలోనూ కనిపిస్తాయి అన్నారు. కథన రీతిని బట్టి భారతం ఒక పురాణమని, పాపపుణ్యాల గురించి ఉదాహరణ పూర్వకంగా, ఆచరణ యోగ్యంగా తెలియజేస్తాయని, పురాణాలు, అన్నిటినీ సమగ్రంగా తెలుపుతుంది మహాభారతం – అని అన్నారు. మన సంస్కృతిని అందించేవి పురాణాలు. కాబట్టి మహాభారతం చదివితే సమాజంలో సాంస్కృతిక విలువలు నెలకొంటాయని ఈ వ్యాససారంగా భావించవచ్చు.

ఆ తర్వాతి వ్యాసం గురు సహస్రావధాని డా. కడిమిళ్ళ వరప్రసాద్‌గారు రచించిన "మహాభారతము– సర్వలక్ష్య సంగ్రహము"! భారతాన్ని లక్ష్య లక్షణ దృష్టితో చూస్తే రెండు శాస్త్రాలు ఛందోవ్యాకరణాలు – అని ప్రారంభించి, ఛందస్సుకు సంబంధించిన అనేక విషయాలు ముందు ప్రస్తావించారు. నన్నయ, తిక్కనలు శ్రీకారంతో రచన ప్రారంభించడం, నన్నయ, 'ద–ధ' ప్రాస, తిక్కన – 'జ్ఞ–క' ల ప్రత్యేక యతి, నన్నయ 'మ'గణంతో కావ్య ప్రారంభం చేస్తే, తిక్కన 'భ' గణంతో ప్రారంభించడం, మధ్యాక్కరల్లో 5వ గణాదియతి వాడడం, 'ఋ–ము'లకు యతి (ము– విభక్తి యతి), అభేదయతి (వ–బ), ఋ–ర–ల ప్రాస (సంయుతాసంయుత ప్రాస) మొ॥ వాటిని సోదాహరణంగా వివరించారు. వ్యాకరణంలో మొదటి తెలుగు పద్యం "రాజకులైక భూషణుడు"లో "శౌర్యుడు ధర్మవాచకంగా ప్రయోగించాడని, "కఱకంఠుడు మొ॥ నన్నయ సమాసాలు, ప్రాణగొడ్డము" లాంటి సమాసాలు తిక్కన ప్రయోగించాడని వివరించారు. అలంకారాలు, ధ్వని ఏయే పద్యాల్లో ఉన్నాయో సోదాహరణంగా తెలిపారు. భారతంలో ఆయా ఘట్టాల్లో ఉన్న నవరసాలను, చివరకు రసాభాస గురించి కూడా విశదీకరించారు. చివర ఏయే శాస్త్రాలకు భారతం లక్ష్య సంగ్రహంగా ఉందో వివరించి, వ్యాసాన్ని ముగించారు. ఇది భాషా, సాహిత్య వేత్తలను రంజింపజేసే

వ్యాసమని చెప్పవచ్చు. మానవులకు 'వాక్' సంస్కారం కలగడానికిది తప్పకుండా దోహదం చేస్తుంది.

చివరిదైనా, విశిష్టమైన వ్యాసం "మహాభారతము–భగవద్గీత". భగవద్గీతా ఫౌండేషన్ వ్యవస్థాపక అధ్యక్షులైన శ్రీఎల్.వి.గంగాధరశాస్త్రిగారు ఈ వ్యాసంలో – "ఇంకా తెలుసుకోవలసి ఉంటుందో అది 'సైన్స్', మరోటి తెలుసుకోవడానికి మిగిలి ఉండదో అది 'స్పిరిచ్యువల్ సైన్స్" అని ప్రారంభించి, భగవద్గీత ఏం చెబుతుంది? అని ప్రశ్నించి, మానవులెలా ఉండాలో, ఏం చేయాలో వివరిస్తుందని, 'గీత – బెస్ట్‌మేనేజ్‌మెంట్ గ్రంథం, కృష్ణుడు – బెస్ట్ మేనేజ్‌మెంట్ 'గురు'వన్నారు. గీత చదివితే ఏమొస్తుంది? అంటే, కర్తవ్యదీక్ష, నైతిక విలువలు, ఉత్తమ సమాజనిర్మాణం, వ్యక్తిత్వ వికాసం, కలుగుతుందన్నారు. గీతలోని శ్లోకాలన్నీ మహామంత్రాలనీ, ఇది జీవనగీత కాని మరణగీత కాదని, అభ్యుదయ, నిశ్శ్రేయస్సులు రెండూ బోధించి కృష్ణుడు జగద్గురువయ్యాడని చెప్పి, 'గీత నేర్చుకో రాతమార్చుకో' అని సందేశమిచ్చి, 'గీత'ను జాతీయ గ్రంథంగా ప్రకటించాలని కోరారు. మన జీవితానికి పనికొచ్చే అనేక శ్లోకాలనుదాహరించారు. ఈ వ్యాసం చదివితే నేటి యువతకు వ్యక్తిత్వ వికాసం తప్పకుండా కలుగుతుంది.

ఇలాంటి అష్టవ్యాసాలతో అష్టాదశ పర్వాలున్న మహాభారతం లోని విషయాలను స్థూలంగానైనా ప్రజలకు ముఖ్యంగా యువతకు అందిస్తుంది "యువభారతి" ఈ గ్రంథాన్ని. తప్పకుండా ప్రతి ఒక్కరూ చదివి నేటి సమాజాన్ని, విలువలు గలిగిన సమాజంగా తీర్చిదిద్దాలని కోరుతున్నాను.

–డా॥ బ్రాహ్మణపల్లి జయరాములు





# ఎందరో మహానుభావులు...

యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ 59 ఏళ్లు పూర్తిచేసుకుని 60 ఏట అడుగిడిన సందర్భంగా పలు సాహితీ కార్యక్రమాలకు శ్రీకారం చుట్టింది. ఇందులో భాగంగా నన్నయ 'మహాభారతం' సహస్రాబ్దిని పురస్కరించుకుని 'మహాభారతోపన్యాసలహరి' కార్యక్రమాన్ని నిర్వహించాలని నిర్ణయించింది.

యువభారతి ఆలోచనలను అభినందించి, వెన్ను తట్టి ప్రోత్సహించి అనేక సూచనలు చేసి అండగా నిలబడిన మా సంస్థ గౌరవ సభ్యులు, విశ్రాంత ఐఎఎస్ అధికారి, తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ సలహాదారు డాక్టర్ కె.వి.రమణాచారి గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు సమర్పిస్తున్నాము.

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని..." అంటూ నన్నయ రాసిన పద్యంలోని వివిధ అంశాలపై ప్రసంగించాలని కోరగానే దయతో అంగీకరించిన ఆచార్య శలాక రఘునాథ శర్మ, డాక్టర్ మైలవరపు శ్రీనివాసరావు, బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ, ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి, పద్మశ్రీ డా. గరికిపాటి నరసింహారావు, డాక్టర్ ఎన్.అనంతలక్ష్మి, డాక్టర్ కడిమెళ్ల వరప్రసాద్, శ్రీ ఎల్.వి.గంగాధరశాస్త్రి గార్లకు మా నమోవాకములు. ప్రసంగవ్యాసాలను 'మహాభారతోపన్యాసలహరి'గా వెలువరించనున్నట్లు చెప్పగానే వక్తలు తమ వ్యాసాలను ముందుగా అందజేయడం జరిగింది. అందుకు వారికి ధన్యవాదాలు.

మహాభారతోపన్యాసలహరి గ్రంథంలో తమ వ్యాపార ప్రకటనల నందించి ఆర్థికంగా సహకరించిన సింగరేణి కాలరీస్ యాజమాన్యానికి, తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ సమాచార పౌరసంబంధాల శాఖ వారికి, పర్యాటక శాఖ వారికి మా హృదయ పూర్వక ధన్యవాదాలు.

ఈ కార్యక్రమ నిర్వహణకై రూ. 50,000/-విరాళంగా అందించిన ఐ.ఐ.ఎం.సి. యాజమాన్యానికి మా హృదయపూర్వక ధన్యవాదాలు. అలాగే ఈ కార్యక్రమ నిర్వహణ

నిమిత్తం రూ. 30,000/– అందించిన మా యువభారతి పూర్వాధ్యక్షులు శ్రీ మాడభూషి అనంతాచార్య గారికి మా కృతజ్ఞతలు.

ఈ పుస్తక ప్రచురణకు యథాశక్తి విరాళాల నందించి మమ్ములను ప్రోత్సహించిన మిత్రులకు, శ్రేయోభిలాషులకు మా అభివాదాలు. ఈ పుస్తకానికి ప్రచురణపూర్వ విరాళాలను సేకరించటంలో సహకరించిన మిత్రులకు, అలాగే ప్రచురణపూర్వ విరాళాల నందించిన మిత్రులకు మా కృతజ్ఞతలు.

ముద్రణ కార్యక్రమాన్నంతటినీ తన భుజస్కంధాలపై వేసుకుని, పుస్తకాన్ని అందంగా ముద్రించి సకాలంలో అందించిన మా యువభారతి చిరకాల మిత్రుడు 'పుస్తక శిల్పి' శ్రీ తాళ్ళపల్లి మురళీధర్ గౌడ్ గారికి మా ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ పుస్తకానికి డీటీపి లేఅవుట్‌లను సమకూర్చిన శ్రీ కుడిపూడి భాస్కర్ గారికి, ముఖపత్రాన్ని అందంగా తీర్చిదిద్దిన నవ్య ప్రింటర్సు మోతీనగర్ వారికి మా కృతజ్ఞతలు.

పుస్తకాన్ని అందంగా అచ్చువేసి సకాలంలో అందించిన కర్షక్ ఆర్ట్ ప్రింటర్సు, విద్యానగర్ వారికి మా హార్దిక అభివాదాలు.

"మా కార్యక్రమానికి ఇతోధిక ప్రచారం కల్పించడంలో సహకరించిన వివిధ వార్తాపత్రికల యాజమాన్యాలకు, విలేకరులకు, టీవీ ఛానళ్ల వారికి మా ధన్యవాదాలు.

ఈ కార్యక్రమ నిర్వహణలో పాలుపంచుకున్న ప్రతి ఒక్కరికీ పేరుపేరునా మా కృతజ్ఞతలు.

**కనిపించినది ఇందరు. కనిపించని వారు ఎందరో!**
**అందరూ మహానుభావులే. అందరికీ మా వందనాలు.**

–జీడిగుంట వెంకట్రావు
కార్యదర్శి



శృంగేరి జగద్గురువుల ఆశీస్సులతో...

**శ్రీ శృంగేరి శారదా శంకరమఠం, మోతీనగర్** మరియు
**తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ భాషాసాంస్కృతిక శాఖ వారి సౌజన్యంతో**
**తెలుగు మహాభారత సహస్రాబ్ది ఉత్సవాల సందర్భంగా**
**యువభారతి** నిర్వహిస్తున్న

# మహాభారతోపన్యాస లహరి

**తెలుగు మహాభారత సహస్రాబ్ది ఉత్సవములు**

ది. 24.12.2022 శనివారం నుండి
ది. 31.12.2022 శనివారం వరకు

ప్రతిరోజు సాయంత్రం గం|| 5:30 ని||ల నుండి

స్థలం:

**శ్రీ శృంగేరి శంకరమఠం**
మోతీనగర్, హైదరాబాద్.



"చుట్టూరా ఆవరించుకొన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవటం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించటం మంచిది" అన్న వాక్యమే ఊపిరిగా 1963 వ సంవత్సరం విజయదశమి నాడు "యువభారతి" ఆవిర్భవించింది. సమాజంలో సామరస్యాన్ని పెంపొందించటానికి సాహిత్యాన్ని మించిన సాత్విక సాధనం వేరొకటి లేదనే దృఢ విశ్వాసంతో కడచిన 59 సంవత్సరాలుగా తెలుగు భాషామతల్లికి యథాశక్తి తన సేవలను అందించింది.

ఇంతవరకు వివిధ ప్రక్రియలలో 200 పుస్తకాలను వెలువరించి తెలుగు జాతికి అందించింది. "లహరి" ఉపన్యాస పరంపరలో ఇంతవరకు పలువురు కవుల కావ్యాలపైన, వ్యక్తిత్వాలపైన ఉపన్యాసాల నేర్పాటు చేసి ఆ ఉపన్యాసాలను పుస్తకరూపంలో వెలువరించింది. "సాహితీవాహిని" పరంపరలో అనేకమంది కవుల సాహిత్య వ్యక్తిత్వాలను తెలుగు జాతికి పరిచయం చేసింది. అంతేకాక అనేక మంది యువ కవుల, కథకుల, రచయితల పుస్తకాలను ప్రచురించి ప్రోత్సహించింది.

కడచిన విజయదశమికి 60వ సంవత్సరంలో అడుగిడింది. ఈ వజ్రోత్సవాల సందర్భంగా, అలాగే తెలుగు మహాభారత సహస్రాబ్ది ఉత్సవాలను పురస్కరించుకుని ఆంధ్ర మహాభారత అవతారికలో క్రింది పద్యంలో నన్నయ మహాకవి వ్యక్తపరచిన ఆంతర్యం ప్రాతిపదికగా, మహాభారత మహాకావ్య వైశిష్ట్యం, ఔన్నత్యం, యువతరానికి హితకరంగా అవగతమయ్యేలా మహాభారతోపన్యాస లహరి పేర ఉపన్యాన కార్యక్రమాన్ని నిర్వహించాలని సంకల్పించాము.

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని – యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని – కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని – యైతిహాసికు లితిహాస మనియు
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ–యంబని మహి గొనియాడుచుండ
వివిధవేదతత్త్వవేది వేదవ్యాసు – డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండ జేసె భారతంబు.

## మహాభారతోపన్యాస లహరి

ఈ కార్యక్రమం శృంగేరి జగద్గురువుల ఆశీస్సులతో, హైదరాబాద్ లోని మోతీనగర్ శారదా శంకరమఠ ప్రాంగణంలో డిసెంబరు నెల 24 వ తేదీ నుండి 31వ తేదీ వరకు సాయంకాలం గం. 5.30ని లకు జరుగనున్నది.

| తేదీ | విషయం | వక్త |
|---|---|---|
| 24 | మహాభారతము - ధర్మశాస్త్రం | ఆచార్య శలాక రఘునాథ శర్మ |
| 25 | మహాభారతము - ఇతిహాసము | డా. మైలవరపు శ్రీనివాసరావు |
| 26 | మహాభారతము - వేదాంతము | బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖ శర్మ |
| 27 | మహాభారతము - నీతి శాస్త్రము | ఆచార్య కసిరెడ్డి వెంకట రెడ్డి |
| 28 | మహాభారతము - మహాకావ్యము | డా. గరికిపాటి నరసింహారావు |
| 29 | మహాభారతము - బహు పురాణ సముచ్చయము | డా. ఎన్.అనంత లక్ష్మి |
| 30 | మహాభారతము - సర్వలక్ష్య సంగ్రహం | డా. కడిమిళ్ళ వరప్రసాద్ |
| 31 | మహాభారతము - భగవద్గీత | శ్రీ ఎల్.వి. గంగాధర శాస్త్రి |

## ప్రచురణ పూర్వ విరాళం

పై వ్యాసాలనన్నిటినీ ""మహా భారతోపన్యాస లహరి" పేర ఒక గ్రంథరూపంలో వెలువరించాలని సంకల్పించాము. 1/8 డెమీ సైజులో అచ్చులో దాదాపు 200 పుటలుండే ఈ పుస్తకానికి ధర రూ.200/- గా నిర్ణయించటం జరిగింది. అయితే 31-12-2022 లోగా ప్రచురణ పూర్వ విరాళం గా రూ. 100/- అందించిన సాహితీ బంధువులకు ఆవిష్కరణ రోజున పుస్తకాన్ని అందించటం జరుగుతుంది.

**ప్రచురణ పూర్వ విరాళం ఎలా అందించాలి?**

మీ ప్రచురణ పూర్వ విరాళాన్ని మీరు మా సమావేశాలలో అంటే డిశంబరు నెల 24 నుండి 31 వరకు చెల్లించి లేదా మా బ్యాంకు అకౌంట్ లో జమచేసి రసీదు పొందవచ్చు.

**యువభారతి బ్యాంక్ అకౌంట్ వివరాలు:**

**Yuvabharathi**

S.B.A/c no: 020110100006807 Bank: Union Bank of India Himayatnagar, Hyderabad. IFS Code: UBIN0802018

ఈ కార్యక్రమంకోసం ప్రత్యేకంగా మోతీనగర్ చుట్టుప్రక్కల ప్రాంతాలలోని సాహిత్యాభిమానుల సౌకర్యార్థం మా ఉపాధ్యక్షులు శ్రీ ఎ.నాగేశ్వరరావుగారి గృహమునందు మా తాత్కాలిక కార్యాలయాన్ని ఏర్పాటు చేశాము.

తాత్కాలిక కార్యాలయ చిరునామా:

ఫ్లాట్ నం. 205, పరమేశ్వరి అపార్ట్మెంట్స్, ప్లాట్ నం. 95, మోతీనగర్, హైదరాబాద్-500114. మీ ప్రచురణ పూర్వవిరాళాన్ని శ్రీ నాగేశ్వరరావు గారికి నగదు రూపంలో కాని, ఫోన్ పే నంబరు: 8985764840 ద్వారా గాని చెల్లించి రసీదును పొందవచ్చు. మరిన్ని వివరాలకు ఫోన్ : 9247328440 నందు వారిని సంప్రదించవచ్చును.

మీరందరూ అధిక సంఖ్యలో సమావేశాలకు హాజరు కావాలని, ఇతోధికంగా ప్రచురణ పూర్వ విరాళాలనందించి మమ్ములను ప్రోత్సహించాలని ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ.....

మీ

◆ **యువభారతి** ◆

| | |
|---|---|
| **డా॥ ఆచార్య ఫణీంద్ర**<br>అధ్యక్షుడు<br>99598 82963 | **జీడిగుంట వెంకట్రావు**<br>కార్యదర్శి<br>93913 73684 |
| **ఆమాతి రవీంద్ర**<br>కోశాధికారి<br>98499 09896 | **డా॥ వంగపల్లి విశ్వనాథం**<br>వ్యవస్థాపక సమావేశకర్త<br>79891 80414 |
| **ఎ. నాగేశ్వరరావు**<br>సమన్వయ కర్త<br>89857 64840 | **మలపాక పూర్ణచంద్రరావు**<br>సమావేశకర్త<br>97010 01876 |

# ప్రసంగకర్తలకు మేము వ్రాసిన నమూనా లేఖ

తేదీ :...............

సుప్రసిద్ధ సాహితీమూర్తి

శ్రీ .......................... గారికి నమః

మాన్య మహోదయా! / విదుషీమణీ!

"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవటం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించటం మంచిది" అన్న సూక్తి స్ఫూర్తిగా, కడచిన 59 వత్సరాలుగా తెలుగు నాట – "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ సామాజికోపయుక్తమైన అనేక సత్సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తూ, యువతకు సౌమనస్యం, సౌశీల్యం సంతరింపజేసేందుకు ఉపకరించే విధంగా పండితోత్తములచే, సాహితీ వేత్తలచే ఇంత వరకు .. ద్విశత గ్రంథాలను వ్రాయించి, ప్రచురించి, ప్రజా బాహుళ్యానికి ఉపాయనంగా సమర్పించిన విషయం తమవంటి పెద్దలకు సుపరిచితమే!

లోగడ "యువభారతి" సంస్థ – "కావ్య లహరి", "చైతన్య లహరి", "సంస్కృత సాహితీ లహరి", "జగద్గురు సాహితీ లహరి", "రామాయణ సుధా లహరి" వంటి మన సంస్కృతి, సంప్రదాయ, సదాచారాల పట్ల యువతరానికి సదవగాహనను కల్పించే అనేక ప్రసంగ కార్యక్రమాలను నిర్వహించి, గ్రంథ రూపంలో అందించిన విషయం సైతం తమకు విదితమే! ఆ పరంపరలో భాగంగా .. ప్రస్తుతం "యువభారతి" షష్ట్యబ్దిలో అడుగిడిన శుభ తరుణంలో, ఆదికవి నన్నయ భట్టారకుని సహస్రాబ్ది సందర్భాన్ని కూడ పురస్కరించుకొని, తెలుగు మహాభారత మహాకావ్య సారాంశాన్ని, సందేశాన్ని మన ఈ అధునాతన సమాజానికి, ముఖ్యంగా యువతరానికి హితకరంగా అన్వయిస్తూ .. "మహాభారతోపన్యాసలహరి" పేరిట ఒక మహత్తరమైనహో కార్యక్రమానికి రూపకల్పన చేసామని తెలియజేయడానికి మిక్కిలి సంతోషిస్తున్నాం.

*"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని,*
*యధ్యాత్మవిదులు వేదాంతమనియు,*
*నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని,*
*కవివృషభులు మహాకావ్యమనియు,*
*లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహమని,*
*యైతిహాసికు లితిహాస మనియు,*
*పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్ఛ*
*యంబని మహి గొనియాడుచుండ –*

*వివిధ వేద తత్త్వవేది వేదవ్యాసు*
*డాది ముని పరాశరాత్మజుండు,*
*విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై*
*పరగుచుండ జేసె భారతంబు!"*

అని తెలుగు మహాభారతం అవతారికలో నన్నయ మహాకవి వ్యక్తపరచిన ఆంతర్యం ప్రాతిపదికగా... సమకాలీన యువతకు, రాబోవు తరాలకు "మహాభారత మహాకావ్య" వైశిష్ట్యం, ఔన్నత్యం సులభగ్రాహ్యంగా అవగతమయ్యేలా ప్రసంగ కార్యక్రమాల నిర్వహణతోబాటు, గ్రంథ రూపంలో కూడ వెలువరించేందుకు సంకల్పించాం.

మా "యువభారతి" సంస్థకు మార్గదర్శి, మా సంస్థ విశిష్ట గౌరవ సభ్యులు, "తెలంగాణ రాష్ట్రప్రభుత్వ సలహాదారు" అయిన డా. కె.వి.రమణాచారి గారు మీతో ఈ విషయం ఇదివరకే ప్రస్తావించిన సంగతిని గుర్తు చేస్తూ .. ఆ ప్రకారంగా మిమ్మల్ని– (తేది, వారం)– నాడు సాయంత్రం 5.30 గంటలకు హైదరాబాదులోని మోతీనగర్ "శ్రీ శృంగేరి శంకర మఠం ప్రవచన మందిరం"లో "మహాభారతం––" అన్న అంశంపై సోదాహరణ ప్రసంగం చేయవలసిందిగా సాదరాహ్వానం పలుకుతూ, వినయపూర్వకంగా ప్రార్థిస్తున్నాం.

అట్లాగే .. గ్రంథ ముద్రణను సకాలంలో నిర్వహించి, కార్యక్రమం సంపూర్తి అయ్యే రోజు .. అనగా ... 31 డిసెంబర్ 2022 నాడు గ్రంథావిష్కరణ జరిపేందుకు వీలుగా, మీ ప్రసంగ పాఠాన్ని (అచ్చులో 1/8 డెమీ సైజులో 15 నుంచి 20 పుటలకు మించకుండా వచ్చేలా) మాకు 10 డిసెంబర్ 2022 తేదీలోగా అందజేయ

వలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. మా ఈ బృహత్కార్యక్రమ నిర్వహణలో తమ వంతు సహకారం అందజేయనున్న మీకు ఉడుతాభక్తితో, మా సంస్థ పక్షాన రూ. 10,116/ – పారితోషికంగా అందజేయగలమని విన్నవించుకొంటున్నాం. మాపై దయతో మీరు తమ అంగీకృతిని ఈ లేఖతో జతపరిచిన మా చిరునామా గల కవరు ద్వారా, వీలయినంత త్వరలో తెలియజేయగలరని ఆశిస్తున్నాం.

సవినయంగా –

**డా. ఆచార్య ఫణీంద్ర**
అధ్యక్షులు, యువభారతి
హైదరాబాదు

చిరునామా : 'శ్రీకరం'
6–34/48/1, బాలాజీనగర్ కాలనీ
దుబాయి బిల్డింగ్ ఎదురుగా
దమ్మాయిగూడ, హైదరాబాదు – 500 083
ఫోన్ నం. 99598 82963

శృంగేరి జగద్గురువుల ఆశీస్సులతో...

*శ్రీ శృంగేరి శారదా శంకరమఠం, మోతీనగర్*

**మరియు**

*తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ భాషాసాంస్కృతిక వ్యవహారాల శాఖ సౌజన్యంతో*

**యువభారతి**

నిర్వహిస్తున్న తెలుగు మహాభారత సహస్రాబ్ది ఉత్సవాల

***ఆహ్వానము***

# మహాభారతోపన్యాస లహరి

**తెలుగు మహాభారత సహస్రాబ్ది ఉత్సవములు**

**ది. 24.12.2022 నుండి ది. 31.12.2022 వరకు**

**ప్రతిరోజు సాయంత్రం గం॥ 5:30 ని॥ల నుండి**

స్థలం:

**శ్రీ శృంగేరి శంకర మఠం**

మోతీనగర్, హైదరాబాద్.

*అందరూ ఆహ్వానితులే*

◆ *మొదటి సమావేశం* ◆

**ది. 24 డిసెంబరు, 2022 శనివారం**

ముఖ్య అతిథి: **డా. కె.వి.రమణాచారి**

*తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ సలహాదారు*

విశిష్ట అతిథి: **శ్రీ తనికెళ్ళ భరణి**

*ప్రముఖ రచయిత, నటుడు*

అంశం: **మహాభారతము – ధర్మశాస్త్రము**

వక్త: **ఆచార్య శలాక రఘునాథ శర్మ**

◆ *రెండవ సమావేశం* ◆

**తేది. 25 డిసెంబరు 2022 ఆదివారం**

ముఖ్య అతిథి: **డా. రేవూరి అనంత పద్మనాభరావు**

*సాహితీవేత్త, దూరదర్శన్ పూర్వ డిప్యూటీ డైరెక్టర్ జనరల్*

అంశం: **మహాభారతము–ఇతిహాసము**

వక్త: **డా. మైలవరపు శ్రీనివాసరావు**

*ప్రముఖ ఆధ్యాత్మిక వేత్త*

◆ మూడవ సమావేశం ◆

**తేది. 26 డిసెంబరు, 2022 సోమవారం**

ముఖ్య అతిథి: **శ్రీ రేమెళ్ళ అవధానులు**

వేదభారతి వ్యవస్థాపకులు

అంశం: **మహాభారతము – వేదాంతము**

వక్త: **బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖ శర్మ**

ప్రముఖ ఆధ్యాత్మిక వేత్త

◆ నాల్గవ సమావేశం ◆

**తేది. 27 డిసెంబరు, 2022 మంగళవారం**

ముఖ్య అతిథి: **డా. మామిడి హరికృష్ణ**

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ భాషాసాంస్కృతిక శాఖ, సంచాలకులు

అంశం: **మహాభారతము – నీతిశాస్త్రము**

వక్త: **ఆచార్య కసిరెడ్డి వెంకట రెడ్డి**

విశ్రాంత ఆచార్యులు

◆ ఐదవ సమావేశం ◆

**తేది. 28 డిసెంబరు, 2022 బుధవారం**

ముఖ్య అతిథి: **శ్రీ సి.ఎస్.ఆర్.మూర్తి**

శ్రీ శృంగేరి శారదా శంకరమఠం ధర్మాధికారి

అంశం: **మహాభారతము – మహాకావ్యము**

వక్త: **పద్మశ్రీ గరికిపాటి నరసింహారావు**

◆ ఆరవ సమావేశం ◆

**తేది. 29 డిసెంబరు, 2022 గురువారం**

ముఖ్య అతిథి: **డా. ముక్తేవి భారతి**

ప్రముఖ రచయిత్రి

అంశం: **మహాభారతము – బహు పురాణ సముచ్చయము**

వక్త: **డా॥ నందివాడ అనంతలక్ష్మి**

ప్రముఖ ఆధ్యాత్మిక వేత్త

## ◆ ఏడవ సమావేశం ◆

**తేది. 30 డిసెంబరు, 2022 శుక్రవారం**

ముఖ్య అతిథి: **డా॥ చిర్రావూరి శివరామకృష్ణ శర్మ.**

ప్రముఖ సంస్కృత, ఆంధ్ర విద్వాంసులు

అంశం: **మహాభారతము - సర్వ లక్ష్య సంగ్రహము**

వక్త: **డా. కడిమిళ్ళ వరప్రసాద్**, గురుసహస్రావధాని

## ◆ ఎనిమిదవ సమావేశం ◆

**తేది. 31 డిసెంబరు, 2022 శనివారం**

ముఖ్య అతిథి, గ్రంథావిష్కర్త: **డా. కె.వి.రమణాచారి**

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ సలహాదారు

అంశం: **మహాభారతము- భగవద్గీత**

వక్త: **శ్రీ ఎల్.వి.గంగాధర శాస్త్రి**, గీతా ఫౌండేషన్ వ్యవస్థాపకులు

## ◆ సభా వేదికను చేరుకునేందుకు మార్గాలు ◆

*సిటీ బస్సులో అయితే:*

1. 9 F, 9 Y/F సి.బి.ఎస్. నుండి మోతీనగర్, బోరబండ.
2. 10 F, 10Y/F సికింద్రాబాద్ నుండి మోతీనగర్, బోరబండ

మెట్రో రైల్ అయితే: ఎర్రగడ్డ మెట్రో స్టేషన్ దిగి ఆటో లో.

*గూగుల్ లో అయితే :*

శంకరమఠం, మోతీనగర్ అని సెర్చ్ చేయండి. మీరందరూ అధిక సంఖ్యలో సమావేశాలకు హాజరు కావాలని, ఇతోధికంగా ప్రచురణ పూర్వ విరాళాలనందించి మమ్ములను ప్రోత్సహించాలని ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ .....

మీ

## ◆ యువభారతి ◆

**డా॥ ఆచార్య ఫణీంద్ర**
అధ్యక్షుడు, 99598 82963

**ఆమాతి రవీంద్ర**
కోశాధికారి, 98499 09896

**ఎ. నాగేశ్వరరావు**
సమన్వయకర్త 89857 64840

**జీడిగుంట వెంకట్రావు**
కార్యదర్శి, 93913 73684

**డా॥ వంగపల్లి విశ్వనాథం**
వ్యవస్థాపక సమావేశకర్త, 79891 80414

**మలపాక పూర్ణచంద్రరావు**
సమావేశకర్త, 97010 01876



## మహాభారతోపన్యాస లహరి కార్యక్రమానికి
## రూ.1000 లేదా అంతకు మించి విరాళాల నందించిన వదాన్యులు

| | | |
|---|---|---|
| 1. | ఐ.ఐ.ఎం.సి. హైదరాబాద్ | రూ. 50,000/- |
| 2. | శ్రీ మాడభూషి అనంతాచార్య | రూ. 30,000/- |
| 3. | శ్రీ ఎం.ఎస్.ఆర్.ఆంజనేయశర్మ | రూ. 11,001/- |
| 4. | డా. గరికిపాటి నరసింహారావు | రూ. 10,116/- |
| 5. | శ్రీమతి పి.లక్ష్మీ కుమారి, శ్రీ పి.పూర్ణచంద్రరావు | రూ. 10,116/- |
| 6. | శ్రీమతి ఎ.ఎన్.కవిత | రూ. 5,116/- |
| 7. | శ్రీ గుత్తికొండ సుబ్బారావు | రూ. 5,001/- |
| 8. | డా॥ వంగపల్లి విశ్వనాథం | రూ. 5,000/- |
| 9. | శ్రీ కూర రఘువీర్ | రూ. 5,000/- |
| 10. | శ్రీ ఎస్.వి.ప్రభాకర రావు | రూ. 5,000/- |
| 11. | శ్రీమతి పి.మాధవి, శ్రీ.పి.శేషగిరిరావు | రూ. 5,000/- |
| 12. | శ్రీ పొదిలి శంకర పిచ్చయ్య | రూ. 5,000/- |
| 13. | శ్రీ సింగంపల్లి వేంకటేశ్వరరావు | రూ.3,116/- |
| 14. | శ్రీ ఎం.ఒ.భాస్కర శాస్త్రి | రూ.2,018/- |
| 15. | శ్రీ పి.ఉదయ భాస్కర్ | రూ. 3,000/- |
| 16 . | శ్రీ జె. రామ్మోహన్ | రూ. 2,000/- |
| 17. | శ్రీమతి వనజ | రూ. 2,000/- |
| 18. | ఆచంట సుధాకర్ | రూ. 2,000/- |
| 19. | డా॥ ఎస్.నారాయణరెడ్డి | రూ. 1,500/- |
| 20. | చి॥ ఆమాతి అయాన్ష్ ఆవిష్కార్ | రూ. 1,120/- |
| 21. | డా॥ జయప్రకాశ్ నారాయణ | రూ. 1,116/- |
| 22. | డా॥ రేవూరి అనంతపద్మనాభరావు | రూ. 1,116/- |
| 23. | శ్రీ ఐ.పెరుమాళ్లు | రూ. 1,116/- |
| 24. | శ్రీ మాగంటి రఘురాం | రూ. 1,116/- |
| 25. | శ్రీ.కె.వి.ఎస్.సుబ్రహ్మణ్యం | రూ.1,000/- |
| 26. | డా॥ గంగిశెట్టి లక్ష్మీనారాయణ | రూ. 1,000/- |
| 27. | డా॥ ఆచార్య ఫణీంద్ర | రూ. 1,000/- |
| 28. | శ్రీ పి.వేణుగోపాలరావు | రూ. 1,000/- |
| 29. | శ్రీ రామశాస్త్రి | రూ. 1000/- |



# అనుక్రమణిక







# యువభారతి

(సాహితీ సాంస్కృతిక సంస్థ)

తెలంగాణ సారస్వత పరిషత్ భవనం, తిలక్ రోడ్, హైదరాబాద్-1

**అందుబాటులో ఉన్న కొన్ని మా ప్రచురణలు**

| క్ర. సం. | ప్రచురణ సం. | పుస్తకం పేరు | వెల.రూ. |
|---|---|---|---|
| 1. | 19 | ప్రజాసూక్తం (తెలుగు సామెతల సంకలనం) | 50/- |
| 2. | 29 | భావన (సుభాషితాల సంకలనం) | 50/- |
| 3. | 100 | సంస్కృత సాహితీలహరి | 20/- |
| 4. | 121 | నవ్య సాహితీలహరి | 25/- |
| 5. | 127 | యువత | 25/- |
| 6. | 176 | వేద విజ్ఞాన లహరి | 100/- |
| 7. | 178 | ఉపనిషత్ సుధాలహరి | 100/- |
| 8. | 179 | వ్యక్తిత్వ వికాసం (సూత్రాలు-సూక్తులు) | 50/- |
| 9. | 191 | అమరుడు బాపూజీ: దేవులపల్లి ప్రభాకరరావు | 50/- |
| 10. | 192 | నాటకపద్యాలు : విహారి | 50/- |
| 11. | 193 | పుంభావ సరస్వతి పుట్టపర్తి : డా॥పుట్టపర్తి నాగపద్మిని | 50/- |
| 12. | 194 | అభినవ పోతన-వానమామలై: డా॥తిరుమల శ్రీనివాసాచార్య | 40/- |
| 13. | 195 | తెలుగు సొగసులు : సుధామ | 50/- |
| 14. | 196 | విజయపథం : అయలసోమయాజుల నాగేశ్వరరావు | 100/- |
| 15. | 197 | నేర్పుగా జీవించడం ఎలా? : ఎర్రాప్రగడ రామకృష్ణ | 100/- |
| 16. | 198 | చేగొండి కథాకదంబం (2వ భాగం) | 150/- |
| 17. | 199 | చేగొండి కథాకదంబం (3వ భాగం)<br>.... చేగొండి రామజోగయ్య | 150/- |
| 18. | 200 | అమృత భారతి : వ్యాస సంపుటి | 200/- |
| 19. | 201 | ద్విశత భారతి : సం॥ అశ్వనీకుమార్ | 100/- |
| 20. | 202 | దక్షిణభారత వనితా వాగ్గేయవాఙ్మయం:డా.వై.కృష్ణకుమారి | 80/- |
| 21. | 203 | భారత భారతి : డా. ఆచార్య ఫణీంద్ర | 80/- |
| 22. | 204 | నన్నయగారి సూక్తిసుధ: అయలసోమయాజుల నాగేశ్వరరావు | 80/- |
| 23. | 205 | మహాభారతోపన్యాసలహరి | 200/- |

# మహాభారతము - ధర్మశాస్త్రము

మహామహోపాధ్యాయ, ఆంధ్రభాషాభూషామణి
డా॥ శలాక రఘునాథశర్మ
98660 68542

పరమాత్మ సగుణరూపం అయిన శ్రీమన్నారాయణుని సితాసితకేశ ద్వయం ద్వాపర యుగంలో రాముడుగా కృష్ణుడుగా అవతరించింది. అవతార ప్రధాన ప్రయోజనం ధర్మస్థాపన. దానికి అంగాలు రెండు– దుష్టశిక్షణ, శిష్టరక్షణ. ఇతిహాసపురాణాలను జాగ్రత్తగా గమనిస్తే ఈ రెండు అంగాలకు ఒక విశేష అర్థస్ఫూర్తి కలుగుతుంది. దుష్టత్వం అంటే అధర్మం. శిక్షణ అంటే దానిలోని లోకపీడనాత్మక జాడ్యాన్ని తొలగించి దానిని ధర్మముగా పరివర్తనం చేయటం. అలాగే శిష్టత అంటే సత్ప్రవర్తన. రక్షణ అంటే అది మనుష్యుల త్రికరణాలనుండి జారిపోకుండా కాపాడటం. కాబట్టి దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మస్థాపన అనే మూడూ పేరుకు మూడే కానీ తాత్పర్యంలో అది ముమ్మొనవాలు. దానికి ఒకే ఒక్క పేరు ధర్మం.

పురుషార్థాలు అని ఒక వ్యవహారం సనాతన భారతీయ సంప్రదాయంలో నాలుగుకోళ్ళ దివ్యపీఠం. దర్శనం ఏకముఖంగా సాగటం మహాత్ములకు తప్ప సామాన్యులకు సాధ్యం కాదు కాబట్టి ఒక్కటే అయిన దానిని నాలుగుగా దర్శించి సాధించినా పరమార్థమే అవుతుంది అని విభజించి చెప్పారు కానీ నిజానికి పురుషార్థం ఒక్కటే. అది మోక్షం. అదే సాధనదశలో మళ్ళీ ఒక్కటిగానే సంభావనకు వస్తుంది. అప్పటిదాని పేరు 'ధర్మం'. మటి అర్థ కామాలలో అంటే అవి కూడా ధర్మమునకు పర్యాయపదాలే. లేదా మరొకరకంగా తెలియవచ్చే ధర్మమే. అయితే నాలుగని చెప్పటంలో ఆంతర్యం ఏమిటి? మహాపదార్థాన్ని అఖండంగా దర్శించటం, పట్టుకోవటం, అదే అయిపోవటం, ఆ స్థితినుంచి అవి చలితంగా ఏకత్వభావనతో స్థిరంగా ఉండటం అల్పశక్తిమంతుడైన నరునకు మోయలేని భారాలు కనుక నాలుగుగా విభజించి

చెప్పాడు నరసముదాయానికి పరమ అయనం అయిన నారాయణుడు. విభజించినా దేనికదిగా భావించకు. నాలుగింటికీ ఒక సూత్రబద్ధత ఉంది అని ఎక్కడికక్కడ చెప్తూనే వచ్చాడు. సారాంశం ఏమంటే ఉన్నది, సత్యమయినది, సాధించవలసినదీ ధర్మం ఒక్కటే.

* * *

చాలా చాలా చమత్కారమైన విషయం ఏమిటంటే లోకకంటకులై రాక్షసప్రవృత్తి నిలువెల్లా నింపుకొన్న అధర్మాత్ములనే ముద్రపడిన కొందరు కొన్ని సందర్భాలలో ధర్మమును గూర్చి పెద్ద పెద్ద మాటలనటం.

భారతంలో సభాపర్వంలో శిశుపాలుడు పాండవుల నుద్దేశించి –

*బాలా దయం నజానీధ్వం ధర్మః సూక్ష్మో హి పాణ్డవః (స. 37. 3.)*
*కదుకొని ధర్మతత్త్వ మెఱుగంగ నశక్యము (సభా 2)*

అంటాడు. ఇందులో చమత్కారం ఏమిటంటే మూర్తీభవించిన అధర్మం కూడా ధర్మాన్నాక్షేపించటానికి ధర్మాన్నే ఆధారదండంగా పరిగ్రహిస్తుంది. అయితే అది హృదయదఘ్నం కాదు. నాలుక చివర మాత్రమే నాట్యమాడుతూ ఉంటుంది.

కాగా ధర్మతత్త్వం ఎరగటం అశక్యం కాదు. **"సుసుఖం కర్తు మవ్యయమ్"** అని భగవంతుడు గీతలో అన్నట్లు సుసుఖమే. ఎరిగి, ఆచరించి, తనవారిని ఆ దారిలో తనతోపాటు స్వర్గసీమ పొలిమేరలదాకా తీసుకొని పోయిన ధర్మరాజైన యుధిష్ఠిరుడు, రామాయణంలో మారీచుడు ప్రకటించిన విధంగా **"రామో విగ్రహవాన్ ధర్మః సాధుః సత్యపరాక్రమః"** అనదగిన స్థాయికి ఎదిగి తలయెత్తుకొని నిలబడగలిగాడు. అతడు చేసిన స్వర్గారోహణం స్వస్వరూపానుసంధానాత్మకమైన ధర్మైక్యమే.

ఈ పూర్వరంగంలో ధర్మశాస్త్రసంబంధమైన కొన్ని అంశాలను ముందుగా సమీక్షించుకోవాలి. మనుస్మృతి మొదలైన స్మృతిగ్రంథాలు ధర్మ శాస్త్రపరిధిలోనికి వస్తాయి. శ్రుతి చెప్పిన అర్థాలను స్మరించి లోకానికి మార్గ నిర్దేశం చేసేవానినే శాస్త్రాలు అంటారు. ధర్మస్మరణా, ధర్మశాసనమూ ఒక ప్రణాళిక ప్రకారంగా రూపొందించిన గ్రంథాన్ని ధర్మశాస్త్రంగా పరిగణించాలి. అట్టి వాఙ్మయంలో మొట్టమొదటిదిగా భావనకు వచ్చే

గ్రంథం మనుస్మృతి. అందులో ధర్మమంటే ఏమిటో సూటిగా చెప్పిన శ్లోకాలు కొన్ని ఉన్నాయి.

*విద్వద్భిః సేవితః సద్భి ర్నిత్య మద్వేషరాగిభిః,*
*హృదయే నాభ్యనుజ్ఞాతో యో ధర్మస్తం నిబోధత. (మ.స్మృ. 2.5.)*

రాగద్వేషాలకు వశం కాకుండా వేదతత్త్వం సరిగా తెలుసుకొన్న సత్పురుషులు దేనినైతే హృదయంతో ఇష్టపడి ఆచరిస్తారో అట్టి సదాచారాన్ని ధర్మంగా తెలుసుకోండి.

దీనినిబట్టి సత్పురుషుల ఆచారమే ధర్మం అని తెలుస్తుంది. అయితే సత్పురుషుల లక్షణం ఏమిటి? దీనిని గురించి వేదం ప్రకటించిన అభిప్రాయాలను మనం నిశితంగా పరిశీలించాలి. వేదం ఒక సందర్భంలో ఇలా అంటున్నది–

*అథ యది తే కర్మ విచికిత్సా వృత్తవిచికిత్సా వా స్యాత్*
*యే తత్ర బ్రాహ్మణాః సంమర్శినః*
*యుక్తా ఆయుక్తాః అలూక్షా ధర్మకామాః స్యు*
*యథా తే తత్ర వర్తేరన్ తథా వర్తేథాః. (శిక్షావల్లి. 11 వ అనువాకం.)*

మానవుడా! నీకు ఏదైనా ఒక కర్మవిషయంలోగానీ, నడవడి విషయంలో గానీ సంశయం కలిగితే ఆ సందర్భంలో – అటువంటి సందర్భాలలో బ్రాహ్మణులు సంమర్శులు, యుక్తులు, ఆయుక్తులు, రూక్షస్వభావం లేనివారు, ధర్మకాములు ఎలా ప్రవర్తించి ఉన్నారో – అలా ప్రవర్తించు.

కర్మవిచికిత్స, వృత్తవిచికిత్స అనేమాటలు ధర్మప్రవృత్తికి సంబంధించిన విషయాలే. మానవుడు ధర్మబద్ధమైన జీవితమే గడపాలి. మరొక విధంగా ధర్మబద్ధంగాని జీవితం మానవత్వాన్ని మంటగలిపేది అవుతుంది. అయితే తానాచరిస్తున్న ప్రతికార్యమూ ధర్మబద్ధమా? కాదా? అనేది నిర్ణయించగల శక్తి శాస్త్రానికి మాత్రమే ఉంటుంది. ఆ శాస్త్రంకూడా శ్రుతి స్మృతులకు సమ్మతమై ఉండాలి. కొన్ని సందర్భాలలో ఉన్నదో లేదో తేల్చుకోవలసిన పరిస్థితి ఉంటుంది. దానినే పై వేదవాక్యాలు ప్రస్తావించాయి.

ఆరు మహాలక్షణాలు గలవారిని ఆదర్శప్రాయంగా తీసుకోవాలట. ఆ మహాలక్షణాలలో మొట్టమొదటిది బ్రాహ్మణత్వం. తక్కినవాని సాహచర్యాన్ని బట్టి

యిక్కడ ఈ శబ్దం కేవలం జాతివాచకం కాదని సంభావించాలి. ఎందుకంటే జాతి జన్మతో ఏర్పడుతుంది. సంమర్శిత్వాదులు సాధనతో మాత్రమే సిద్ధించేవి. ఆ వరుసలో చెప్పటంవలన బ్రాహ్మణత్వం కూడా గుణసంబంధమే అని నిర్ణయించక తప్పదు. దానివలన బ్రహ్మజ్ఞానసంపన్నులు బ్రాహ్మణులు అనే అర్థం సిద్ధిస్తుంది. బ్రహ్మము అంటే వేదము, తత్త్వము, తపస్సు, యోగము అనే అర్థాలు ఉన్నాయి కనుక వానిని సాధన చేత పండించుకొన్నవారు ఇచట బ్రాహ్మణులు. విద్యావంతులైన తరువాత ధీశక్తితో కార్యాకార్యములందు విమర్శపాటవం కలవారై నిర్ణయం తీసుకోగలవారై యుండాలి. ఆ దృష్టితో 'సంమర్శినః' అనే పదాన్ని నిలిపింది వేద మాత. ఆ రెంటితోపాటు యుక్తత్వం కలవారై ఉండాలి. యోగనిష్ఠయే యుక్తత. యోగమంటే ఇక్కడ కర్మకౌశలం. ఆచరించి చూపటంలో ఊగిసలాట లేనితనం దృఢత్వం. అది కలవారు 'యుక్తులు'. ఇంకా ఆయుక్తులు కూడా కావాలి. దీనికి, పరప్రేరణాదులు లేకపోవటం అనే అర్థాన్ని భాష్య కారులు చూపారు. అంటే కర్తవ్యనిష్ఠ ఆత్మప్రేరణతోనే కానీ అన్యప్రేరణతో కారాదు. అన్యప్రేరణతో అయితే చెడిపోవటానికి కూడా అన్యప్రేరణ ఉండే ప్రమాదం ఉంటుంది. అయిదవది 'అలూక్షత'. అంటే రూక్షత్వం లేకపోవటం. భారతంలో కౌశికుడనే బ్రాహ్మణుడు నెత్తిమీద రెట్టవేసిందని పక్షిని చూపులతో కాల్చివేసిన సంఘటనను స్మరించాలి. అటువంటి హృదయకాఠిన్యం ఉన్న విద్యావంతులను ప్రక్కన ఉంచివేయాలి. అత్యంత ప్రధానమైన మాట "ధర్మకామాః" ధర్మమునందు నిత్యమైన కామన కలవారిని ఆదర్శప్రాయంగా తీసుకోవాలి.

ఈ ఆరులక్షణాల సమాహారసౌష్ఠవం ఇతిహాసపురాణాలలోని మహాత్ములు రామ, యుధిష్ఠిరాదులవంటి వారి చరిత్రలలో ఉంటుంది. అందువలననే

*ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్,*
*బిభేత్యల్ప శ్రుతా ద్వేదో మామయం ప్రహరిష్యతి. (ఆది. 1.67)*

అంటున్నారు వ్యాసులవారు.

ఇతిహాసపురాణములతో వేదార్థాన్ని హృదయంతో వికసింపజేసుకోవాలి. తదనుగుణంగా నడచుకొని మానవుడు మాధవుడు కావాలి. అర కొరగా వేదం చదివిన వానివలన వేదము అమ్మో! వీడు నన్ను దెబ్బకొడతాడు అని భయపడుతుందట.

కాబట్టి ధర్మతత్త్వం సమగ్రంగా తెలియటానికి, తెలుసుకొన్న తరువాత పటిష్ఠంగా ఆచరణలో పెట్టి ఉత్తమపురుషస్థితిని సంపాదించటానికీ ధర్మశాస్త్రసమగ్రజ్ఞానం అత్యంతావశ్యకమైన విషయం.

* * *

ధర్మశాస్త్రంలో అత్యంతప్రమాణమైన గ్రంథం, శ్రుతి తరువాత మనుస్మృతి. మనుస్మృతినిబట్టి ధర్మలక్షణాన్ని మనం ప్రోదిచేసుకోవచ్చు.

మనుస్మృతి ద్వితీయాధ్యాయారంభంలోని కొన్ని శ్లోకాలను ఈ సందర్భంలో విశ్లేషించుకోవాలి.

వెనుకటి శ్లోకంలో **విద్వద్భిః సేవితః** అనే దానిలో సత్పురుషులు సరిగా తెలిసికొని ఆచరించినదానినే సదాచారం అంటారనీ అదే ధర్మస్వరూప మనీ గమనించాం.

ధర్మప్రమాణాలనుగూర్చి మనుస్మృతి అభిప్రాయం ఇలా ఉన్నది.

*వేదో–ఖిలో ధర్మమూలం స్మృతిశీలే చ తద్విదామ్,*
*ఆచారశ్చైవ సాధూనా మాత్మన స్తుష్టి రేవ చ. (మను. 2.6.)*

కుల్లూకభట్టు వ్యాఖ్యానాన్ననుసరించి, వేదం ఋగ్యజుస్సామాధర్వణ సమాహారం. విధివాక్యాలు, అర్థవాదములయిన మంత్రాలూ వేదస్వరూపం. ధర్మవిషయంలో ప్రమాణం అట్టి వేదం. అంటే వేదము ధర్మశాస్త్రము. ఆచరణలేని శాస్త్రవాక్యం ప్రయోజనకరం కాదు కనుక, వెనువెంటనే శ్లోకంలో **సాధూనాం ఆచారశ్చ** అన్నారు. శాస్త్రం చెప్పిన మాటను సాధువులు ఆచరించి ప్రయోజనం పొంది లోకానికి ప్రమాణబుద్ధిని కల్పిస్తారని ఆ వాక్యభాగపు తాత్పర్యం. పర్యవసానంలో **ఆత్మన స్తుష్టిః ఏవ చ** అంటుంది. తెలిసి కొని, ఆచరించినవానికి ధర్మం పరమప్రయోజనమైన ఆనందాన్నిస్తుంది అని ఆ వాక్యభాగతాత్పర్యం. కాబట్టి వేదచోదితమైన విధివాక్యాలను ఆచరించి ఆనందం పొందటమే ధర్మలక్షణం అని తెలియవస్తున్నది.

*వేదః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః,*
*ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్. (మను. 2.12.)*

అని మనుస్మృతి మరింత విస్పష్టంగా ధర్మలక్షణాన్ని మానవజాతి కందించింది. వేదము, స్మృతి, సదాచారము, ఆత్మపరితుష్టి అని నాలుగు రూపాలుగా ధర్మలక్షణాన్ని మహాత్ములు ప్రకటిస్తారు అని శ్లోకతాత్పర్యం.

ధర్మంవలన మాత్రమే కలిగే మహాఫలాన్ని కూడా మనుస్మృతి ప్రకటించింది.

*శ్రుతిస్మృత్యుదితం ధర్మమనుతిష్ఠన్ హి మానవః,*
*ఇహ కీర్తి మవాప్నోతి ప్రేత్య చానుత్తమం సుఖమ్. (మను. 2.9)*

మానవుడు శ్రుతిస్మృతులు చెప్పిన ధర్మము ననుష్ఠిస్తూ, ఈలోకంలో కీర్తి పొందుతాడు. మరణానంతరం మహానందరూపసుఖాన్ని శాశ్వతంగా పొందుతాడు.

ఈ శ్లోకంలో **అనుతిష్ఠన్** అనే శత్రంతకపదంవలన ధర్మాచరణ శరీరపతనం దాకా చేస్తూ ఉండవలసినదియే అనే అర్థం ప్రతీయమానం అవుతున్నది.

ధర్మస్వరూపాన్ని మనువు మరింత విస్పష్టంగా ప్రకటించారు.

*ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచ మిన్ద్రియనిగ్రహః,*
*ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్. (మను. 6.92.)*

ధర్మమును పది అంశములలో తెలుసుకోవచ్చును.

1. ధృతి – బుద్ధిశక్తి – కార్యాచరణాదులందు పట్టుదల
2. క్షమ – సహనం – ఎట్టి కష్టాన్నైనా, అవమానాన్నైనా తట్టుకోగల శక్తి – **మానావమానయో స్తుల్యః** అన్నట్లు.
3. దమము – మనస్సును అదుపులో ఉంచుకోవటం.
4. అస్తేయం – ఇతరుల ధనాదులను తనది చేసుకోవాలనే భావన లేకుండటం.
5. శౌచమ్ – ఇది రెండు విధాలు – బాహ్యశౌచం, ఆభ్యంతరశౌచం. మొదటిదానిలోనికి స్థూలదేహాన్ని స్నానాదులద్వారా పరిశుద్ధిగా ఉంచుకోవటం ఆభ్యంతరశౌచం.
6. ఇంద్రియనిగ్రహము – ఇంద్రియాలను విషయాలమీదకు పోకుండా నిలువరించటం.

7. ధీః – శాస్త్రాదులను అధ్యయనం చేయటంద్వారా తత్త్వజ్ఞానాన్ని పొందటం.

8. విద్యా – ఆత్మజ్ఞానము – పరమాత్మతత్త్వాన్ని తపస్సు మొదలైనవాని ద్వారా ఎరగటం.

9. సత్యము – నిజమైన దానిని మాత్రమే పలుకటం.

10. అక్రోధము – క్రోధం పొందటానికి తగిన కారణం ఉన్నా క్రోధం పొందకుండా ఉండటం.

మనువు ధర్మశాస్త్రాన్ని విస్పష్టంగా తెలియజెప్పి ధర్మాచరణఫలాన్ని కూడా మరింత స్పష్టంగా వివరించాడు.

*దశలక్షణాని ధర్మస్య యే విప్రాః సమధీయతే,*
*అధీత్య చానువర్తన్తే తే యాన్తి పరమాం గతిమ్. (మను. 6. 93)*

ధర్మపు ఈ పదిలక్షణాలను విద్యావంతులైన మానవోత్తములు చక్కగా అధ్యయనం చేసి, త్రికరణశుద్ధితో ఆచరించినట్లైతే వారు పరమగతికి చేరుకొంటారు. ధర్మాచరణ పరమప్రయోజనం తురీయపురుషార్థలాభం అని శాస్త్రం నొక్కి వక్కాణిస్తున్నది.

* * *

శ్రీకృష్ణద్వైపాయనులవారు మానవజాతియందు పరమవాత్సల్యం కలవారు కనుక మహాభారతవిశ్వరూపంలో ప్రముఖస్థానంలో ధర్మశాస్త్రాన్ని నిబంధించి అందించారు. ధర్మసంబంధంగా వారు నేరుగా నిబంధించిన మహావాక్యాలు పెద్దసంఖ్యలోనే ఉన్నాయి. స్థాలీపులాకన్యాయంగా కొన్నింటిని చూద్దాం.

*ధర్మేచార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ,*
*యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్.*

ధర్మవిషయముననను అర్థవిషయముననను, కామవిషయముననను, మోక్షవిషయముననను, భరతర్షభా! ఇందేది కలదో వేరుగ్రంథములందును అదే, ఇందులేనిది మఱియెందును లేదు.

ఈ వ్యాసవచనాన్నిబట్టి మహాభారతం పురుషార్థసర్వస్వమని తెలుస్తున్నది. నీలకంఠులవారు భారతభావదీపికలో ఒక మహాద్భుతవిషయాన్ని చెప్పారు. వ్యాసవచనంలో దీనికి పూర్వశ్లోకం చూడండి.

*త్రిభిర్వర్షైః సదోత్థాయీ కృష్ణద్వైపాయనో మునిః,*
*మహాభారతమాఖ్యానం కృతవానిదమద్భుతమ్.*

కృష్ణద్వైపాయనముని మూడు సంవత్సరాలకాలంలో నిరంతరంగా మేల్కొని ఈ అద్భుతమైన మహాభారత ఆఖ్యానాన్ని రచించారు.

ఆ శ్లోకంలో ఉన్న అద్భుతత్వాన్ని వివరిస్తూ అద్భుతత్వమేవాహ ధర్మాది చాతుష్టయే ఉపాదేక్ష చకార చతుష్టయోక్తే అధర్మానర్థదుఃఖసంసార రూపే చతుష్కేహాతవ్యే చ విషయే హేయముపాదేయం చ కృత్స్న మత్రైవ నిరూపితమ్. ఇతోఽధికం గ్రన్థాన్తరే నాస్తీతి కార్త్స్యేన సర్వేషాం శాస్త్రాణా మర్థం జ్ఞాతుకామేనైతదేవ ఆదర్తవ్యమితి అన్నారు.

అద్భుతత్వం ఏమిటంటే ధర్మము, అర్థము, కామము, మోక్షము అనే నాలుగింటి సముదాయము ఉపాదేయము - మానవజాతి గ్రహించి హృదయములో నిక్షేపించుకొనదగినది. దానితోపాటు అధర్మము, అనర్థము, దుఃఖము, సంసారము అనే నాలుగింటి సముదాయము శ్లోకములోని సముచ్చయార్థక చకార చతుష్టయములచేత గ్రహింపవలసియున్నది. ఆ విధంగా ఉపాదేయముల నాల్గింటికీ, హాతవ్యముల నాల్గింటికీ సంబంధించిన సర్వము ఇందే సమగ్రంగా నిరూపింపబడినది. దీనికంటె అధికముగా ఇతర గ్రంథములయందు పరిశీలించవలసినది ఏదీలేదు.

ఇదియే అద్భుతశబ్దతాత్పర్యము.

ఈ శ్లోకద్వయం మహాభారతం ధర్మశాస్త్రం ఎలా అయిందో ప్రమాణ పూర్వకంగా నిరూపిస్తున్నది.

శ్రీవ్యాసులవారు హాతవ్యవిషయతత్త్వస్వరూపాన్నంతటినీ ఒక చెట్టుగా, ఉపాదేయవిషయతత్త్వస్వరూపాన్నంతటినీ ఒక చెట్టుగా రూపణం చేసి మన కందించారు.

*దుర్యోధనో మన్యుమయో మహాద్రుమః,*
*స్కన్ధః కర్ణః శకుని స్తస్య శాఖాః*
*దుఃశాసనః ఫలపుష్పే సమృద్ధే*
*మూలం రాజా ధృతరాష్ట్రోఽమనీషీ.* *(ఆది. 1. 110.)*

*రోషమయ మహాతరువు సుయోధనుఁ డురు*
*స్కంధ మందులోనఁ గర్ణు డలరుఁ*
*గొమ్మ సౌబలుండుఁ గుసుమ ఫలములు దు*
*శ్శాసనుండు, మూలశక్తి తండ్రి.* (*ఉద్యోగ. 1.355*)

దుర్యోధనుడు మన్యుమయమైన మహావృక్షం. దాని బోదె కర్ణుడు. కొమ్మలు శకుని. దుశ్శాసనుడు పూలూపండ్లూ. ఈ చెట్టు వ్రేళ్ళన్నీ మూలరూపంలో బుద్ధిలేని ధృతరాష్ట్రుడు.

*యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః*
*స్కన్ధోఽర్జునో భీమసేనోఽస్యశాఖాః*
*మాద్రీసుతౌ పుష్పఫలే సమృద్ధే*
*మూలం కృష్ణో బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ.* (*ఆది. 1.111.*)

*ధర్మజుండు ధర్మతరు, వర్జునుఁడు ఘన*
*స్కంధ, మనిలసుతుఁడు శాఖ, కవలు*
*పుష్పఫలము, లేను, భూసురులును వేద*
*ములుఁ దదీయమైన మూల చయము.* (*ఉద్యోగ. 1.356*)

యుధిష్ఠిరుడు ధర్మమయమైన మహాద్రుమం. కాండం అర్జునుడు. భీమసేనుడు దాని కొమ్మలు. మాద్రి కొడుకులు దాని సమృద్ధమైన పుష్ప ఫలాలు. కృష్ణుడు, బ్రహ్మము, బ్రాహ్మణులు దాని మూలము.

ముఖ్యంగా ధర్మం మూలం తెలిసికొని ఆచరించి కృతార్థతను పొందాలంటే పరమాత్మయే అయిన కృష్ణుని సర్వాత్మనా ఆశ్రయించాలి. ఆయన మానవజాతికి మార్గదర్శకంగా ఇచ్చిన ధర్మసూక్ష్మాలను బ్రహ్మమును – వేదమును అధ్యయనం చేసి తెలుసుకోవాలి. ధర్మసంబంధమైన విచికిత్సను – శంకలను – తొలగించుకొని నిర్దుష్టమైన నిర్దిష్టమైన స్థితిని సంపాదించుకోవాలంటే బ్రాహ్మణులను – బ్రహ్మజ్ఞానసంపన్నులను ఉపాసించాలి– అని ఈ రెండవశ్లోకం చేస్తున్న ఉపదేశసారాంశం.

నిజానికి ధర్మస్వరూపం తెలుసుకోవటం అతిగహనమైన విషయం. అందువలననే ఆరు మహాలక్షణాలు గలవారిని రేఖామాత్రంగా తెలిపి వారి దారిలో ప్రవర్తించమన్నది వేదమాత. అట్టివారు మనకు ఎక్కడ బడితే అక్కడ భౌతికకాయంతో దొరకరు. పురాణేతిహాసాలలో యశఃకాయంతో లభిస్తారు. అట్టివారే యుధిష్ఠిరాదులు. ప్రాచేతసపారాశర్యమహామునీంద్రులు అట్టి మార్గనిర్దేశం చేయటంకోసమే రామాయణ భారతాలను రచించారు. పారాశర్యులు మహాభారతాన్ని ధర్మశాస్త్రమని వాచ్యంగానే చెప్పారు.

*ధర్మశాస్త్ర మిదం పుణ్య మర్థశాస్త్రమిదం పరమ్,*
*మోక్షశాస్త్ర మిదం ప్రోక్తం వ్యాసేనామితబుద్ధినా.* *(ఆది. 62.23)*

ఊహలకందని బుద్ధివైభవం కల వ్యాసులవారు ఇది పుణ్యమైన ధర్మశాస్త్రమనీ, ఉత్కృష్టమైన అర్థశాస్త్రమనీ, మోక్షశాస్త్రమనీ సుదృఢమైన వైఖరితో ప్రకటించారు. ఈదృశమైన వాక్యవిశేషాలను సంభావించియే తెలుగులో ఋషికల్పులయిన నన్నయ తిక్కనలు

*ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని*
*యధ్యాత్మవిదులు వేదాంతమనియు*
*నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని*
*కవివృషభులు మహాకావ్యమనియు*
*లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని*
*యైతిహాసికు లితిహాస మనియుఁ*
*బరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చ*
*యంబని, మహిఁ గొనియాడుచుండ.*

*వివిధ తత్త్వవేది వేదవ్యాసుఁ*
*డాదిముని పరాశరాత్మజుండు*
*విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై*
*పరఁగుచుండఁ జేసె భారతంబు.* *(ఆది. 1.32)*

*వేదములకు నఖిలస్మృతి*
*వాదములకు బహుపురాణవర్గంబులకున్*
*వాద్గైన చోటులను దా*
*మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్.* (*విరాట. 1. 4*)

అనే పద్యాలను రచించారు.

ఈ పూర్వరంగంతో ధర్మలక్షణాలను ఆచరణాత్మకంగా లోకానికి వెల్లడించిన ధర్మరాజు అనే పేరుకు సార్థకత చేకూర్చుకొన్న యుధిష్ఠిరుని ప్రవృత్తితో, ఆ విషయంలో సర్వాత్మనా ఆయనకు శిష్యులై పవిత్రజీవితం నడపుకొన్న పాండుకుమారుల, పత్ని ద్రౌపది ప్రవృత్తితో సమన్వయించి చూడటం 'భారతం ధర్మశాస్త్రము' అనే ప్రతిపాదనలో నిరూపకం అవుతుంది. దీనికి మనువు చెప్పిన దశలక్షణాలను క్రమంగా అనుశీలించటం ఉన్న అవకాశంలో రేఖామాత్రంగా తెలియజేయగల పని.

**1. ధృతి** – ధర్మాచరణలో ఊగిసలాటలేకుండా స్థిరబుద్ధితో నిలబడగలగటం ధృతి. యుధిష్ఠిర ప్రవృత్తిలో అనేక సందర్భాలలో ఇది ప్రదృశ్య మానం అవుతుంది. ముఖ్యంగా అరణ్యాజ్ఞాతవాసనిర్వహణ యుధిష్ఠిరుడు ప్రమాదపడకుండా చేయగలిగాడంటే దానికి మూలస్తంభం ఆయన పట్టు చిక్కించుకొన్న ధృతియే.

అరణ్యవాససమయంలో భీముడూ, ద్రౌపదీ ధర్మరాజును చాలా ఇబ్బంది పెట్టారు. ఒట్టుతీసి గట్టున పెట్టి దుర్యోధనాదుల డొక్క చీల్చి డోలు కట్టి రాజ్యాన్ని వశం చేసుకో అని హితబోధ సుదీర్ఘంగా చేశారు. కానీ యుధిష్ఠిరుడు వారి ప్రలోభాలకు లొంగలేదు సరికదా ఆ మదగజాలను తన ధృతి అనే అంకుశంతో దారికి తెచ్చుకొని లొంగదీసుకొని పండ్రెండేండ్లు పట్టి నిలిపాడు.

ఈ సందర్భంలో వ్యాసులవారి మాటను మనం స్మరించాలి.

*న జాతు కామా న్నభయా న్నలోభా*
*త్యజేద్ధర్మం జీవితస్యాపి హేతోః*
*ధర్మో నిత్యః సుఖదుఃఖే త్వనిత్యే*
*జీవో నిత్యో హేతు రస్య త్వనిత్యః.* (*స్వర్గా. 5. 63*)

ఏదో భౌతికమైన సుఖాదికం బాముకుందామనిగానీ, భయంవలన గానీ, వస్తుసంపదలపై సాధారణంగా మానవులకుండే లోభంవలన గానీ మానవుడు ఎన్నటికీ ధర్మాన్ని విడువరాదు. ధర్మము నిత్యము. భౌతికంగా వచ్చిపడే సుఖదుఃఖాలు వస్తూ ఉంటాయి, పోతూ ఉంటాయి. జీవుడు నిత్యుడు. సచ్చిదానందస్వరూపుడైన అతనికి వచ్చిపడిన కర్మబద్ధత అనిత్యమైనది. అనిత్యమైన దానికోసం నిత్యమును బలిపెట్టటంకంటె పరమ నీచమైన పని మరియొకటి ఉండదు గదా!

ఇదిగో ఈ తత్త్వజ్ఞానంతో ధర్మలక్షణాలలో ప్రథమమైన 'ధృతి'ని ధర్మరాజు చెడగొట్టుకోలేదు.

**2. క్షమ** - సహనం. ధృతరాష్ట్రుడు హస్తినాపురంనుండి వెళ్ళగొట్టాడు. కపటద్యూతంతో దుర్యోధనాదులు మహాఘోరమైన అవమానం చేశారు. ధర్మపత్నిని నిండుసభలో వివస్త్రను చేయటానికి పూనుకొన్నారు. అయినా ధర్మమే కాపాడుతుందనే పరమవిశ్వాసంతో యుధిష్ఠిరుడు సహించాడు.

**3. దమము –** మనస్సును అదుపులో ఉంచుకోవటం. అంతరింద్రియ నిగ్రహం.

*చావరు నొవ్వరు పాండవు*
*లేవురునని నీవు చెప్ప నిప్పలుకులు దుః*
*ఖావేశకరములై చే*
*తోవృత్తిఁ గరంపఁ జొచ్చె దుర్భరభంగిన్.*

అని పాండవుల సర్వనాశనాన్ని మనసార కోరి దానికి చేయవలసిన అకృత్యాలన్నింటినీ చేసిన ధృతరాష్ట్రుణ్ణి ధర్మరాజు దైవసమానంగా ఆరాధించిన అనన్యసాధారణప్రవృత్తి ఆశ్రమవాసపర్వంలో అత్యద్భుతంగా కానవస్తుంది. అలా ప్రవర్తించగలగటానికి మరొకకారణం అతని దమమనే గుణమే.

**4. అస్తేయం –** ఇతరుల సొమ్మును ఎలా అయినా స్వాయత్తం చేసుకోవాలనే ఆలోచన లేకపోవటం. ఈ కారణంచేతనే పాండవులు జీవితమంతా పడరానిపాట్లు పడ్డారు. పుటంలో పెట్టిన బంగారంలాగా నిర్మల హృదయులై లోకానికి ఆదర్శప్రాయులయ్యారు.

ఈవిషయానికి సంబంధించి భీమసేనుడు సౌగంధికాహరణం చేసి నప్పుడు అతనిని సుకుమారంగా మందలించిన అంశం కూడా మనం స్మరించాలి.

**5. శౌచము –** ధర్మరాజు తమ్ములతోపాటు అరణ్యవాససమయంలో అనేక తీర్థయాత్రలు చేశాడు. వానివలన స్థూలదేహశౌచాన్ని చెడకుండా చూచుకొన్నాడు. అలాగే ఎందరో మహాత్ములయిన మహర్షులు మార్కండేయుడు, లోమశుడు మొదలైనవారిని పరిప్రశ్న చేసి ఉత్తమధర్మాల నాచరించిన మహాత్ముల చరితలను శ్రద్ధాసక్తులతో ఆలకించి మనఃశౌచాన్ని పరిరక్షించుకొన్నాడు.

**6. ఇంద్రియనిగ్రహము –** చర్మము, కన్ను, చెవి, నోరు, ముక్కు అనే ఇంద్రియాలు స్పర్శ, రూపము, శబ్దము, రసము, వాసన అనే విషయాలను నిరంతరము కోరుతూ ఉంటాయి. వివేకంతో వానిని అదుపులో పెట్టగలగటం ఇంద్రియనిగ్రహము.

**బలవానింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి** అంటున్నది శాస్త్రం. అన్నీ తెలిసిన వానిని కూడా మిక్కిలిబలంగల యింద్రియ సముదాయం తన గుప్పిటిలోనికి గుంజివేసుకొంటుంది. యుధిష్ఠిరుడు ఆ ఆకర్షణలకు ఎప్పుడూ లొంగిపోలేదు. తేరగా వస్తున్న సింహాసనాన్ని కూడా నాకక్కరలేదు అన్నాడు. విరాటుడు అతని తేజోవిశేషం చూచి మమ్మల్ని ఏలుకో అన్నాడు. యుధిష్ఠిరుడు సుకుమారంగా వద్దని చెప్పగలిగాడు.

చెల్లియుండియు సైరణ చేయగల మనస్తత్వం అతనిది.

**7. ధీ –** శాస్త్రాదులను అధ్యయనం చేయటంద్వారా ప్రవృత్తిని సంస్కరించుకోవటం ఈ అంశానికి సంబంధించిన విషయం.

అజ్ఞాతవాసం చేయబోయే ముందు కులపురోహితులు ధౌమ్యులవారు సేవాధర్మాలను విస్తృతంగా బోధించారు. ఇంకా అరణ్యవాసంలో ఎందరో మహర్షుల నాశ్రయించి విద్యాసంపన్నుడైనాడు యుధిష్ఠిరుడు.

శాంతి, అనుశాసనికపర్వాలలో శాంతనవునిద్వారా ధర్మరాజు నేర్చుకొన్న లోకజ్ఞానం అనంతమైనది.

**8. విద్య –** శాంతిపర్వంలో మూడు ఉపపర్వాలున్నాయి. రాజధర్మాను శాసనపర్వము, ఆపద్ధర్మపర్వము, మోక్షధర్మపర్వము. ఈ మూడవది అతి విస్తృతమైనది.

శ్రీకృష్ణవాసుదేవుడు పరమార్థజ్ఞానాన్నంతా భీష్మునిలో చొప్పించి అధ్యాత్మవిద్యారహస్యాల నన్నింటినీ యుధిష్ఠిరునకు బోధింపజేశాడు.

**9. సత్యము –** సత్యపాలన అసిధారావ్రతం వంటిది. దానికి కట్టుబడి ఉంటే అజ్ఞాతచర్య అసాధ్యం. కానీ యుధిష్ఠిరుడు సత్యపాలనకు కట్టుబడి అజ్ఞాతచర్యను సుసాధ్యం చేసుకొన్నాడు.

దీనికి రెండు అత్యంతకఠిన పరీక్షలు తటస్థపడ్డాయి.

ఒకటి. పాండవులు తమ మహాయుధాలను అజ్ఞాతవాసకాలంలో తమతో ఉంచుకోవటానికి వీలులేదు. ఎక్కడో పారవేయటానికీ వీలులేదు. తమ కనుసన్నలలో గుప్తంగా పెట్టుకొని కాపాడుకోవాలి. సత్యవ్రతం దానికి పెద్ద ప్రతిబంధకం. అయినా ధర్మరాజు చాలా మెలకువతో వ్రతం చెడకుండా ఫలం దక్కించుకొన్నాడు.

ఈ సందర్భంలో తిక్కన మహాకవి వ్రాసిన పద్యం అత్యద్భుతమైనది.

*ఇది శతవృద్ధ మా జనని యిప్పుడు మృత్యువు బొందె నిట్లు సే*
*యుదుము కులప్రయుక్తమగుచున్న సనాతనధర్మమిమ్ము*
*గ దహన కర్మ మొల్ల మదిగా నిదిగామును నిశ్చయించి*
*మొదలిటివారొనర్చు విధముం గొని యాడితి మేము నిప్పుడున్.*

*(విరాట. 1.17)*

ఆయుధాల మోపు జమ్మిచెట్టు మీద పెట్టి, ఆ చుట్టుప్రక్కల తిరుగుతున్న గోపాలాదులను ఉద్దేశించి పాండునందను లందఱు ఇలా అన్నారు–

పై చూపుకు ఇది పచ్చి అబద్ధం. పైగా తల్లి కుంతీదేవి బ్రదికి ఉన్నది. కురుకులంలో తల్లిగానీ, తండ్రిగానీ చచ్చిపోతే మోపుగా కట్టి చెట్టుమీద పెట్టటం అనే కులాచారం ఉన్నది అనటానికి మొత్తం భారతంమీద దాఖలాలు లేవు. మఱి సత్యేతరప్రకటనకు ధర్మరాజు ఏమి సమాధానం చెబుతాడు? అని చంకలు కొట్టుకొనే ప్రబుద్ధులు చాలమంది ఉంటారని గుర్తించిన తిక్కన్నగారు పద్యాన్ని చాలా నేర్పుతో తెలుగుజాతికి అందించారు.

ఎదురుగా శవాకారంలో నిలుపుకొన్న ఆయుధాలను చూపించి 'ఇది' అంటున్నారు పాండవులు. అంటే వారు ప్రస్తుతం మాటాడుతున్నది ఆయుధాలను గురించియే కానీ అమ్మగురించి కాదు. ఉత్తమక్షత్రియునకు ఆయుధమే తల్లి. శతవృద్ధ అంటే ఈ అస్త్రశస్త్రవిద్య అనే అమ్మ మాకు తర తరాలుగా వస్తున్న తల్లి అని అర్థం. "ఇప్పుడు మృత్యువు బొందె". ఇప్పుడు మేము దీనిని బాహాటంగా ప్రయోగించటానికి వీలులేని పరిస్థితి దాపురించింది అని భావం. చెట్టుమీద పెట్టటం కులాచారం అంటే ఎక్కడో గుట్టుగా పరిరక్షించుకోవటం క్షత్రియవంశంవారు ఆచరించవలసిన ధర్మం అని అర్థం.

ఈవిధంగా సత్యవ్రతభంగం కలుగకుండా పద్యనిర్మాణం చేసిన తిక్కనగారి మేధాశక్తికి మనం జోహారు లర్పించాలి.

అలాగే విరాటునితో ధర్మరాజు

*ద్విజుఁడఁ గురువిషయజాతుఁడ*
*సుజనప్రియుఁడైన ధర్మసుతుసఖుఁడ పరి*
*వ్రజనాశ్రమకలితుఁడ మ*
*నుజవల్లభయోగ్య బహువినోదకరుండన్.*

అని తన్నుగూర్చి పరిచయం చేసుకొన్నాడు. ఇవన్నీ అబద్ధాలే కదా! అంటే కావు. ద్విజుడు అంటే **సంస్కారా ద్విజ ఉచ్యతే** అన్న ధర్మవాక్యానుసారం ఉపనయనాది సంస్కారములను పొందిన క్షత్రియుడను అని అర్థం. కురువిషయజాతుడను, కురుదేశంలో పుట్టినవాడను అని అర్థం. సుజన ప్రియుడైన ధర్మసుతు సఖుడను అంటే **సమప్రాణః సఖా మతః** అన్న నిర్వచనం ప్రకారం నా ప్రాణమూ, ధర్మరాజు ప్రాణమూ ఒకటే అని అర్థం. తరువాతి వాక్యభాగంలో ఆక్షేపించదగిన అంశమేమీ లేదు.

ధర్మరాజు దారిలోనే భీమసేనాదులు కూడా సత్యవ్రతభంగం కాకుండా మాటాడారు. భీముడు

**దేవా! నాలవజాతివాడ** అంటాడు. పైకి నాలవజాతివాడను అంటే నాలుగువర్ణాలలో చివరిదైన శూద్రవర్ణంవాడను అని అర్థం. కానీ సత్య పరిరక్షణాత్మకంగా పంచభూతాలలో క్రిందినుంచి నాలుగవది వాయువు. నాలవజాతివాడను అంటే 'వాయుపుత్రుడను' అని అర్థం.

**న త్యజే ద్ధర్మం జీవితస్యాపి హేతోః** అన్న అత్యంతకఠినమైన భాషణానికి అనుగుణమైన ప్రవర్తన – ధర్మప్రవర్తన – సత్యపరంగా ఎలా ఉందో మహాభారతం మనకు తెలియజేస్తున్నది.

**10. అక్రోధము –**

*క్రోధమ తపముం జెఱచును*
*క్రోధమ అణిమాదులైన గుణములఁ జెఱచున్*
*గ్రోధమ ధర్మక్రియలకు*
*బాధయగుం గ్రోధిగాఁ దపస్వికిఁ జన్నే.* *(ఆది. 2. 173)*

అన్నారు శమీకులవారు. క్రోధము తపస్సును చెరచివేస్తుంది. తపస్సు చెడితే సర్వమూ నాశనమైనట్లే. అలాగే అణిమ మొదలైన గుణాలన్నీ నాశనమైపోతాయి. అంటే యోగవిద్యాప్రభావం నీరుకారిపోతుంది. ధర్మక్రియలన్నిటికీ క్రోధంవలన బాధ కలుగుతుంది. ధర్మక్రియలు బాధ పడటమంటే మానవత్వం మట్టిలో కలసిపోవటమే. అందువలన తపోమయ జీవితం గడపాలనుకొనేవారు క్రోధాన్ని పరిసరాలలోనికి రానీయరాదు.

భగవద్గీత కూడా –

*ధ్యాయతో విషయాన్ పుంస స్సంగస్తేషూపజాయతే*
*సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధో౽భిజాయతే,*
*క్రోధా ద్భవతి సంమోహః సంమోహాత్స్మృతివిభ్రమః*
*స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి.*

అంటున్నది. కనుక క్రోధం మహాఘోరవినాశనానికి కారణం. అటు వంటిది ఎట్టి పరిస్థితులలోను కలుగకూడదనే పట్టుదలతో ధర్మాత్ముడు క్రోధాన్ని నిలువరించు కొంటాడు.

ధర్మరాజు అనేక సందర్భాలలో క్రోధాన్ని చెప్పు క్రింద తేలులాగా అణచి ఉంచాడు.

1. ద్రౌపదీవస్త్రాపహరణ సందర్భం.
2. కీచక విజృంభణ.
3. సైంధవ దుశ్చేష్ట.
4. దక్షిణగోగ్రహణంలో సుశర్మను పరిరక్షించటం – మొదలైనవి.

ముఖ్యంగా గాంధారీధృతరాష్ట్రులను దైవసమానంగా ఆరాధించిన ఆశ్రమవాస పర్వంలోని యుధిష్ఠిరుని ప్రవృత్తి అక్రోధతకు గొప్ప నిదర్శనం.

అయితే ఒకటి రెండు చిన్న చిన్న సందర్భాలలో ధర్మరాజు అదుపు తప్పిన పరిస్థితి లేకపోలేదు. తక్కిన సుదీర్ఘమైన, పట్టుసడలని ధర్మప్రవృత్తిని దృష్టిలో పెట్టుకొని వానిని ధర్మాంశాలుగానే సమర్థించుకోవాలి. శ్రీవ్యాస భగవానులవారి సంభావన అటువంటిదే. కాదంటే అట్టివానిని ఆపద్ధర్మాలుగా సమన్వయించుకోవాలి.

ఇంతవరకు ప్రధాననాయకపరంగా భారతము ధర్మశాస్త్రము ఎలా అవుతుందో స్థాలీపులాకన్యాయంగా గమనించాము.

శ్రీవేదవ్యాసులవారు మహాభారతాన్ని మానవధర్మశాస్త్రంగా రూపొందించటానికే అనేక ఉపాఖ్యానాలను అనుసంధించారు. దుష్యంతోపాఖ్యానము, పరీక్షిత్తుకథ, వ్రీహిద్రోణోపాఖ్యానము, శాంతనవచరిత్ర మొదలైనవి ధర్మప్రతిపాదక ఉపాఖ్యానాలు భారతంలో వందలకొలదీ ఉన్నాయి. వ్యతిరేకముఖంగా అధర్మప్రవృత్తి ఎంత ఘోరమైన ఆపదకు దారి తీస్తుందో కూడా దుర్యోధనాదుల ప్రవృత్తి ద్వారా నిరూపించారు. ధర్మశాస్త్రం చోదనా లక్షణం కలది. చోదనవిధి రూపంగా, నిషేధరూపంగా కూడా ఉంటుంది.

వేదం **ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా. లోకే ధర్మిష్ఠం ప్రజా ఉప సర్పన్తి. ధర్మేణ పాపమపనుదతి. ధర్మే సర్వం ప్రతిష్ఠితం. తస్మాద్ధర్మం పరమం వదన్తి.** అంటున్నది – మహానారాయణం – 79 వ అనువాకం – 7 వ మంత్రం.

ధర్మము సమస్తమైన జగత్తుకు ప్రతిష్ఠను కల్పిస్తుంది. లోకంలో అత్యంత ధర్మాత్ముడైన వ్యక్తిని ప్రజలు చేరుకొంటారు. ధర్మంతో మానవుడు పాపాన్ని తొలగించుకొంటాడు. సర్వమూ ధర్మములోనే నెలకొని ఉన్నది. అందువలన ధర్మము పరమమని తత్త్వజ్ఞులు చెప్తారు.

ఈ మంత్రాల విశేష వ్యాఖ్యానమే మహాభారతం. అందువలననే దానిని మంత్రశాస్త్రంగా భగవానుడైన వేదవ్యాసులవారు పేర్కొన్నారు. వారిని ఉపాసించి తెలుగులో కవిత్రయంవారు మంత్రశాస్త్రంగానే తీర్చి దిద్దారు. ఆంధ్రమహాభారతం తెలుగుజాతివారు చేసుకొన్న పుణ్యముల పంట.

*( వ్యాసకర్త: విశ్రాంత ప్రాచార్యులు, సాహితీవేత్త, రాజమహేంద్రవరం )*

స్వస్తి.

❄

ధనం చేయలేని పనంటూ లేదు. అది అపవిత్రతను పవిత్రంగా మారుస్తుంది.



డబ్బు కోసం మూర్ఖుని సేవ చేయరాదు.



డబ్బు అట్టడుగు లేని ఒక మహాసముద్రం. దానిలో గౌరవం, నిజాయితీ, సత్యం అన్నీ మునిగిపోతాయి.



ఆర్థికమాంద్యంలో ఉన్నవాని తెలివితేటలు అడవిని కాచిన వెన్నెల వంటివి.



కేవలం తరతరాలకు సరిపడే సంపాదన మీదే దృష్టి కేంద్రీకరించకుండా, పిల్లలను సక్రమంగా పెంచి, వారికి విద్యాబుద్ధులు నేర్పి ప్రయోజకులు అయ్యేలా చూడటమే మనం వారికిచ్చే అసలైన సంపద.



# మహాభారతము–ఇతిహాసము

–డా॥ మైలవరపు శ్రీనివాసరావు
98667 00425

ఏ సుముహూర్తంలో – అఖండ గోదావరీ నదీ తీరమైన రాజమహేంద్రవరాన్ని రాజధానిగా చేసుకుని ఏలుతున్న రాజరాజనరేంద్రునికి –సంస్కృత భారతాన్ని తెనుగు చేయించాలనే ఆలోచన కలిగిందో – దాంతో ఆ తీరు ఇష్టం కలిగిన తెలుగు వారందరికీ మోక్షపథమనేది కనులముందు సాక్షాత్కరించినట్లయింది.

ఏదో తానూ తన రాజ్యమూ కప్పాలూ (పన్నులూ) పరిపాలనా అనుకుంటూ రాజ్యవిస్తరణమే తన ధ్యేయమనుకుంటూ నామమాత్ర పరిపాలకులుగా ఎందరో జీవితాన్ని సాగించారు. అలా కాక తన జీవితానికి ఓ సార్థకతని సాధించుకోవాలనీ, తన పితృ పితామహుల చరిత్రని వింటూ పదిమందికి దాన్ని విన్పించాలనీ భావించిన రాజరాజ నరేంద్రుడు తన ఆలోచనని కార్యరూపంలో పెట్టడం కోసం సమర్థుడెవరా? అని పరిశీలించాడు.

అందుకే సకలశాస్త్ర పండితులతోనూ సమావేశాన్ని ఏర్పాటు చేసి ఏ మాత్రపు మొగమాటమూ లేకుండా అందరి సమక్షంలోనూ–

'తన కులబ్రాహ్మణు ననురక్తు –నవిరళ జపహోమతత్పరు విపుల శబ్దశాసను – సంహితాభ్యాసు– బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతుఁ – బాత్రుఁ–' డైన నన్నయని పూజించి,

"ఆర్యా! చంద్రుడు మా వంశకర్తగా ప్రారంభమై పూరు– భరతేశ–కురుప్రభు–పాండు రాజుల క్రమంలో మా వంశమంతా సాగిందని విన్నాను. ఆ చరిత్రంతా అలా గాలికి వెళ్లిపోవడం సరికాదు గదా! పైగా మా పితృపితామహుల చరిత్రని వినడం నాకెంతో ఇష్టం. అందుకని ఆ బృహత్కార్యాన్ని సాధించడానికి మిమ్ములని నడుం బిగించాల్సిందిగా మా కోసం ప్రార్థిస్తున్నా" నన్నాడు.

సహజంగా రాజులు ఏదో కొంత ఇచ్చి కవులని మెప్పించి కావ్యాలని రాయించుకునే ధోరణి ఉంది అక్కడక్కడ. అయితే ఇక్కడ అది కాదు. రాజుకి చెప్పలేనంత ఇష్టం– 'ఈ అందించబోయే చరిత్రని వినా'లని. దాంతో నన్నయ మరింత శ్రద్ధాళువై గ్రంథాన్ని అందించాల్సి వచ్చింది.

ఇక రెండవది– రాజరాజ నరేంద్రుడే అన్నాడు– 'జననుత కృష్ణద్వైపాయనముని వృషభాభిహిత మహాభారత బద్ధనిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు' –మని. ఏ కల్పనలో కొన్ని చెప్పడం సహజంగా ఉంటుంది కవులలో. అయితే వ్యాసుడు తన భారత గ్రంథంలో దేన్ని చెప్పాడో దాన్ని మాత్రమే – ఏ ప్రయోజనాన్ని ఆయన ఆశించి సాధించాలని అంతటి భారత గ్రంథాన్నీ సంస్కృతంలో మనకి అందించాడో ఆ ప్రయత్నం ఎక్కడా చెదిరిపోకుండా దెబ్బతినకుండా అందించవలసిందని వినయంగా సూటిగా చెప్పాడు రాజరాజ నరేంద్రుడు.

దీంతో నన్నయ భుజస్కంధాలమీద ఒక విధంగా కొత్త బరువుని పెట్టినట్లయింది. సంస్కృతభారతాన్ని మరింతగా పరిశీలించాల్సిన అవసరమూ ఏర్పడింది.

**రాజరాజు సామాన్యుడు కాదు**

'సంస్కృతంలో వ్యాసుడు వెలయించిన భారత బద్ధ సిరూపితార్థ' మనడంలో ఆయన శక్తి తెలుస్తోంది. వ్యాసుడంటే ఎవరో కాదు, వ్యాసో నారాయణో హరిః. సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే. ఆయనే పొందుపరిచి ఇచ్చిందాన్ని – కాల చక్రంలో ఏది ఎలా జరగాలో నిర్దేశించి చెప్పి అలాగే చేయించే చక్రధారిని –మీరి వెళ్లడం తనకిష్టం లేదు. అలాగని నన్నయ అలా వెళ్తాడనేదీ –వెళ్తాడేమోననేదీ తన అభిప్రాయం కాదు. కేవలం ఒక సూచన మాత్రమే.

బోద్ధార్ మత్సరగ్రస్తాః (పండితుల్లో అసూయాభావం తీవ్రంగా ఉంటుంది) అని భర్తృహరి అన్నట్టుగా భారతంలో ఈ తప్పులు ఆ దోషాలు ఉన్నాయనే కొందరు పండితమ్మన్యులు (పండితులుగా తమని తాము భావించుకునే వారు ) అప్పటికి ఉండి ఉండవచ్చు. అయితే వాళ్లని నిందించకుండా 'ఆర్యా! మీరు వ్యాసభారతాన్నే పరమార్థం చెడకుండా చెప్పవలసిం'దన్నాడు రాజరాజు ఎంతో వినయ – ఆదరబుద్ధితో.

## ప్రస్తుతంలో అప్రస్తుతం

సంస్కృతంలో భారత సమాచారాన్నంతటినీ తలకెత్తుకుని ఉన్న వ్యాసుడు తన రచనని తాను కవిత్వంగా చెప్పేసుకుంటూ వెళ్తూంటే సరైన లేఖకుడు ఎవరా? అని ఆలోచించి బ్రహ్మసూచన మీద గణాధిపతిని ప్రార్థించాడు.

గణేశుడు ప్రత్యక్షమయ్యాడు. తాను చెప్తున్న కవిత్వాన్ని తాటాకులమీద రాసి పెట్టాలని అనగానే- అది ఓ తీరు అవమానంగానే అన్పించి ఉంటుంది విఘ్నేశునికి. తాను విద్యాధిష్ఠాత. ఎవరో చెప్తుంటే తాను రాసి పెట్టడమా? అనుకుని ఓ క్షణం ఆగి 'సరే! రాస్తాను గాని - లేఖినీ నావతిష్ఠేత తదా స్యాం లేఖకో హ్యహమ్-నా రాత వేగానికి సరిపోయేలా నీ కవితా వేగంగాని లేకపోయిందో గంటాన్ని పడేసి పోతాను సుమా! - అన్నట్టుగా అలా చెప్పగలవా వేగంగా?' అన్నాడు వ్యాసునితో. వ్యాసుడు ఏ మాత్రమూ సంశయించలేదు.

సరేనంటూ వినయంగా ఇలా బదులు పలికాడు-'గణేశ్వరా! నీ గొప్పదనం నాకు తెలియంది కాదు- అయితే నేను చెప్పే కవిత్వంలోని ప్రతి అక్షరాన్నీ - అబుద్ధ్వా మాలిఖ! క్వచిత్- అర్థం చేసుకోకుండా ఏదో రాసేస్తున్నట్లుగా రాసెయ్యకూడదు సుమా!' - అన్నాడు. ఇదీ ఆ ఇద్దరి మధ్య ఒప్పందం.

అంటే ఏమన్నమాట? సంస్కృత భారతంలో ఉన్న శ్లోకాలన్నిటినీ వినాయకుడు స్వయంగా అర్థంచేసుకుని మాత్రమే రాసాడని కదా! అలాంటప్పుడు భారతంలో ఈ తప్పులున్నాయి... ఆ పొరపాట్లున్నా-యంటూ ఎవరైనా అన్నారంటే ఆ అన్నవాణ్ణి వినాయకుని కంటే గొప్పవానిగా భావించే బుద్ధిహీనుడన్నమాట ఈ తప్పులు పట్టేవాడు!

అందుచేతనే వ్యాసభారత పరమార్థమే కావాలన్నాడు రాజరాజు. ఇది నిజం కాదనే వీలులేదు. ఆయనకాయనే చెప్పుకున్నాడు - భారత శ్రవణాసక్తి- భారతాన్ని వింటూనే ఉండాలనే ఆసక్తి తనకి ఎప్పుడూ ఉంటూనే ఉంటోందని. అంతటి మహానుభావుడు మన తెలుగువారి అదృష్టానికి భారతాన్ని అందించే కార్యాన్ని సఫలంచేసాడు.

### నన్నయా తక్కువవాడు కాదు

సంస్కృతాన్ని తెనుగు చేయడమా! పవిత్రత చెడిపోతుంది- కొందరి వాదం నాటి రోజుల్లో. ఇంతకంటె పండితుల్లేరా? -మరి కొందరి అసూయా వాదం. రాసిందాన్ని రాసినంతవరకూ విన్పించి నెగ్గితేనే కొన సాగించాలి- ఇంక కొందరి పట్టుదల. ఇలా భిన్న భిన్న విధానాల్లో నన్నయ మీద వ్యతిరేకాస్త్రాలు ఉన్నాయని తెలిసినా తన జపహోమతత్పరత తనని రక్షిస్తుందనే ప్రగాఢ విశ్వాసంతో నడుం కట్టాడు నన్నయ. ఆయనకంటూ ఎలాంటి ఇబ్బంది వచ్చినా తన వైపు నిల్చినవాడు 'నారాయణభట్టు' అని చెప్పుకున్నాడంటే భారతయుద్ధంలో లాగా ఎన్ని బాణాల బాధనో తొలిగించినవాడు ఆయనే అని మనకర్థమయ్యేలా చెప్పుకున్నాడన్నమాట. సరే! విషయంలోకి వద్దాం.

### సూత-శౌనక సమావేశం

భారతంలో మొదట మనకి కన్పించేది-శౌనకాది మహర్షులంతా నైమిశారణ్య మహాక్షేత్రంలో తాము నిర్వర్తించుకోవలసిన అన్ని అనుష్ఠానాలనీ ముగించుకున్నాక సూతుల వారి రాకకోసం ఎదురు చూస్తున్నారనేది. సూత అనే పదానికర్థం -పుట్టిన వాడు- అని. అయితే మనందరం కూడ సూతులమే కదా! అన్పిస్తుంది పై దృష్టితో చూస్తే, ఎన్నటికీ కాము మనం, పురాణాల్లోని మాటలకి కచ్చితంగా లో అర్థం ఉంటుంది, దాన్ని గమనించి తీరాలి. అప్పుడే పురాణం అర్థమౌతుంది.

యజన (యాగం చేయడం), యాజన ( యాగాన్ని చేయించడం), అధ్యయన ( వేదశాస్త్రాలని చదువుకోవడం), అధ్యాపన ( తాను చదివిందాన్ని పదిమందికీ చెప్పి ప్రచారం చేయడం), దానం (తాను అవసరమైన వారికియ్యడం), ప్రతి గ్రహణం (యోగ్యులైనవారి నుండీ తన గొప్పదనాన్ని గ్రహించినవారి నుండీ-దానాన్ని స్వీకరించడం) అనే ఏ ఆరు గుణాలున్నాయో ఆ ఆరుగుణాలనీ పాటిస్తూ జీవనాన్ని గడిపేవారెవరో ఆయన - సూతుడంటే, పుట్టడమంటే ఇలాంటి లక్షణాలు కలిగి పుట్టడమన్నమాట. అందుకే తెలుగులో ఓ సామెత- పుడితే అలాంటి పుటక పుట్టాలి- అనేది కన్పిస్తుంది. దానర్థం ఇదే.

ఈయనకే 'ఉగ్రశ్రవు' డని మరో పేరు కూడ 'ఉగ్ర- తీవ్రంగా', శ్రవుడు-వేదాలని అధ్యయనం చేసిన వా' డని దీనర్థం. వేదంలో ఎన్ని శాస్త్రాలూ అర్థాలూ ధర్మశాస్త్ర విశేషాలూ కర్మకాండలూ......ఇలా ఉన్నాయో అవన్నీ తెలిసినవాడన్నమాట. మరో పేరు 'రోమహర్షణి' అని. రోమ హర్షణుని కొడుకనేది పై అర్థం. ఈయన తండ్రిగారు ఏది మాట్లాడుతున్నా ఆ హృదయానందం కారణంగా శరీరమంతా పులకరించిపోతూండేదట. అంతటి తన్మయతతో ఆయన చెప్పేవాడటగాని, ఏదో మొక్కుబడిగా కాదట. అందుకే ఆయనని అందరూ ఓ బిరుదనామంగా 'రోమహర్షణు' డన్నారు. ఎంత అదృష్టం అలాటి పేరును పొందటం సరిగ్గా ఆయనకి తగిన పుత్రుడీయన అనే అర్థంలో ఈయన్ని 'రోమహర్షణి' అన్నారు. అంత ఇష్టంతో హృదయానందంతో నైమిశారణ్యక్షేత్రంలో శౌనకాది మహర్షులంతా తన రాకకి ఎదురు చూస్తుంటే వచ్చారట సూతులవారు.

వినడానికి సిద్ధంగా ఉన్నవారు- శౌనకుడనే మహర్షితో పాటు మరెందరో. శౌనకుడనే మాటకి అర్థం 'శునకస్య అపత్యం పుమాన్' అని. పై అర్థం మాత్రమే గమనించే బుద్ధిహీనులకి 'కుక్కకి కొడుకా!' అనిపిస్తుంది. కాదు అది దానర్థం. పూర్వజన్మ సంస్కార వాసన కలిగినవాడు అని దానర్థం, శునకానికి వాసనని బట్టి గ్రహించే శక్తి ఎక్కువ. అందుకే పక్కింట్లో పురాణప్రవచనం జరుగుతున్నా ఈ శౌనకవిధానమనేది లేకుంటే వెళ్ల(లే)డు - ఏదో కారణం చెప్పి వీలుకాలేదంటాడు.

ఇప్పుడన్నింటినీ ఓ చోట జోడించుకుంటే భారతాన్ని తెనుగు చేయించాలనుకున్న రాజరాజనరేంద్రుడు 'తన పితృపితామహుల చరిత్రని వినాలి- వినిపించాల'ను కున్నవాడు. తెనుగు చేయదలిచిన నన్నయ 'అవిరళ జపహోమతత్పరుడు ....మొదలైన ఉత్తమ లక్షణాలు' కలవాడు.

చుట్టూ ఉన్న పండితులెందరో నన్నయ దీనికి సమర్థుడేనా? అనే దోషైక దృష్టితో ఉన్నవాళ్లు. కాబట్టి సరైన తీరులలోనే భారతం లోకానికొస్తుంది.

కథా ప్రారంభం సూతులవారు చెప్పప్రారంభించడం- తప్పక విని తీరాలనే జిజ్ఞాసతో ఉన్న శౌనకాదులు దీన్ని విననారంభించడం. ఇదంతా నైమిశారణ్య

మహాక్షేత్రం కావడం. ఇన్ని అనుకూలతలున్న ఈ భారతాన్ని ఓ ధర్మశాస్త్రంగా - వేదాంతగ్రంథంగా....ఇలా అనేక దృక్పథాలతో నిండినదానిగా అందించాడు నన్నయ. వాటిలో ఇతిహాసకోణంలో చెప్పుకోదలచడమనేది ప్రస్తుత కర్తవ్యం,

**ఇతిహాస విధానం గొప్పది**

ఇతి+ ఆస+ హ అని పద విభాగం. 'ఇతి-ఈ విధంగా, ఆస- జరిగింది, హ -అట.' 'ఇలా జరిగిందట' అని ఉన్నదున్నట్టుగా చెప్పడమేదుందో అదే ఇతిహాసమంటే. చరిత్ర ఎప్పటికప్పుడు మార్పులకి లోను కావచ్చు కొందరి కారణంగా. కావ్యమైనట్లయితే, కొన్ని కల్పనలూ ఔచిత్యాలూ వంటివాటి చేరికతో ఉన్నదున్నట్టుగా అందించలేకపోవచ్చు. అదే మరి దృశ్యకావ్యం (నాటకం) అయితే ఇంక చెప్పేదేముంది! అస్సలు సాధ్యపడదు ఉన్నదాన్ని ఉన్నట్టుగా అందించడం. అందుకే ఇతిహాస విధానం గొప్పది. అయితే దాన్ని అందించగలగడం మరింత గొప్పది. ఎందుకని?

'ధీరాత్మ్ముండవికత్థనుండు కరుణోద్వేలుండు సత్యాఢ్యుడౌ ధీరోదాత్తుడు' అని కావ్యాలంకార సంగ్రహం చెప్పింది. సాధారణంగా నాయకుణ్ణి ధీరోదాత్తునిగానే చెప్తారు. ధీరాత్ముడూ- తనని తానుపొగుడుకోనివాడూ, తనలో కెరటాలు కెరటాలుగా పొంగివస్తున్న జాలిగుణం కలవాడూ, సత్వగుణసంపన్నుడూ, ధీరోదాత్తనాయకుడని దీనర్థం. ఈ గుణాలని ఎక్కడా చెదిరిపోకుండా నాయకుల్లో చూపించడం సాధ్యమా?

మనమే మన కుటుంబాల్లో ఏదైనా ఓ అపభ్రంశం దొర్లితే దాన్ని కప్పిపుచ్చుతామే! మరి ఉన్నదాన్ని ఉన్నట్టుగానే రాస్తే గ్రంథం అప్రతిష్ఠపాలుకాదూ? అనిపిస్తుంది మనకి. అలా ఏ మాత్రపు అనౌచిత్యమూ అప్రతిష్ఠా లేకుండా ఉండేలా నన్నయ మహాకవి తన రచనని కొనసాగించడం, అదే మార్గంలో తిక్కన ఎఱ్ఱనలూ కూడ ప్రయాణించడమనేది నిజంగా ఆశ్చర్యకరం! అనూహ్యం కూడ.

**కొన్ని ఉదాహరణలు**

పవిత్రమైన చంద్రవంశపురాజు ( భారతాన్ని తెనుగు చేయిస్తున్న రాజరాజ నరేంద్రుని వంశమిదే అని కదా ఆయనన్నాడు) దుష్యంతుడు రహస్యంగా ఓ ఆశ్రమకన్య అయిన శకుంతలని గర్భవతిని చేసాడా? అది కూడా పరమ పవిత్రుడైన కణ్వుని ఆశ్రమంలోనా? ఈ విషయాన్ని ఆమె తనని ఇంతకాలమూ పోషిస్తున్న కణ్వునికి చెప్పనే లేదా? ఆయనక్కూడ ఈ విషయం తెలిసాక ఆమెని కనీసం

మందలించను కూడ మందలించలేదా? దుష్యంతునికి కబురుచేయలేదా? శిష్యులిద్దర్ని ఇచ్చి రాజు వద్దకి పంపిస్తూ– నీ తోవ నువ్వే చూసుకో! – అన్నట్టు ప్రవర్తించాడా కణ్వ మహాముని? ...ఇలా ఎంతో అనౌచిత్యమయంగా అప్రతిష్ఠాకరంగా ఉన్న ఈ చరిత్రని ఉన్నదున్నట్టుగా రాయకుండా కొంతైనా మార్చి రాయచ్చుగా నన్నయ! అలా రాయనే లేదు–ఇతిహాసం కదా! అని మరి ఈ విచిత్ర పరిస్థితిని ఎలా ఎంత చక్కగా సమన్వయించాడు? పరిశీలిద్దాం!

దేవతల గురువైన బృహస్పతి పుత్రుడు కచుడు, దేవతల రాక్షసుల యుద్ధాల్లో మరణించిన రాక్షసుల్ని బతికించగల మృతసంజీవని మంత్రం ఆయన దగ్గరుందనే అభిప్రాయంతోనే రాక్షసులు శుక్రాచార్యుణ్ణి తమ గురువుగా తెచ్చుకున్నారు. ఆయన దగ్గరికి బృహస్పతి తన కొడుకైన కచుణ్ణి పంపాడా? పరస్పర శత్రుత్వం దేవదానవులకుంది కాబట్టి తన పుత్రునికి ఏ ఉపద్రవమూ రాదని ఎలా అనుకుని పంపాడు? పోనీ కచుడేమైనా శుక్రాచార్యుణ్ణి చూసి వద్దామని కాదుగా వెళ్తున్నది!. ఆయన వద్ద ఉన్న మృతసంజీవని విద్యని పొందుదామని కదా వెళ్లాడు? ఆ విషయాన్ని ఆయనతో చెప్పనే చెప్పాడు కూడకదా! శుక్రాచార్యునికి ఆ గురువు హోదా ఈ విద్య వల్లనే కదా రాక్షసజాతిలో వచ్చింది! అలాంటి విద్యని మరొకరికి – అందునా తమ విరోధజాతి అయిన దేవతల పక్షానికి చెందినవాడికి శుక్రుడీయ దలిస్తే రాక్షసులు ఎలా అంగీకరించారు? పైగా శుక్రాచార్యుడు శిష్యునిగా ఇతణ్ణి ఎందుకుతీసుకున్నాడు? కొంతకాలానికి కచుణ్ణి రాక్షసులు చంపి ముక్కలు ముక్కలుగా చేసారనే విషయం బృహస్పతికి తెలియదా? లేక తెలిసినా పరవాలేదనుకున్నాడా? వెంటనే రప్పించుకోలేదా? పోనీ ఇలాంటి కథని కొంతైనా మార్చి రాయచ్చుగా నన్నయ! లేదు ఇతిహాస దృష్టితో ఉన్నదున్నట్టుగానే రాసాడు. చక్కగా సమన్వయించాడు. చూద్దాం!

ఏకలవ్యుడిది మరింత చిత్రమైన చరిత్రం– ద్రోణాచార్యుడికి ఏ నాడూ సేవ చేసాడు కాడితడు! అయినా ద్రోణాచార్యుడి శిష్యుడినంటూ చెప్పుకోవడం కాదు, ఆయన చిత్రమే పెట్టుకున్నాడా? తన వద్ద. అర్జునుడితో తిట్లు తిన్నాడా ద్రోణుడు 'తనకంటె మరొకణ్ణి గొప్పవాడిగా చేయదలిచావా రహస్యంగా ?' అని, ఇన్నిటికంటె

చిత్రం? ద్రోణుడు వెళ్లి గురుదక్షిణని అడిగితే– మీ కేది కావాలని అనిపిస్తే దాన్ని ఈయదలిచానన్నాడా? ఏకలవ్యుడు. ఎవరైనా ఏ మంటారు? ఏం చదువు చెప్పావని గురుదక్షిణ నడుగుతున్నావనరూ? పోనీ గురుదక్షిణ నిస్తానని వినయంతో వాడు అంటే, శాశ్వతంగా ధానుష్కునిగా ఉండవీల్లేని తీరులో కుడిచేతి బొటనవేలి నడిగాడా? ఈయన .' ఏకలవ్యుడు కూడ' ఇష్టంగా ఇచ్చేసాడా? – లోకంలో అందరూ ద్రోణుణ్ణీ, ద్రోణుని వంకతో బ్రాహ్మణజాతినీ తిడుతున్నారంటే కారణం ఇది కాదూ! కొద్దిగా మార్చి రాయచ్చుగా ! కాదు– ఇది ఇతహాసమంటూ అలా ఉన్నదాన్ని ఉన్నట్టుగానే రాసి చక్కని పరిష్కారాన్ని చూపాడు నన్నయ. ఎలాగో దర్శిద్దాం!

శుభమా ! అని రాజసూయ యాగాన్ని మంచి ముహూర్తంలో ప్రారంభించి చక్కగా ధర్మరాజు సర్వక్షత్రియ సమక్షంలోనూ చేసుకుంటూ ఉంటే, మామిడితోరణాలు వేలాడుతున్న ఆ సభాభవనంలో శ్రీకృష్ణుడు శుభకార్యానికి విరుద్ధంగా శిశుపాలుణ్ణి చక్రంతో వధించాడా? ఇంతకీ అది అశుభముహూర్తమా? శుభకార్య సందర్భంలో ఇలాటి సంఘటన జరగడం ఎలాంటి ఆలోచననిస్తుంది విన్న, చూసిన వారికి . పోనీ! కొద్దిగా మార్పు చేసి ఉండవచ్చుగా! లేదు– ఇతిహాసమనే దృష్టితో ఉన్నదున్నట్టుగానే ఇతిహాస దృష్టితోనే రాసిన నన్నయ చక్కని పరిష్కారం చేసాడు, ఎలాగో ఆనందిద్దాం!

తమ భార్య అయోనిజ అయిన ద్రౌపదికి వస్త్రాపహరణ మంతటి దారుణం– అందునా ఆమె ఏకవస్త్ర (స్త్రీలు అశుచిగా ఉండే కాలం) అయ్యున్న కాలంలో చెప్పలేనంతటి ఘోరం– జరిగింది కదా! అదృష్టవశాత్తు ఆ పరాభవం నుండీ –రాజ్యం కోల్పోవడమనే కష్టం నుండి– ధృతరాష్ట్రుని కారణంగా బయటపడ్డారు కదా పాండవులు! ఇలాంటి స్థితిలో తిరిగి ద్యూతం ఆడుదామని తిరిగి వాళ్ళెలా అడిగారు? ఏ మూర్ఖుడైనా ద్యూతం ఆడుదామనుకుంటాడా? ధర్మరాజు మళ్ళీ జూదాన్ని ఆడి కొత్త ఇబ్బందిలో అరణ్యాజ్ఞాత వాసాలని చేయాల్సి వచ్చాడా? పరిష్కారమెలా చేసాడు నన్నయ! ఉన్నదున్నట్టుగా రాయడమనేది తనకి కష్టాన్ని కల్గించలేదా?

నన్నయేదో ఇలా ఇతిహాస ధోరణిలో రాసాడు గాని – 'మాకు అది ఇష్టం లేదు. వీలుపడదనకుండా' ఆ తర్వాతి ఇద్దరూ కూడ ఇదే మార్గంలో ప్రయాణించడం,

మనని కొద్దిగా లోతుగా ఆలోచించేలా మెదళ్ళకి సానపెట్టే పనికి పురికొల్పడం అనేది నిజంగా మనం చేసుకున్న అదృష్టమే అని భావించాలి.

ఎఱ్ఱన పూర్తిచేసిన అరణ్యపర్వ శేషంలో సావిత్రీ సత్యవంతుల ఉపాఖ్యానం మరింత మెచ్చుకోదగినది. శుభమా! అంటూ అశ్వపతి తన కూతురైన సావిత్రిని సత్యవంతునకిచ్చి వివాహం జరిపించదలిచానని అనగానే నారద మహాముని సరిగ్గా నేటికి సంవత్సర కాలంలో అతనికి మరణ ముందని చెప్పడం సబబేనా? దాన్నీ దాచి రాయచ్చుగా! కాదు. ఉన్నదాన్ని ఉన్నట్లే రాయాలని భావించి అలానే రాసాడు ఎఱ్ఱన. లో విశేషాలు తెలిశాక ఎంతో ఆనందమనిపిస్తుంది!

ఇక తిక్కన విషయానికొస్తే ఆయన విరాటపర్వంలో లేని రహస్యమంటూ లేదు. అందుకే దాన్ని కొందరు చమత్కారంగా 'విరాట్‌పర్వం' అంటుంటారు.

పాండవులైదుగురూ ఒకే ఒక్క రోజున విరాటుని కొలువు కూటానికి వెళ్ళారా? ఒక్కొక్కరూ క్షాత్ర తేజంతో వెలిగిపోతుంటే విరాటునికి ఏమీ అన్పించలేదా చివర ద్రౌపదీ ప్రవేశమయ్యాకనైనా? లేదా కించిత్సంశయంతోనే తీసుకున్నాడా? పైగా వాళ్ళ వాళ్ళ వృత్తులమార్పుల్లో రహస్య విశేషం ఎంతుందో దాన్ని గమనింపజేయాలని భావించి ఇతి– –హ– ఆస విధానంలో తిక్కన అలాగే అందించాడా? ఔను... ఈ ఐదుగురి అజ్ఞాతకాలపు మారు వేషాల్లో అద్భుత రహస్యం దాగుంది. చూద్దాం!

'ఇది శత వృద్ధ మా జనని!' పాండవుల ఆయుధాల కట్టని జమ్మిచెట్టు మీద పెట్టబోతూ అక్కడికి చేరిన ఆ శ్మశానంలో ఉంటూ ఆటలాడుకునే పిల్లలందరికీ – ఈ కట్ట మరేదో కాదు. నూరేళ్ళు నిండిన మా అమ్మ శవం – అని ధర్మరాజు పచ్చి అబద్ధాన్ని ఆడాడా? ఏమిటిది? అంతే ఘట్టాన్ని మార్చకూడదనే మార్చలేదు.

## ఒకే ఇతిహాస ధోరణిలో అన్ని కథలూ ఉన్నాయి

నిజాన్ని నిజంగా మాట్లాడుకుంటే భారతకథలన్నీ ఒకే తీరుగా కన్పిస్తాయి. ఇది ఇలాగే జరిగిందని మనం అనుకుంటున్నామే – అలాగే అన్నీ కన్పిస్తాయి. స్థలం పేర్లూ సంఘటనల చిన్న చిన్న మార్పులూ తప్ప అన్నీ ఒక్కటే అన్పిస్తాయి. పరిశీలిద్దాం!

మొదటిది కద్రువ, వినతల కథ. భర్త అయిన కశ్యప ప్రజాపతి తన భార్యలైన

ఇద్దరినీ వరం కోరుకోమన్నాడు. కద్రువ వేయిమందినీ, వినత ఇద్దర్నీ కోరుకుంది. కద్రువకి పుట్టిన అందరూ పాములే. కుటిల స్వభావులే. అంటే పాముల్లా వంకరవంకరగా నడిచేవాళ్ళే. పాముకున్నట్టుగా రెండు నాల్కలవాళ్ళే. అంటే ఎప్పటికప్పుడు మాటల్ని మార్చేవాళ్ళే. పాము ఎలా కాటువేసి, ఆ కాటు తిన్న వ్యక్తి నురగలు గక్కుతూ విలవిల్లాడుతూ ఉంటే, ఏమీ ఎరగని దానిలా చూస్తూ ఉంటుందో అలా తాను పెట్టిన బాధలకి గురౌతూ పాండవులు తల్లడిల్లిపోతుంటే నిమ్మకి నీరెత్తినట్టుగా ఉండేవాళ్ళే. నెలకో మారు కుబుసాన్ని విడవడానికి పాము ఎలా తలకిందులైపోతుందో మూతిని గట్టిగా పట్టుకున్న ఆ కుబుసం విడిపోయేంతవరకూ ఎలా గిజగిజలాడుతూ రెండు చెట్ల మధ్య తలదూర్చి తలని ఇటు తిప్పి అటు తిప్పి మొత్తానికి ఆ కుబుసం పగిలిపోయేలా చేసుకుని తన శరీరాన్ని ఆ కుబుసం నుండి బయటికొచ్చేలా చేసుకుంటుందో అలాటి లక్షణమే నూరుగురిదీను. తమకి కష్టం వచ్చినవేళ – ఎవరికీ అపకారం చేయకూడదనే ఆలోచన కొంతకాలం పాటే ఉండే జాతి వారిది. కష్టం తీరిందా? మళ్ళీ వాళ్ళ లక్షణం యథా పూర్వమే. పాము కూడా ఆ కుబుసం విడిపోకుండా బాధ పడుతున్న సందర్భంలో – ఇంకెవరినీ కాటు వేయకూడదు. బుద్ధిగా బతకాలి... అనుకుంటూ ఎప్పుడైతే కుబుసం కాస్తా విడిపోతుందో ఆ క్షణం నుండే ఎవరిని కాటేద్దామా? అని మంచి నిగనిగలాడే శరీరంతో మెరిసిపోతూ కన్పిస్తుంది.

ఇక వినతాపుత్రుల్లో ఒకడు, కద్రువ మీది అసూయ ద్వేష భావంతో వినత కారణంగా నడుం వరకే ఉన్న శరీరంతో అ–నూరుడయ్యాడు. పోనీ సంతానం కలిగిందనే ఆనందాన్ని కల్గించాడా? అంటే సవతికి 500 ఏళ్ళపాటు దాసిగా ఉంటూ – రెండో గుడ్డు నుండి మంచి సంతానాన్ని పొందు! అని ఇటు శాపం అటు వరం లాగా రెంటిని ప్రసాదించి సూర్య రథానికి సారథిగా ఎగిరిపోయాడు.

ఇది మరేదో కథ కాదు. కద్రువ వినతల కథ మరెవరి కథో కాదు. గాంధారి కుంతుల కథే. గాంధారికి ఆ కద్రువలాగానే వేయిమందికి బదులు వందమంది సంతానం. వాళ్లలో ఒక్కరిదంటే ఒక్కరిది కూడ సాధుస్వభావం కాదు. పాపం కుంతికి నిజానికి సంతానం ధర్మజ భీమ అర్జునులు ముగ్గురే. ఆదరించి మరో ఇద్దర్నీ మాద్రి పుత్రులని చేరదీసింది. వీళ్ళంతా సాధుస్వభావులు.

అనూరుడు పుట్టి ఆకాశానికి వెళ్ళిపోయాక వినత తన సవతి పంచలోనే మౌనంగా, తన బతుకుని వెళ్ళదీసుకోవాల్సి వచ్చింది. సరిగ్గా కుంతి కూడ తన ఐదుగురు పుత్రులతో ఆ సవతి అయిన గాంధారి పంచనే జీవితాన్ని గడపాల్సి వచ్చింది. ఎలాగైతే వినత అంగవికలుణ్ణి కని మౌన వేదనని అనుభవించిందో సరిగ్గా అలాగే కుంతి కూడా తన కన్యాదశలోనే సూర్యుని వల్ల సంతానాన్ని పొంది –తాను తల్లి నని చెప్పుకోలేని స్థితిలో జీవితమంతా గడిపింది.

కద్రువపిల్లల ఆగడాల్ని చూస్తూ వినత మారు మాటాడేది కాదు. కుంతి కూడ అంతే గాంధారి మీద తిరగబడింది కాదు. ఎక్కడ ఆ స్థానం కూడ తనకి జారిపోతుందోననే భయంతో రెండవ గుడ్డునుండి గరుడుడు పుట్టడం తనకి సంతోషాన్ని కల్గించిందనుకుంది వినత. అయినా తన దాస్యం తొలిగే మార్గం లేకపోయింది. సమర్థుడైన పుత్రుడుండి కూడ దాసిగానే జీవించసాగింది. కుంతి కూడ తన కైదుగురు యమధర్మరాజ– వాయు– ఇంద్ర– అశ్వినీదేవతల అంశలవాళ్లు సంతానంగా ఉన్నా ఏదో ఒక ఉపద్రవాన్ని గాంధారి పుత్రులవల్ల పొందుతూనే ఉంది. కద్రువ పిల్లల్ని గరుత్మంతుడు ఆకాశంలో తిప్పుతూంటే (ఇది కూడ కద్రువ ఆజ్ఞమీదే) సూర్యలోకపు వేడిమి తగిలి వాళ్లంతా చచ్చి పడ్డారు. కద్రువ గరుడుణ్ణి నానాతిట్లూ తిట్టింది. ఇంద్రుణ్ణి ప్రార్థించి వాళ్లని బతికించుకుంది. ఇదే తీరుగా కుంతీపుత్రుడు భీముడు కౌరవపుత్రుల్ని చెట్టుమీద ఉన్నవాళ్లని చెట్టుని తన్ని నేలన పడేలా ఆటకోడితనంగా చేసాడు. గాంధారి మందలించేది ఇలాటి పనులకి. అయితే తన దుర్యోధనుడు భీముడికి విషాన్నాన్ని పెట్టినా, నదిలోకి తోసినా ఏమీ తెలియనట్టుగా ఉండేది. సంతానాన్ని ఏమీ అనేది కాదు.

వినతాపుత్రుడు గరుత్మంతుడు ఇంద్రలోకానికెళ్ళాడు. స్వర్గాన్ని కూడ దర్శించాడు. సూర్యలోకం మాట సరేసరి. సరిగ్గా ఇదేతీరుగా కుంతీపుత్రుడైన అర్జునుడు కూడ స్వర్గానికి వెళ్ళొచ్చాడు. కద్రువ పుత్రులందరూ కలిసి అమృతాన్ని తెచ్చిచ్చి మాతృదాస్యాన్ని తొలగించుకోవలసిందిగా గరుత్మంతుడికి చెప్తే, గరుడుడు ఇంద్ర రక్షణలో ఉన్న అమృత భాండాన్ని ఎంతో సంకుల యుద్ధాన్ని చేసి సాధించి తెచ్చాడు. ఇంద్రుడు వచ్చి ఆ అమృతాన్ని కాస్తా నాగులకి దక్కకుండా చేసాడు. సరిగ్గా గాంధారీ

పుత్రులైన కౌరవుల క్కాడ అన్యాయంగా అర్ధరాజ్యం లభిస్తే - సంతృప్తి పడి ఉంటే సరిపోయుండేది. కాదు - పూర్తి రాజ్యం మాక్కావాల్సిందే! - అని తీర్మానించుకున్నారు. కురుక్షేత్రం దాకా తెచ్చుకున్నారు. రాజ్యం మొత్తం మాట అటుంచి ఆ అర్ధరాజ్యాన్ని కూడ కోల్పోయారు. వంశప్రతిష్ఠని కూడ మంటగలుపుకున్నారు.

అమృతం తాగకుండానే అజరా-మరత్వాన్ని వరంగా పొందాడు గరుడుడు. శ్రీహరి క్కాడ వరప్రదానం చేసేస్థాయి కెదిగి శ్రీహరి రథానికి టెక్కెంగా (గరుడధ్వజుడు), వాహనంగా (గరుడ వాహనుడు) కాగలిగాడు. కద్రువ పుత్రులైన పాముల్ని తన కాహారంగా వరం పొందాడు కూడా గరుడుడు. మరి ఈ రెండు కథలూ ఎంత పోలిక కలవో కదా!

ఇతి+హ+ఆసమంటే. 'ఇలాగే జరిగింద'ని కదా మన మనుకునేది. 'లోకంలో ఓ వ్యక్తి పుట్టుక. ఎదుగుదల- విద్యాభ్యాసం- ఉన్నతస్థాయి- ఆస్తిపాస్తుల సంపాదన -వివాహం- ఔన్నత్యం- దెబ్బతింటే కిందపడడం లేదా పై స్థాయికి రావడం - మరణించడం' అనేవే కదా ఉంటాయి ఎవరి జీవితంలోనైనా. ఎవరి జీవితాన్ని ఎవరి జీవితంతో పోల్చి చూసినా ఈ సంఘటనే కొద్ది మార్పులతో సంభవిస్తూ ఉంటాయి. అదే కదా ఇతి+హ+ఆసమంటే.

పాల సముద్రాన్ని మథించారు ఒకరికొకరు గిట్టని దేవ దానవులు. దాన్ని తరచడం కోసం నానా యాతనలూ పడ్డారు. చివరికమృతం లభించగానే మోసంతో తామే కాజేయాలనుకున్న రాక్షసులకి అది దక్కకుండా శ్రీహరి మాయామోహినీ రూపంతో పట్టుకెళ్ళిపోయాడు. దేవతలకి లభించింది చివరికి. ధర్మం గెలిచింది- అధర్మం నామరూపాల్లేకుండా ఓడిపోయింది.

### నలదమయంతులూ ఇంతే

పూర్తిగా ధర్మరాజు కథే నలమహారాజు కథ కూడ. అందుకే బృహదశ్వ మహర్షి పాండవుల్ని ఓదార్చడం కోసం కొన్ని కథల్ని చెప్పబోతే వినవలసిందన్నాడు ధర్మరాజు.

ఇంద్రప్రస్థానికి రాజు ధర్మరాజు. నిషధ దేశానికి రాజు నలుడు. పాంచాల దేశాధిపతి అయిన ద్రుపదుని కూతురూ యుద్ధవిద్యా ప్రాభవం కలదీ అయిన

ద్రౌపదిని పెళ్ళాడాడు ధర్మరాజు. విదర్భ రాజు కూతురు దమయంతిని పెళ్ళాడాడు నలుడు. భార్యల్ని పెళ్ళాడిన తీరు కూడ ఇద్దరిదీ స్వయంవరం ద్వారానే. స్వయంవరం అంటే తమని ఎవరు ఇష్టపడితే ఆమె మెడలో తాళి కట్టడమని అర్థం కాదు. మత్స్యయంత్రాన్ని కొట్టినవాడే వరించాలనేది ద్రౌపది వివాహానికి పరీక్ష అయితే, నలుని ఆకారంలో ఉన్న నలుగురిలో ఎవరు నలుడో గమనించి పెళ్ళాడాలనే పరీక్ష దమయంతి వివాహానికి. ద్రౌపదీ దమయంతీ కూడ రూపగుణ ఐశ్వర్యాది విశేషాల్లో గొప్పవాళ్ళే.

నలుడికి ద్యూతమనేది ఓ వ్యసనం కాదుగాని, ఆడుకోవడమనేది ఇష్టమైన పని. ధర్మరాజుదీ అదే స్థితి. శత్రువు బలహీనత అనేది ప్రతి శత్రువుకి గట్టి అండ కదా! దాంతో దుర్యోధనాదులు ధర్మరాజుని శకుని ద్వారా మాయాద్యూతంతో పూర్తిగా ఓడించేసారు. సరిగ్గా ఇలాగే నలుణ్ణి పుష్కరుడనేవాడు కూడ ఓడించేసాడు. మరింత ఆశ్చర్యకరమైన అంశమేమంటే ధర్మరాజుని శకుని హెచ్చరిస్తూ – నీ భార్య నీకు మిగిలిన ఆస్తిగా ఉందిగా! పందెపు వస్తువుగా పెట్టు! అన్నాడు. ధర్మరాజు అలాగే చేసి ఆమెని కూడ కోల్పోయాడు. పుష్కరుడు కూడ ఇలాగే సూచించి దమయంతిని కూడ నలుడు ఓడగొట్టుకునేలా చేసాడు.

ద్రౌపదీ దమయంతీ కూడ భర్తలతో అరణ్యాలపాలు అయ్యారు. దమయంతి అరణ్యవాసకాలంలో దుర్మార్గుల చేత చిక్కి మనోవేదనకి గురైనట్లే ద్రౌపది కూడ అజ్ఞాతవాసంలో కీచకుని కారణంగా మనోవ్యధకి గురయింది. పాండవులకి తమ సోదరులైన కౌరవులే శత్రువులై జీవితాంతం ఇబ్బందికి గురి చేసినవాళ్ళైతే, నలుడికి కూడా తన సోదరుడైన పుష్కరుడే కడగండ్లని తెప్పించినవాడు. ఇలా చూసుకుంటూ పోతే మొత్తం భారతంలో కన్పించే ఉపాఖ్యానాలన్నీ ఒకే పోలికతో కన్పిస్తాయి. అన్నిటా ధర్మమే చివరికి గెలుస్తుంది.

ఈ దృష్టితో చూస్తే రామాయణంలో కూడ భారతేతిహాసం కన్పిస్తుంది. అందుకే ధర్మరాజాదులు రామకథని కూడ మహర్షుల ద్వారా విన్నట్లుంటుంది భారతంలో.

రామాయణంలో రాముడు సూర్యవంశీయుడు. ఇక్కడ ధర్మరాజూ మొదలైన ఇందరూ చంద్రవంశం వాళ్ళు. శ్రీహరే నలుగురిగా అవతరిస్తే (అవ–పైనుండి,

తార – కిందికి అంటే ఈ లోకానికి దిగడం), వాళ్ళలో రాముడు మాత్రమే ప్రధానుడుగా కన్పించేవాడవుతూంటే, భారతంలో కూడ ధర్మరాజూ మొదలైన ఐదుగురూ పాండవులుగా ఉంటూంటే, వాళ్ళలో ప్రధానుడుగా కన్పించేవాడవుతూంటే, వాళ్ళలో ప్రధానుడుగా ధర్మరాజు మాత్రమే 'ఉత్తారం' (ఉత్–ఈ భూమినుండి, తారం – పైకి అంటే స్వర్గానికి వెళ్ళడం) చేసాడు. రామాయణంలో అవతారం –భారతంలో ఉత్తారం జరిగింది.

అక్కడ సీతమ్మే ప్రధానమైనట్లుగా ఇక్కడ ద్రౌపదే ప్రధానురాలయింది. తమ్ముడైన భరతునికి రాజ్యాన్ని అప్పగించి రామలక్ష్మణులు అరణ్యానికి వెళ్ళినట్లు, భారతంలో కూడ సోదరులైన కౌరవులకే రాజ్యాన్ని అప్పగించి పాండవులు అరణ్యవాసానికి సాగిపోయారు.

అక్కడ సీతారామ లక్ష్మణులకి ఎందరో మహర్షుల తపశ్శక్తి లభిస్తే ముందు నాటికి రావణవధకి ఇదంతా సహకరిస్తే, ఇక్కడ భారతంలో కూడా పాండవులకి అనేక మహర్షుల ఆశీర్వచనాలూ ప్రబోధాలూ అనుగ్రహాలూ కౌరవవధకి సహకరించాయి. ద్రౌపదిని సైంధవుడు అపహరించుకుపోయినట్టే సీతని కూడ రావణుడపహరించుకుని వెళ్ళిపోయాడు. రామాయణంలో ఎందరో చివరికి విభీషణుడు చెప్పినా వినిపించుకోని రావణుడు తన నగరం మొత్తాన్నీ రాక్షసజాతినీ కూడ చంపుకున్నట్లే, భారతంలో కూడ భీష్మద్రోణ విదురాదులూ కొందరు మహర్షులూ కూడా చెప్పినా వినిపించుకోని కారణంగా దుర్యోధన ధృతరాష్ట్రులు మొత్తం హస్తినాపురాన్ని అమాయిక ప్రజల్నీ రాజ్యాన్నీ కూడ నామరూపాల్లేకుండా చేసుకున్నారు.

అక్కడ రాముడు ఒంటరిగా వైకుంఠానికి వెళ్ళినట్టే, ఇక్కడ ధర్మరాజు కూడ ఒంటరిగానే – ఇందాక అనుకున్నాం కదా! ఉత్తారాన్ని చేస్తూ స్వర్గాన్ని చేరాడు.

ఈ దృష్టితో పరిశీలిస్తూ పోతే మొత్తం రామాయణ భారతకథలూ వాటిలో కన్పించే ఉపాఖ్యానాలూ అన్నీ కూడ ఒకే మూలసూత్రం మీద ఆధారపడి కన్పిస్తాయి. కొన్ని కొన్ని మార్పులూ చేర్పులూ ఉన్నా మొత్తానికి సూత్రం మాత్రం ఒకటే.

ఇతిహాసాన్ని – ఉన్నదాన్ని ఉన్నట్టుగా మాత్రమే – లోకానికి అందించగలిగితే,

ఏ కల్పనలూ గాని లేకుండా ఇలా కథా ప్రవాహాన్ని నిరభ్యంతరంగా సాగిపోయేలా చేస్తే, ఎవరి ప్రజ్ఞ ఎంతదో అంతంతగా ఆ ఇతిహాసాల్లో  దాగిన రత్నాల నిధుల్ని సొంతం చేసుకోగలుగుతారు.

అందుచేత రామాయణంలో భారతం, భారతంలో రామాయణం, భారతంలో మళ్ళీ రామాయణం.... ఇలా సాగుతూనే ఉంటాయి పరిశీలన మీదట. అలాగని ఈ కథలన్నీ ఒకేలా ఉంటాయన్నమాట! అని తేల్చెయ్యకూడదు. అన్ని ఇళ్ళూ ఒకే ఇటుక సున్నం అదుసూ కట్టుబడితోనే ఉన్నా వేటి ప్రత్యేకత వాటి కున్నట్టుగా ఏ ఇతిహాసానికుండే  గౌరవం ప్రత్యేకతా వాటికుండనే ఉంది.

**నిగ్గు తేలాలంటే**

పైన మనం అనుకున్నట్టే ఇతిహాసం నిగ్గు తేలాలంటే ప్రతి ఉపాఖ్యానాన్నీ (శకుంతలా దుష్యంతులు – కచోపాఖ్యానం– ఏకలవ్యుడు – ధర్మజ రాజసూయం... ఇలా అనుమానాల్ని మాత్రం అనుకున్నాం కదా!) వ్యతిరేక దృష్టితోనే చూడాలి. అప్పుడే – ఇదేమిటి ఇలా రాసారు? అనే బుద్ధి మనకి కలిగి లోదృష్టితో పరిశీలించి నిజాన్ని గ్రహించుకోగలుగుతాం!

పైననుకున్న అనేక సందేహాలనీ నివృత్తి చేయాలంటే ఇది ఓ ఉపన్యాసం కాదు కాబట్టీ – వ్యాసం మాత్రమే కాబట్టీ నా ప్రసంగంలో తప్పక ఆ ప్రశ్నలన్నిటికీ సమాధానాలని  నన్నయ తిక్కన ఎఱ్ఱన మహాశయుల పద్యాలని ఉటంకిస్తూ తెలియజేసుకుంటానని మనవి చేసుకుంటూ, నాకు సర్వకాల ఆరాధ్యులైన ఆచార్య బ్రహ్మశ్రీ వేలూరి సుబ్బారావు మహోదయులకీ ఆచార్య బ్రహ్మశ్రీ శలాక రఘునాథ శర్మ మహోదయులకీ సాష్టాంగ శతాలని సమర్పించుకుంటూ ముగిస్తున్నాను.

*( వ్యాసకర్త : విశ్రాంత ప్రధానాచార్యులు, ప్రవచనకర్త, హైదరాబాద్ )*

# మహాభారతము - వేదాంతము

బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ
94403 82028

మహాభారతానికి 'పంచమవేద'మనే ప్రశస్తి ఉంది. వేదం ధర్మ - జ్ఞానాలను బోధించే విద్య. లౌకికానికి ధర్మం- పరమార్థానికి జ్ఞానం. ఇక్కడ 'లౌకిక' శబ్దానికి ఇహలోక - పరలోకాలు రెండూ వర్తిస్తాయి. ధర్మంలేని వానికి ఇహమూ లేదు - పరమూ లేదు. అర్థకామాలు లౌకికాలే. వాటిని ధర్మవిరుద్ధంగా ఆర్జిస్తే అవి తత్కాలంలో లభించినా, దీర్ఘకాలంలో దెబ్బతింటాయి. జీవుని దెబ్బతీస్తాయి కూడా. అందుకే దానిని ప్రథమ, ప్రధాన పురుషార్థంగా సనాతన ధర్మం పేర్కొన్నది. అటువంటి ధర్మాన్ని ఈశ్వరార్పణ బుద్ధితో, విద్యుక్తంగా ఆచరిస్తే, అది చిత్తశుద్ధినిచ్చి, 'మోక్ష' పురుషార్థానికి కావలసిన 'చిత్తశుద్ధి'ని ప్రసాదిస్తుంది. ఆ చిత్తశుద్ధి ద్వారా బ్రహ్మవిద్యను సంపాదించి, తద్వారా మోక్షాన్ని పొందగలము. ఆ బ్రహ్మవిద్యకే 'జ్ఞానం' అని పేరు. అధ్యాత్మ విద్య, వేదాంతము అనేవి బ్రహ్మవిద్యకు పర్యాయపదాలు.

ధర్మ, అర్థ, కామ, మోక్షాలనే నాలుగు పురుషార్థాలలో మొదటి దానిని, నాల్గవదానిని బోధించే శాస్త్రం వేదం. వాటిని ఆఖ్యాన, ఉపాఖ్యాన, ఉపదేశాలనే మూడు ప్రణాళికలతో అందించిన మహేతిహాసం పంచమవేదం మహాభారతం.

మహాభారతానికున్న వేదప్రతిపత్తిని తెలుగు భారత కర్తలైన కవిత్రయము కంఠోక్తిగా ప్రస్తావించారు.

"అమితాఖ్యాన" శాఖలం బొలిచి వేదార్థములచ్ఛయమై, సుమహావర్గ చతుష్కపుష్ప వితతిన్ శోభిల్లి ..." భాసిల్లే మహాభారత పారిజాతాన్ని నన్నయ ప్రస్తుతిస్తే-

"…. కృష్ణద్వైపాయనుదర్థిలోక హితనిష్ఠంబుని కావించె,

ధర్మాద్వైత స్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్….'' అని తిక్కన కీర్తించాడు.

ఆమ్నాయము (శ్రుతి) శ్రవణం ద్వారానే గ్రహించే విద్య. అది 'వ్రాయదగ్గది.' అయితే 'లేఖ్యం'. వ్రాయదగిన వేదం మహాభారతమట. వేదం చెప్పిన ధర్మ – జ్ఞానాల నడుమ అర్థకామాలనే పురుషార్థాలను నిబద్ధించడం ఆర్ష విజ్ఞత.

వేదాలకు సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకము, ఉపనిషత్తు – అని ప్రతిశాఖకి నాలుగు అంశాలుంటాయి. అందులో అంతమునందు (చివరికి) చెప్పిన అంశం ఉపనిషత్తు కనుక దానికి 'వేదాంతమ'ని పేరు. వేదము యొక్క అంతిమ తీర్మానమే వేదాంతమని ఆదిశంకరుల నిర్వచనం. వేదం యొక్క తాత్పర్యం, పరమప్రయోజనం జ్ఞానకాండలైన ఉపనిషత్తులయందు తీర్మానించబడినది. అదే ఆధ్యాత్మికవిద్య లేదా బ్రహ్మవిద్య. 'ఆధ్యాత్మవిద్య విద్యానాం…' అని భారతాంతర్గత భగవద్గీత వాక్యం ( 12 వ అధ్యాయం 32వ శ్లోకం).

అంతిమజ్ఞానం వేదాంతం, అంతిమ పురుషార్థం మోక్షం. ఈ రెండింటినే పరమార్థం అంటారు. ఆ పరమార్థమే మహాభారత పరమ తాత్పర్యం. "అధ్యాత్మ విదులు వేదాంతమ''ని కొనియాడే మహాభారతంలో ఆ విద్య విస్తారంగా సాక్షాత్కరిస్తుంది. సర్వోపనిషత్తుల సారవస్తువు బహువిధాల ఉపదేశింపబడడం భారత ప్రత్యేకత.

అంతర్లీనంగా ఆఖ్యానంలోను, ఉపాఖ్యానాలలోను అధ్యాత్మ విద్య నిక్షిప్తమైనప్పటికీ, స్పష్టంగా కొన్ని ఉపదేశాలలో ఉపాఖ్యానాలలో బహిర్గతంగా ఆవిష్కరింపబడింది.

## ఊరట జ్ఞానం చేతనే

అరణ్యపర్వం ఆదిలోనే – రాజ్యత్యాగం చేసి వనవాసానికి సిద్ధపడిన సందర్భంలో, శౌనకుడనే బ్రహ్మర్షి యుధిష్ఠిరునితో చెప్పిన వాక్యాలు, 'దుఃఖానికి ఔషధం జ్ఞానమే'– అని స్పష్టపరుస్తాయి.

శరీర దుఃఖాలు ఔషధాదులను సేవించడం వల్ల తొలగించుకోవచ్చు. "… స్నేహజంబులయిన మానస దుఃఖంబులు, జలంబుల నగ్ని ఉపశమిల్లునట్లు

విమల జ్ఞానంబునం జేసి ఉపశమంబునం బొందు."

విషయాలలో రాగము మొదలైనవి 'స్నేహం' (ఆసక్తితో కూడిన సంగం)వలన కలుగుతాయి. ఈ స్నేహమనే సముద్రంలో మునిగిన జీవుడు ధృతిని కోల్పోయి దుఃఖానికి లోనై, తాపంచేత మోహితుడౌతాడు. కనుక బంధుమిత్ర ధనార్జన పట్ల స్నేహాన్ని విడవాలని, పద్మపత్రం (తామరాకు)పై నీటివలె, అన్ని విషయాలలో ఉండేవాడు, మోహ కారణమైన స్నేహానికి లోను కాడు – అని ఋషి బోధ.

"స్నేహంబున రాగంబును, రాగంబునం కామంబును, కామంబునం క్రోధంబును, క్రోధంబునం దృష్టియు వర్తిల్లు.... అది సర్వ దోషముల కాస్పదము, అది దురితక్రియాను బంధములకున్ మొదలు, నిరంతర దుఃఖప్రదమ"ని బ్రహ్మర్షి బోధ. మూల భారతంలోని ఈ అధ్యాత్మ బోధను చక్కని గద్యపద్యాలలో నన్నయ ఆవిష్కరించారు.

జీవితంలో ఎదురయ్యే కష్ట నష్టాలలో ఈ జ్ఞానమే ధృతిని అందిస్తుందని ఈ సన్నివేశం స్పష్టం చేస్తోంది. అరణ్యవాస కాలంలోనే ఎందరో మహర్షుల సత్సంగం ధర్మరాజుకి లభించిన సౌభాగ్యం. ఆ సందర్భంలో వారు చెప్పిన ధర్మ జ్ఞానోపదేశాలు ఆతనికి మనః స్థైర్యాన్ని, కర్తవ్యనిష్ఠని ప్రసాదించాయి.

## ధర్మవ్యాధుని బ్రహ్మజ్ఞానం

ఆ బోధలలో మార్కండేయ మహర్షి చెప్పిన ధర్మవ్యాధుని కథ మకుటాయమానం.

కౌశికుడనే ద్విజుడు తపస్సిద్ధుడై గర్వించిన సమయంలో మాంసవిక్రయోద్యోగి అయిన ధర్మవ్యాధుని గురించి విని, ఆతనిని చేరుకుంటాడు. అప్పుడు ధర్మవ్యాధుడు చేసిన బోధ అధ్యాత్మ విద్యయే. స్వధర్మాచరణ, శిష్టాచార నియతి మొదలైనవి చెబుతూనే బ్రహ్మవిద్య ప్రస్తావన చేసి విస్తరించిన వైఖరి ఒక అద్భుత క్రమం.

దేహం అస్థిరం. తన కర్మ వశాత్తు ఇటువంటి దేహాలను పొందుతూ, వదులుతూ ఉన్న జీవుడు సనాతనుడు, దోషరహితుడు – అని జీవలక్షణాలను తెలియజేస్తాడు. తన సనాతన, నిర్దోషస్థితిని తెలుసుకున్నవాడు ముక్తుడౌతాడు.

*చిరముగ ధర్మముల్ నడప చిత్తము దేఱు, బ్రసన్న చిత్తుడై*
*పరువడి నింద్రియార్థముల భంగులు రిత్తలుగా నెఱింగి, చె*
*చ్చెరనవి యంత వట్టు నిరసించి, తపోదమ సత్యశీలతం*
*బరిణతి నొందు బొందు పిదపం బరమార్థ పద ప్రభావమున్.*

(అరణ్య, పర్వం)

ఇంద్రియ నిగ్రహంలో ధర్మాచరణ వలన చిత్తం ప్రసన్నమౌతుందని, అటువంటి ప్రసన్న చిత్తంతో తపస్సు, దమము, సత్యశీలత వలన పరిణతి ఏర్పడి పరమార్థ పదప్రభావం సిద్ధిస్తుందని "బ్రహ్మవిద్యా ప్రపంచం బెఱింగించెద నవధానపరుండవై ఆకర్ణింపుము" అంటాడు.

"అరదము దేహము, ఇంద్రియము లశ్వము లాత్ముడు సూతుడిమ్మహాతురగ చయంబు ధైర్యమనుతోరపు బగ్గములన్" – అంటూ ఉపనిషత్తులుచెప్పిన 'శరీరరథం, ఇంద్రియాశ్వాలు, బుద్ధి సారథి, ధైర్యం పగ్గాలు' అనే కవితాత్మక ప్రబోధాన్ని అందిస్తాడు.

ఇందులో ప్రాణాపానాది యోగవిద్యా విషయాలను కూడా ప్రస్తావించడం విశేషం.

*"భూతములందు వెలింగెడు*
*భూతాత్ముని నెఱుగుదురు ప్రబుద్ధులు, నిత్య*
*జ్యోతిర్మయునవ్యయు న–*
*ద్వైతంబగు బుద్ధి సూక్ష్మధర్మము వలనన్"* అని

సర్వ భూతాంతరాత్మ అయిన పరమాత్మ స్వరూపాన్ని, తత్ ప్రాప్త్యుపాయాన్ని వివరించుతాడు.

అశాశ్వతమైన జీవితాన్ని శాశ్వతమైన పరమాత్మను సాధించడానికై సాధనంగా వినియోగించుకోవాలని బోధిస్తాడు. ఈ శుద్ధ జ్ఞానప్రాప్తికి – తాను నిరాసక్తంగా పాటించే సత్కర్మాచరణ, ధర్మనిష్ఠలే కారణాలని, "ఉత్తమ విజ్ఞానోన్నతి వడయుటకు నిజంబగు మూలంబైనది, గలదొక ధర్మము..." అని ప్రత్యక్షంగా చూపించడం కూడా ప్రత్యేకత.

ఎఱ్ఱన ఈ వృత్తాంతాన్నంతా రమణీయంగా ప్రబంధీకరించడం తెలుగు భారతంలోని ఒక వైశిష్ట్యం. పుట్టుకతో ఏ వర్ణం వాడైనా ధర్మ, జ్ఞానాల చేత అధికుడై అధ్యాత్మ నిష్ఠుడుగా పరమ పురుషార్థాన్ని పొందవచ్చని ఈ వృత్తాంతం తేటపరుస్తుంది.

## యక్ష ప్రశ్నలకు వేదాంత సమాధానం

వనవాసాంతకాలంలో ధర్మరాజు యక్షప్రశ్నల కిచ్చిన సమాధానాలలో ధర్మం వలన కలిగిన అధ్యాత్మజ్ఞానమే ప్రకాశిస్తుంది.

"ఆదిత్యుని నడిపేదేది?" మొదలైన ప్రశ్నలకు జవాబుగా, "ఆదిత్యుని నడిపేది బ్రహ్మము– ధర్మునిచే అతడస్తమిస్తాడు – అతనికి సత్యము – ఆధారము" అని విచారణాత్మక సమాధానమిచ్చి, శాస్త్రాధ్యయనం, దాని వలన కలిగిన జ్ఞానం చేత శ్రోత్రియుడౌతాడు. తపస్సు చేత మహత్త్వం కలుగుతుంది, ధృతియే నిజమైన సహాయం వంటి ఉక్తులతో జ్ఞాన ప్రాధాన్యాన్ని ప్రస్తావించడం గమనార్హం.

ధార్మికాంశాలను చెబుతూనే – 'గర్వముడిగి, క్రోధమడచి' ప్రియాప్రియములు సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వముల పట్ల సమబుద్ధి కలవాడే 'సర్వధని'– అని ద్వంద్వాతీత స్థితిని సమాధానంగా అందివ్వడం బ్రహ్మనిష్ఠుని స్థితిని వివరిస్తుంది.

ఇవి ధర్మజుడు తన యుక్తితో చెప్పిన సమాధానాలు అని సరిపెట్టుకోరాదు. తన ధర్మనిష్ఠతో కలిగిన శుద్ధ చిత్త ప్రభావం, వనవాస కాలంలో సత్సంగం వలన కలిగిన విచారణాత్మకమైన జ్ఞానశక్తి....వీటితో పండిన ధర్మరాజు బుద్ధి పరిణతి యక్షుని కిచ్చిన సమాధానాలుగా వ్యక్తమయ్యింది.

## సనత్సుజాతుని బోధ

ఉద్యోగపర్వంలో విదురుడు ధృతరాష్ట్రునకు చెప్పిన రాజనీతి విషయాలు 'విదురనీతి'గా ప్రసిద్ధాలు. అవి రాజధర్మాలనే కాక వ్యక్తికి కావలసిన నైతిక విజ్ఞానాన్ని అందిస్తాయి. అవి ప్రవృత్తి మార్గధర్మాలు. అవి విన్నాక – "పరమార్థ దృష్టి ఎట్టి వాక్యములఁ గల్గు?" అని ధృతరాష్ట్రుడు ప్రశ్నించాక అధ్యాత్మ విద్యాప్రస్తావన ప్రారంభమవుతుంది. విదురుని స్మరణ చేత సనత్సుజాతుడు అక్కడికి వేంచేసి ధృతరాష్ట్రునకు బోధించిన వేదాంత విద్య 'సనత్సుజాతీయం'గా ప్రసిద్ధి చెందింది.

ఆదిశంకర భగవత్పాదులు దీనికి విస్తారమైన భాష్యాన్ని ప్రసాదించారు. ఈ గ్రంథాన్ని తిక్కన అత్యంత సంక్షిప్తంగా ఆంధ్రీకరించాడు - అనే కంటే కేవలం, సనత్సుజాతుడు "అధ్యాత్మ విషయంబులగు వివిధ వాక్యంబుల సోపాన ప్రకారంబున నంతకంతకు సూక్ష్మంబులగు నర్థంబులు సమర్పించుచు...." అని ఒక్క వాక్యంలో ప్రస్తావన మాత్రంగా పేర్కొన్నాడు.

మృత్యువు - అమృతం, మానం - మౌనం...వంటి విషయాలను సనత్సుజాతుడు అద్భుతంగా వివరిస్తూ 'అజ్ఞానమే మృత్యువు' అని, స్వస్వరూపం అమృతమని, జ్ఞానం చేత దానిని పొందవచ్చని చక్కని వేదాంత వాక్యాలతో బోధించడం మూల భారతంలోని అంశం. లోతైన అధ్యాత్మ జ్ఞానాన్ని సిద్ధాంత, దృష్టాంతాలతో రచించిన రమ్యమైన శాస్త్రమిది. విదురనీతి ద్వారా ధర్మాలను, సనత్సుజాతీయం ద్వారా వేదాంత జ్ఞానాన్ని వెంటవెంటనే చెప్పడం ధర్మజ్ఞానాల అనుబంధాన్ని తెలియజేయడమే.

### గీతాశాస్త్రం సారంగా...

వేదాంత విద్యలో అత్యంత ప్రధానమైన భగవద్గీత మహాభారతంలోనిదేనని మరువరాదు. సర్వోపనిషత్సారభూతమైన గీతాశాస్త్రం ద్వారా భారత హృదయం వేదాంత విద్యయే అని స్పష్టమౌతుంది. దీనిని తిక్కన గారు - కథా గమనానికి అవరోధం కాకుండా తెలుగు చేశారు. సనత్సుజాతీయం వలె కాకుండా కొంత సంక్షిప్తంగా గీతోపదేశాన్ని అందిచ్చినది తెలుగుభారతం.

"... యేను గార్పణ్య దోషోపహత స్వభావుడను, ధర్మసమ్మూఢ చేతస్కుండనై నిన్ను శరణు సొచ్చియడిగెద, నీ శిష్యుండనగు నన్ను శాసింపుమనిన, విని కలకల నవ్వి నారాయణుండు నరున కిట్లనియె...." అని భగవదుపదేశాన్ని ప్రారంభిస్తూ...

*"...వగతురె యున్నవారికి, నవశ్య విధేయత జన్నవారికిం*
*దెగు వగలెల్ల చిత్తము ప్రదీప్త వివేకమయత్వ మొందినన్"*

అని పలికి, ఆత్మ లేకపోవడమనేది లేదు, దేహానికి ఉండడమనేది లేదు... అంటూ "ఆత్మ తత్త్వంబు శాశ్వతంబగుట యెఱింగించి" శ్రీకృష్ణ పరమాత్మ పరమార్థాన్ని బోధించాడు.

*ఫలములయెడ బ్రహ్మార్పణ-*
*కలన పరుండగుచు కార్య కర్మము నడపన్*
*వలయుం దత్త్వజ్ఞానము*
*తలకొనినం కర్మశమము దానై కలుగున్*

కర్మలను బ్రహ్మార్పణ బుద్ధితో ఆచరించే వానికి తత్త్వజ్ఞానం కలుగుతుందని, దానివలన తనంత తానే కర్మ (బంధములు) శమిస్తుందని సార విషయాన్ని తెలియజేశాడు.

అటుపై విశ్వరూప సందర్శన యోగాన్ని చక్కని పద్యగద్యాలతో తిక్కనగారు అందంగా ఆవిష్కరించారు.

*నానాస్ఫుట వర్ణంబులు*
*నానాభంగులును గలుగు నారూపములో*
*నానాశ్చర్య విధంబులు*
*గానగ నగు, జూపెదం బ్రకాశస్ఫూర్తిన్....*

అని 'దివ్యదృష్టి నొసంగి' 'దివ్యరూపంబు సూపె'. దానిని దర్శించిన విజయుడు చేసిన స్తుతిని రమ్యంగా అందించాడు తిక్కన.

*జగములకు నాది కారణ -*
*మగు పరమజ్ఞేయ మీవయని కనియెద, భూ*
*గగన దిగంతరమంతయు*
*నగణితమూర్తీ! భవన్మయంబై తోచెన్"*

*అంబు పవమాన సూర్యచంద్రానలాది*
*వివిధ తత్త్వంబులును నీవ విశ్వలోక*
*సంప్రవర్తనకరుడవు శాశ్వతుండ -*
*నచ్యుతుండవు పుండరీకాక్ష నీవు...*

ఈ స్తుతి చేసిన విజయునితో "మత్కర్మ పరుండును మద్భక్తుండును నైన వానికి నన్ను బడయవచ్చునని అతనిని ఆశ్వాసించి,"

*అతడు మఱియును బ్రహ్మ విద్యాన్వయమున*
*దనకు సందిగ్ధ మైనట్టి దానినెల్ల*
*నడుగగా నమ్మహాత్ముడత్యంత కరుణ*
*దెలియ జెప్పుచు హృదయ సంచలత మాన్చె....*

.... ఇవ్విధంబున బార్థునకుపనిషదర్థ జాతంబవగతంబు సేసి, మనసు కసటు వాపి, వివేకంబునరుం జేవ గలిగించి, కృష్ణుండీ గుహ్యతర జ్ఞానంబు'' ఉపదేశించాడని క్లుప్తీకరించిన తిక్కన, గీతలోని చరమవాక్యాన్ని చక్కని పద్యంగా ''పరమ రహస్యంబొక్కటి" అంటూ ఆంధ్రీకరించారు.

*క్రందుకొను సర్వ ధర్మ వికల్పములను*
*నెడల విడిచి దృఢంబుగ నేనొకండ*
*శరణముగ నాశ్రయింపుము, సకల దురిత -*
*ములను దొలగింతు నిన్ను బ్రమోదమొంద.*

దీనికి మూలం:

*సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।*
*అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచః॥*

'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనే మాటని 'సర్వ ధర్మ వికల్పములను నెడలవిడిచి' అని తెలుగు జేయడం వ్యాఖ్యాన ప్రాయమే.

## భీష్ముడు చెప్పిన జ్ఞానామృతం

యుద్ధానంతరం, ధర్మజుని పట్టాభిషేకం తర్వాత భీష్ముడు శ్రీకృష్ణుని ఆదేశంతో చేసిన ఉపదేశం శాంతి, అనుశాసనిక పర్వాలుగా విస్తృతమైనది. ఈ రెండు పర్వాలను కలిపి సనాతన ధర్మ సర్వస్వంగా, మహా భారత సారంగా చెప్పవచ్చు.

ముందుగా రాజధర్మాలతో ప్రారంభించి వర్ణాశ్రమ ధర్మాలు, ఆపద్ధర్మాలు వంటివి బోధిస్తూ ప్రసక్తానుప్రసక్తంగా ఆచారకాండను, స్త్రీ ధర్మాలను కూడా భీష్మ పితామహుడు బోధిస్తాడు.

అర్థకామాలకు నియంత్రణని, పవిత్రతని ఇచ్చేది ప్రవృత్తి ధర్మమైతే, మోక్షానికి ముఖ్యమైన జ్ఞానాన్ని అనుగ్రహించే ధర్మం నివృత్తి ధర్మం. ఈ నివృత్తి ధర్మమే అధ్యాత్మ (వేదాంత) విద్యామార్గం. సంసారంలో ప్రవృత్తితో ఉన్నా నిరపేక్షంగా నిస్సంగంగా దానిని మోక్షస్థాపక జ్ఞానానికై వినియోగిస్తే – అది కూడా ప్రవృత్తితో నివృత్తిగా ఉపకరిస్తుంది.

ధర్మములేవీ నిష్ఫలములు కావు – అని చెబుతూనే, "....ఆత్మమోక్షావలంబియైన ధర్మముత్తమమండ్రు తత్త్వజ్ఞులధిప" అంటాడు భీష్మాచార్యుడు.

"ప్రియములు నప్రియములును, హృ–

దయమున బొరయమియ మోక్షదంబగు ధర్మంబు" అని సారవాక్యం.

ఇక్కడ నుండి అనేక ఉపాఖ్యానాలతో, ఉపదేశాలతో భీష్ముడు చేసిన బోధ మూల భారతంలో ఒక బృహత్గ్రంథమే. దానిని సారవంతంగా తిక్కనగారు తెలుగున అందించిన తీరు ప్రశంసనీయం.

ఇందులో ప్రతి వేదాంత విషయ చర్చ వివిధ ఋషులు వివిధ సందర్భాలలో చెప్పినవన్నీ గుదిగ్రుచ్చినట్లుగా సాగుతుంది. అంటే 'పరంపరాప్రాప్తంగా, ఋషిప్రోక్తంగా వచ్చిన సనాతన విద్య' ఇది అని చెప్పడం ఈ ఇతివృత్తాలను ఉట్టంకించడం. అంతేకాకుండా చెప్తున్న విషయం 'సప్రమాణం' అనే ప్రతిపత్తి దీని ఉద్దేశం.

1. సేనజిత్తనే రాజుకి ఒక విప్రుని బోధ, 2. మేధావియనే బాలుడు తన తండ్రికి చేసిన జ్ఞానోపదేశం, 3. మంకియనే వానికి స్వానుభవ జనిత విచారణ, 4. ప్రహ్లాదునకు ఒక అవధూత చేసిన బోధ 5. కౌశిక, ఇక్ష్వాకులగాథ, 6. మనుబృహస్పతి సంవాదం. 7. హార్ష్ణేయ ముని బోధ, 8. ఇంద్ర ప్రహ్లాద సంవాదం. 9. వ్యాస శుక సంవాదం, 10. జాజిలి తులాధార వృత్తాంతం, 11. చిరకారి చరితం, 12. కపిల గోసంవాదం, 13. జనకరాజ మాండవ్య సంవాదం, 14. జనక యాజ్ఞవల్క్య

సంవాదం, 15. జనకసులభా సంవాదం, 16. వసిష్ఠ జనక, 17. జనక పరాశర సంవాదం, 18. నృత్యగీత, 19. నారద – నారాయణ ముని సంవాదం, 20. ఇంద్ర –బలి సంవాదం... ఈ సంవాదాల చరిత్రలను ఆధారంగా సమగ్ర వేదాంత జ్ఞానాన్ని బోధించడం భీష్ముని జ్ఞాననిష్ఠను, వ్యాసుని రచనాచాతురిని స్పష్ట పరుస్తుంది.

"పరమ సుఖము తృష్ణ యుడుగుట ".... వంటి సారవాక్యాలు ఈ బోధలలో కోకొల్లలు.

"…. పెక్కు పూసలందు త్రాడున్నట్లు
భూతకోటియందు పురుషుడుండు..."

పృథివికంటె జలం, జలం కంటె తేజస్సు, అంతకంటె వాయువు, దానికంటె ఆకాశం, దానికంటె మనస్సు, దానిపై బుద్ధి, అటుపై కాలం గొప్పవి. వీటన్నిటి కంటె గొప్పది (అధికమైనది) పరమాత్మ,

*ఆదియు మధ్యమునంతము*
*నాదేవేశునకు లేమి నవ్యయుడతడీ*
*వేదములకు నానావిధ*
*వాదములకు జేరుగడ భవక్షేపి నృపా!*

ఆ పరమాత్మను పొందడమే సర్వశాస్త్రాలకు, సాధనలకు పరమ లక్ష్యం. అదియే సంసారాన్ని తొలగించునది. ముక్తి రూపమైనది.

ఈ బోధ – గాథల క్రమంలో జాజిలితులాధారవృత్తాంతం మకుటాయ మానమైనది. ఇది కొద్దిగా అరణ్యపర్వంలోని ధర్మవ్యాధి వృత్తాంతాన్ని పోలి ఉంటుంది.

జాజిలి అనే తపస్వి తన తపస్సుకి తానే అబ్బురపడినప్పుడు, ఆకాశవాణి, అంతకంటె గొప్ప తపస్వి తులాధారుడు అని చెప్పగానే అతడు కాశీ నగరానికి వెళ్ళి తులాధారుని కోసం వెతుకుతాడు. అతడొక వర్తకుడు. తన వ్యాపారాన్ని తాను వంచన లేకుండా, సిద్ధి అసిద్ధులలో సమబుద్ధి కలిగి, సమలోష్టాశ్మ కాంచనుడై, నిందాస్తుతులకు చలించని వాడై, సర్వభూతదయాపరుడై, సత్యనిష్ఠుడై ఉన్న బ్రహ్మజ్ఞాని. లోకంలో

మార్పులకు చిత్తరువును చూసినట్లుగా సాక్షిగా దర్శిస్తూ, తామరాకు మీద నీటిబొట్టులా ఉండే తత్త్వజ్ఞుడు.

ఏ ఆశ్రమాలలో ఉన్నా, లోకవ్యవహారంలో కూడా అధ్యాత్మ విద్యను పొందవచ్చు. తత్త్వజ్ఞునిగా ధన్యుడు కావచ్చు.... అనే బోధ ఇందులో ఉంది.

అహంకారంతో, కామంతో కూడిన తపస్సు, ఫలకాంక్షతో ఉన్న యజ్ఞం – లోభంతో ఉన్నవి కనుక దేవతలు మెచ్చరు. నిత్యతృప్తుడైన సత్యయజ్ఞుని పట్ల దేవతలు అధికతృప్తులౌతారు.

*ధర్మరాముడు సంతత*
*ధర్మసఖుడునై, యసంగతానిష్ఠ మతిన్*
*నిర్మలుడగువానికి*
*నిష్కర్మత్వానందసిద్ధి గలుగు మునీంద్రా!*

ఈ ప్రసంగంలో 'శ్రద్ధ' గురించి గొప్పవిచారణ ఉన్నది.

శ్రద్ధ అంటే శాస్త్ర, గురువాక్యాలపై ఆస్తిక్య (విశ్వాస) బుద్ధి – అని శాస్త్ర నిర్వచనం. దానిద్వారా శాస్త్రోక్త కర్మలను నిస్సంశయంగా, ప్రసన్న బుద్ధితో ఆచరిస్తారు. 'శ్రద్ధాయోగం'తో చేసిన కర్మలే సత్కర్మలు.

"శ్రద్ధయనం జనునది జీవాత్మ సుప్రసన్నత సుమీ" అనే చక్కని వాక్యం.

గృహస్థాశ్రమంలో ఉన్నా, విహిత కర్మాచరణ నిస్సంగంగా ఆచరిస్తూ, జ్ఞాని నిస్సంగుడై, ముక్తుడై సంచరిస్తాడు... అనే సత్యాన్ని ఇక్కడ స్పష్టం చేస్తాడు. 'మత్సరాది చిత్తములన్యములు, శ్రద్ధగల మనంబునందు నిలువ నేరవు' – అని హితబోధ, 'స్పర్ధ'ను వదలి 'శ్రద్ధ'ను స్వీకరించాలి – అని తులాధారుని వాక్కు.

## ఏ ఆశ్రమమైనా వేదాంతానికి యోగ్యమే

జనక మహారాజు సులభా అనే బ్రహ్మవాదినితో జరిపిన సంభాషణ – స్త్రీలలో బ్రహ్మజ్ఞానులున్నారన్న వాస్తవానికి తార్కాణం. ఉపనిషత్తులలో మైత్రేయి,గార్గి వలెనే సులభా వృత్తాంతం.

"గృహస్థాశ్రమం వలన ముక్తి సిద్ధించదని, ఎవడు, ఎప్పుడు, ఎక్కడ నిరూపణ చేసి చెప్పాడో చెప్పు. గృహస్థాశ్రమం ధర్మానికీ, మోక్షానికీ కూడా నిధానము" అని కపిల స్యూమరశ్మి సంవాదంలో నిరూపితం.

"జ్ఞానంబు నాశ్రయించిన వానికి నే పనుల గీడు వాటిల్లదు" అంటూ అధ్యాత్మ జ్ఞానం కలిగినవాడు కర్మాచరణ చేసినా బంధితుడు కాడని కపిలవచనం.

పంచభూతాది తత్త్వవిచారణ, ఆ తత్త్వాలకు అతీతమైన నియామకమై ఉన్న పరతత్త్వనిరూపణ, దాని ప్రాప్తికై ఇంద్రియ నిగ్రహం,యోగం, అంతర్యాగం వంటి శాస్త్రీయ సాధనా మార్గాలను వివిధ సంవాదాలలో శాంతి పర్వం బోధిస్తుంది.

'దమం' (ఇంద్రియ నిగ్రహం) కలవాడు సుఖంతో, శుభాలతో నిర్భయంగా జీవిస్తాడు. సద్గుణాలకు కాణాచి దమమే.

"రోజుకు రెండు పూటలు మాత్రమే హితమిత భోజనం చేసేవాడు 'సదోపవాసి'. ఋతుకాలంలో ధర్మపత్నితో సంగమం కలవాడు 'సదా బ్రహ్మచారి'. అతిథులను ఆదరించి అటుపై తాను ఆరగించేవాడు విఘశాసనుడు. తన ఆశ్రితులను భుజింపచేశాక తాను భుజించే వాడు అమృతాశి. (అతినిద్రలేక) పగటిపూట నిద్రించనివాడు 'అస్వప్నుడు'– ఇలాంటి ఆదర్శ ధార్మిక వాక్యాలు ఈ ఉపదేశ వాహినిలో అసంఖ్యాకాలు.

వేదాంత శాస్త్రంలో చెప్పబడిన ప్రకృతి తత్త్వాల, త్రిగుణాల విచారణ, వాటికి అతీతమైన పరబ్రహ్మతత్త్వం పలుమార్లు ప్రస్తావిస్తూ– 'బ్రహ్మచర్యం, అహింస' అనే రెండు గొప్ప ధర్మాలను ఆచరించడమే ఉత్తమ తపస్సు అని హార్ష్ణేయ ఋషి వచనంగా పేర్కొంటారు.

యోగపద్ధతిలో వాయు (ప్రాణ) నిగ్రహణ చేసి, తద్వారా మనోనిగ్రహాన్ని సాధించి, పరమాత్మ యందు చేర్చే యోగవిద్యను, అంతర్యాగ విధానాన్ని కూడా శాంతి పర్వం బోధిస్తుంది.

శాస్త్రీయమైన జపవిధానాన్ని ఈ ప్రకరణాలలో తెలుసుకోవచ్చు. ఏకాగ్రచిత్తుడై, మాత్సర్యం, గర్వం, దర్పం, దంభం – తొలగించు కొని శౌచవిధులు పాటిస్తూ జపం చేయాలని కౌశిక ఇక్ష్వాకు వృత్తాంతం వివరిస్తుంది.

సనాతన ధర్మం చెప్పే తపస్సు, జపం, ధ్యానం, యోగం, జ్ఞాన విచారణ – వీటి స్వరూప స్వభావాలు భీష్మ బోధలో స్పష్టంగా, సవిస్తారంగా గ్రహించవచ్చు.

కామం, క్రోధం, భయం, నిద్ర, నిశ్వాసం (నిగ్రహం లేని శ్వాస)– వీటిని జయించాలంటే క్రమంగా, సంకల్ప రాహిత్యం, ఓర్పు, జాగ్రత్త (ఏమరపాటు లేకుండుట), సత్త్వ గుణ సేవనం, మితాహార స్వీకరణ– అవసరమనే విజయ జీవనబోధ ఏకాలానికైనా ఎవరికైనా ఉపయోగకరమైనది.

## ఏకాంత భక్తికి ప్రాధాన్యం

కర్మమార్గంలో 'గౌణం'గా ఉన్న భక్తి, జ్ఞానంలో 'పరా' భక్తిగా పరిణతి పొందుతుంది. ఈ 'పరా' భక్తికే అనన్య, ఏక, సిద్ధ, ముఖ్య, ఏకాంత (ఏకాంతిక) మొదలైన పేర్లు ఉన్నాయి.

'భక్త్యా మామభిజానాతి', 'శ్రద్ధవాన్ భజతేయో మాం సమే యుక్తతమో మతః', 'భక్త్యా త్వనన్యయా శక్య మహమేవం విదోఽర్జున' – మొదలైన భగవద్గీత వాక్యాలు భక్తి యొక్క ప్రాధాన్యాన్ని చెబుతున్నాయి. 'శ్రద్ధా భక్తి జ్ఞానయోగా దనై హి' – అనే ఉపనిషద్వాక్యం కూడా దీనికి ప్రమాణం.

నరనారాయణులలో నారాయణమునిని ఆశ్రయించి నారదుడు ఏకాంతిక భక్తి యోగాన్ని అవగతం చేసుకొని అనుష్ఠించాడు. దీనిని 'నిర్మల ధర్మం'గా చెబుతూ నారాయణుని నుండి దక్షుడు, అతని నుండి సూర్యుడు, ఆయన నుండి మనువు, వాని నుండి ఇక్ష్వాకువు.... ఇలా ఇది పరంపరాగతమైనది– అనే సంప్రదాయాన్ని కూడా చెప్పడం విశేషం. 'భక్తా ఏకాంతినో ముఖ్యాః' అనే నారద భక్తి సూత్రం ఇక్కడ ద్యోతకమౌతుంది.

అనుశాసన (ఆనుశాసనిక) పర్వంలో కూడా కొన్ని పదుల సంవాదాలున్నాయి. 1. గౌతమీ, లుబ్ధక, సర్ప,మృత్యు, కాల సంవాదం 2. ఇంద్ర మతంగ సంవాదం, 3. సనత్సుజాత నారద సంవాదం, 4. చ్యవన ఋషి సంవాదం, 5. చ్యవనకౌశిక సంవాదం, 6. బృహస్పతి మాంధాత సంవాదం 7. గోశ్రీ సంవాదం, 8. సూర్య జమదగ్ని సంవాదం, 9. పరాశర శిష్య సంవాదం, 10. గౌతమ దేవేంద్ర సంవాదం,

11. హరసనత్కుమార సంవాదం, 12. ఉమామహేశ్వర సంవాదం, 13. వ్యాస మైత్రేయ సంవాదం... మొదలైనవి.

*సర్వ శాస్త్ర వాక్య సమితినాలోకించి*
*మఱియు దృఢ విచార మహిమతెలిసి*
*నిశ్చయింపబడియె నిష్ఠ నారాయణు –*

*నెపుడు దలపవలయు నిది యొకండ* (అనుశాసన) అని భక్తి ప్రాధాన్యం వక్కాణించబడినది.

## సనత్కుమార వచనం

ప్రకృతిలో ఉంటూనే ప్రకృతి వికారాలకు అంటకుండా శుద్ధాత్మ స్వరూపంగా ఉండే జ్ఞాని గురించి సనత్కుమారుడు నరునకు చెప్పిన వాక్యాలు అద్భుత వేదాంత సారాలు.

"నీటిలో చేప, మేడిపండులో కీటకాలు... వలె ప్రకృతిలోనే వేరుగా ఉన్నవాడు జీవుడు. తామరాకుపై నీరులా ప్రకృతి సంబంధ వికారాలు లేని తనను నిర్లేపునిగా (అంటనివానిగా) అజరునిగా అమరునిగా గ్రహించాలి. ఇరువది నాలుగు జ్ఞానతత్త్వాల ప్రకృతి నుండి వేరైన ఇరువది ఐదవ వానిగా తనను గ్రహించిన వాడు, క్రమంగా అన్నిటికీ ఆధారమైన అనంత పరతత్త్వమైన ఇరువది ఆరవదానిని పొంది ముక్తుడౌతాడు" అని చక్కని తత్త్వబోధ.

*ప్రకృతి నిట్లు వాసి పంచవింశుడు ష–*
*డ్వింశభావమొంది విమలశివ ని–*
*రంజన స్వరూపుడై వెలుగొందు న–*
*త్తెఱగు ముక్తి యండ్రు దేవదేవ!* (అను)

*'సంగము బంధమఖిలనిస్సంగత మోక్షము'* వంటి సారవాక్యాలు ఎన్నో.

*చతుర్విధా భజంతేమాం జనాః సుకృతినోఽర్జున ।*
*ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥*
*తేషాంజ్ఞానీ నిత్యయుక్తః ॥*

– అనే గీతా వాక్యాల ద్వారా ఆర్త, జిజ్ఞాసు, అర్థార్థ భక్తులు గౌణభక్తులుగా, జ్ఞాని పరాభక్తుడుగా చెప్పబడుతున్నాడు. 'ఏకభక్తిర్విశిష్యతే' అని, గీతయే మరొక చోట నొక్కి చెబుతోంది.

వేదాంతంలో ఈ భక్తికి ముఖ్య స్థానం.

ఆ భక్తిని పెంపొందించే విష్ణు నామ నిరుక్తము శాంతి పర్వమందిస్తే, విష్ణు సహస్ర నామ స్తోత్రం అనుశాసనపర్వంలో నామవిద్యగా లభించింది. ఈ నామాల అర్థ విచారణ పరబ్రహ్మ తత్త్వ ప్రతిపాదనయే కనుక, దీనిని బ్రహ్మ విద్యగానే భావించాలి. అందుకే ఆచార్యులు దీనికి భాష్యం రచించారు.

## అభేద భక్తి అసలు విషయం

జ్ఞానంలో భేదభావాలుండవు. కనుకనే అభేదభక్తి వ్యాస హృదయం. శివనామ నిరుక్తం, శివసహస్ర నామస్తోత్రం ఈ రెండు పర్వాలలోనూ ఉన్నాయి. మహాభారత ఖిల భాగమైన హరివంశం కూడా ఈ అభేదాన్నే ప్రస్తావిస్తుంది. ద్రోణపర్వంలో అశ్వత్థామకు వ్యాసుడు చేసిన బోధ, తత్పూర్వం అరణ్యపర్వంలో అర్జునుడు 'శివాయ విష్ణురూపాయ' అంటూ చేసిన శివస్తుతి, ద్రోణపర్వంలోనే కృష్ణార్జునులు సూక్ష్మభూమికలో చేసిన కైలాసగమనం, శివ దర్శనం, శివస్తుతి, వారిరువురి నిత్య శివార్చనా విషయం, అనుశాసన పర్వంలో ఉపమన్యుని ద్వారా శ్రీకృష్ణుడు ఉపదేశంగా పొందిన శివతత్త్వం, శివనామ విద్య వంటివి భారతంలో విశేషాలు.

"ఒకే సత్యం హరిహరులుగా రెండు ఆకృతులను దాల్చింది" – సత్త్వమేకం ద్విధాకృతమ్ – అని వ్యాసోక్తి.

ఈ రహస్యమే తిక్కనగారు హరిహరాద్వైత మూర్తిగా ప్రత్యక్షం చేసుకొని, తన భారతాన్ని ఆ మూర్తికే అంకితం చేశాడు. ఇది భారత హృదయం.

*శ్రీయన గౌరి నాబఱగు చెల్వకు చిత్తము పల్లవింప, భ–*
*ద్రాయిత మూర్తియై హరిహరం బగు రూపము దాల్చి, విష్ణు రూ–*
*పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్త జనంబు వైదిక –*
*ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వము గొల్చెద నిష్ట సిద్ధికిన్*

(విరాట పర్వం)

అశ్వమేధ పర్వంలో శ్రీకృష్ణార్జున సంవాదంలో కూడా హరిహరతత్త్వం కృష్ణుని ద్వారా బోధింపబడుతుంది. విష్ణు సహస్ర నామవిద్యను భీష్ముడు తెలియజేస్తే, ధర్మరాజు కోరికపై భీష్ముని ప్రార్థనపై శ్రీకృష్ణుడే శివనామ నిరుక్తాన్ని, శివ సహస్ర నామ విద్యని ఉపదేశించడం మరొక వైశిష్ట్యం.

**అనుగీతలో అందాలు**

అశ్వమేధ పర్వంలో అర్జునునకు నాడు ఉపదేశించిన గీతావాక్యాలను తిరిగి జ్ఞప్తికి తెస్తూ, మనస్సులో నిల్పుటకు శ్రీకృష్ణుడు ఉపదేశించిన 'అనుగీత' మరొక అధ్యాత్మ జ్ఞానధార.

'తత్త్వజ్ఞానస్థిరీకరణ'కు చెప్పిన రుగీత జ్ఞాన ప్రాధాన్యాన్ని నొక్కి చెబుతుంది. కశ్యపుడనే వాడు ఒక సిద్ధ పురుషుని చేరి తెలుసుకున్న బ్రహ్మవిద్య ఇందులో ఉపదేశం.

దీనిని సంక్షేపంగా చెప్పినా, భగవద్గీత కంటె కాస్త విస్తారంగానే తిక్కనగారు తెలుగు చేశారు. దేహానికి జఠర వేదన మొదలుకొని, రోగమరణాదుల బాధలను వివరించి, వైరాగ్యహేతువైన ఉపదేశంతో ప్రారంభించి, పొందవలసిన తత్త్వజ్ఞానాన్ని బోధించడం ఇందులోని అందమైన వేదాంత విజ్ఞాన బోధనాక్రమం.

సుఖదుఃఖాలు అస్థిరాలు; తనువు అశుచి, అఖిల పదార్థాలు అశాశ్వతాలు; కర్మలంపటత్వం జాడ్యం – అని తెలుసుకొని, కప్పిన మోహావేశాన్ని తొలగించుకొనే సాధన చేసిన వారు మోక్షపదాన్ని పొందుతాడు. వైరాగ్య, అభ్యాసాలను వీడకుండా, నియమబద్ధుడై యోగాన్ని అవలంబించాలని, ముంజగడ్డినుండి ఇషీకను వేరుచేసినట్లు ప్రకృతిబంధం నుండి స్వస్వరూపాన్ని గ్రహించాలని తెలియజేస్తూ– మనస్సును అంతర్ముఖం చేసి, బాహ్యగతికి తిరిగి వెళ్ళనీయకుండా చిత్తవృత్తులను నిరోధించే

యోగ పద్ధతిని శ్రీకృష్ణుడు బోధించిన వైనాన్ని తిక్కనగారు చక్కగా సంక్షిప్తంగా తెలుగుచేశారు.

*"దంతములు, జిహ్వ, కుత్తుక, తాలుతలము,*
*కంఠనాళంబు, హృదయంబగణ్యచరిత!*
*మఱియు లోపల నెచటికి మనసు మెలగె*
*దాగదల్చక యచటన యాగవలయు "* (అశ్వమేధ పర్వం)

"... లోన నునిచిన మనసునే ముఱక యాత్మవెదకు తెఱగు మేలు"

'అనుగీత'ను "బ్రహ్మవిద్యారహస్యంబు సర్వంబు నీకుం జెప్పితి" అని శ్రీకృష్ణుని మాట. దీనికి అనుబంధంగా కృష్ణుడు చెప్పిన 'అంతర్యాగము' విచారణ రూపమైన ఒక అద్భుత ప్రక్రియ. ప్రాణుల దేహాలలో ఆత్మ అగ్నివలె ప్రకాశిస్తుందని, ఆ ఆత్మ అనే అగ్నిలో ఒక యజ్ఞ ప్రక్రియవలె సర్వమును లీనముచేసే విధానం ముక్తి హేతువు. బహిర్యజ్ఞ పరులు లోకాలోక గమనం చేస్తారని, అంతర్యాగ పరాయణుడు జనన మరణ విముక్తుడవుతాడని ఒక 'భర్తృభార్యాకృత సంవాదరూపం'గా 'బ్రాహ్మణగీతలు'గా శ్రీకృష్ణుడు బోధిస్తాడు. భార్యాభర్తలు బ్రహ్మవిద్యా చర్చ చేయడం గృహస్థులకు ఒక చక్కని బోధ. జనక యమసంవాదం, గురుశిష్య సంవాదం వంటివి ఈ అనుగీతలో అధ్యాత్మ విద్యాప్రబోధకాలు. ఎన్నో ఉపనిషదంశాలు ఇందులో విస్తరింపబడ్డాయి.

రాజతామసాలను విడచి సత్త్వాగ్ని సాధనగా చేసుకున్నవాడు క్రమంగా త్రిగుణాతీత స్థితిని పొందుతాడు అని తెలియజేస్తూ -

*సత్త్వము ప్రదీప మా పర-*
*తత్త్వము గాంచుటకు గాన తత్సాధన తా*
*తత్త్వము వదలగ చిత్తసు -*
*ఖత్వా కలితమగు నెలవు గంద్రు కృతాత్ముల్.* (అశ్వమేధ)

*తమము రజస్సుదొఱఁగి, స-*
*త్త్వమునన రమియించి అగుణ-*
*తత్త్వముగని, స-*
*త్త్వమును దిగవిడుచు వైరా-*
*గ్యమహితుడగు ముని వరుండు....*

– ఈ అనుగీతను తిక్కనగారు విస్తారంగానే అందించడం, అందునా వేదాంతాన్ని తెలుగు పద్యగద్యాలలో శిల్పంగా మలచడం అద్భుతం.

రాజసూయయాగంతో సర్వంసహా చక్రవర్తియైన ధర్మమూర్తి యుధిష్ఠిరుడు, సర్వం కోల్పోయి అరణ్యవాస సమయంలో 'మమ'కారాన్ని విడచి, అజ్ఞాతకాలంలో 'అహం' కారాగ్ని వదలి అటుపై ఉద్యోగించి మహాప్రస్థానం ద్వారా స్వర్గారోహణాన్ని పొందడమే వేదాంత జ్ఞానాన్ని స్ఫురింపజేస్తుంది.

అన్ని విద్యలకు వేదాంతమే పర్యవసానమైనట్లుగా, మహాభారత విద్య కూడా అధ్యాత్మ విద్యాపర్యవసాయి... అనడంలో సందేహం లేదు.

– ఇతిశమ్ –

*(వ్యాసకర్త: ఆధ్యాత్మిక ప్రవచనకర్త, హైదరాబాద్)*



మనిషికి రోగాలు కుందేలులాగా వస్తాయి. తాబేలులాగా వెళతాయి. కాని సంపద తాబేలులా వచ్చి, కుందేలులా వెళ్లిపోతుంది.



సంపదకంటే జ్ఞానం ఉత్తమమైనది. ఎందుకంటే సంపదను మనం రక్షించుకోవాలి. కాని జ్ఞానం మనలను రక్షిస్తుంది.



మంచి కులంలో పుట్టినవాడు, వంశగౌరవం కలవాడు, విద్యావంతుడనని విర్రవీగేవాడు – వీరందరూ ధనికుని ఆశ్రయించి బ్రతకవలసిందే.



సంపద, గొప్పదనం, మోక్షం – ఇవన్నీ వాక్కు వల్లనే మనకు సంప్రాప్తిస్తాయి.

# మహాభారతము–నీతిశాస్త్రము

డా. కసిరెడ్డి వెంకటరెడ్డి
98669 56250

ప్రస్తావన

*అన్నదమ్ములేకోదర న్యాయపంక్తి*
*దాటిపోని రామాయణ ధర్మమరసి*
*ఆసకైపున అన్యులన్యోన్య కంఠ*
*ములకు తెగిన భారత నీతి కులికె మనసు*

(రాయప్రోలు)

–అన్నదమ్ములు కలిసి ఉండాలి, కలహించరాదు అని చెప్పడానికే రాయప్రోలు వారు ఇది చెప్పి ఉండవచ్చుగాక! కుత్తుకలుత్తరించుకోవడమే మహాభారత రాజనీతి సుమా అనే ఉద్దేశంతో చెప్పింది కాదు.

భారతంలో లేనిది ఎక్కడా లేదు. ఎక్కడలేనిదయినా భారతంలో ఉంది అన్న ఉద్దేశం సత్యాతిసత్యం. ఆ శ్లోకమిది.

శ్లో॥ *ధర్మేచార్థేచ కామేచ*
*మోక్షేచ భరతర్షభ।*
*యదిహాస్తి తదన్యత్ర*
*యన్నే హాస్తి నతత్ క్వచిత్॥*

(ఆది, 62 ఆ, 53 శ్లో.)

ధర్మార్థ కామమోక్షాలను గూర్చి భారతంలో ఏది ఉందో, అదే అంతటా ఉంది; ఇందులో లేనిది మరెందులోనూ లేదు.

వివిధ వేదతత్త్వవేదియైన వేదవ్యాసులవారు మహాభారతాన్ని ధర్మశాస్త్రమని, వేదాంతమని, నీతిశాస్త్రమని, మహాకావ్యమని, సర్వలక్ష్య సంగ్రహమని, ఇతిహాసమని, బహుపురాణ సముచ్చయమని, విశ్వజనీనమైనదని ఆదికవి నన్నయభట్టన్నారు. (ఆది, 1ఆ, 32ప). కవిబ్రహ్మ తిక్కన భారతం ప్రామాణికమని ఇలా అన్నారు–

కం॥ *వేదములకు నిఖిల స్మృతి*
*వాదములకు బహు పురాణ వర్గంబులకున్*
*వాదైన చోటులను దా*
*మూదల ధర్మార్థ కామ మోక్ష స్థితికిన్* *(విరాట: 1ఆ, 4వ ప.)*

ధర్మార్థ కామమోక్షాల నిర్ణయంలో శ్రుతి స్మృతి పురాణాల మధ్య భేదాభిప్రాయ మేర్పడినప్పుడు, నిరూపణం చేయడానికి ప్రమాణంగా నిలిచే గ్రంథం మహాభారతమని కవిబ్రహ్మ తిక్కన అభిప్రాయం.

ప్రపంచంలోని అనేక సమస్యలను తీర్చే మూలాధార గ్రంథం భారతం అని అందరు అంగీకరించడానికి ఆదికవి నన్నయభట్టు చెప్పిన గుణాలన్నీ ఉండడం వల్లనే అందరూ ఆవిధంగా భావించారని చెప్పాలి.

సామాన్యులు కూడా తమ మాటల్లో వింటే భారతం వినాలి–తింటే గారెలు తినాలి; కర్ణుని తలమీదనే భారతం, ఉత్తరుని ప్రగల్భాలు, గొంతెమ్మ కోరికలు, ఆవులను మలిపినవాడే అర్జునుడు, పేరు ధర్మరాజు పెనువేప విత్తయా, చేటభారతం–ఇలా భారతాన్ని గూర్చి సామెతలుగా, జాతీయాలుగా యథాలాపంగా చెప్పుకోవడం ఉంది. ఆలి పంచాయతీ రామాయణం–పాలి పంచాయతీ భారతం అంటూ తమ జీవితాలకూ అన్వయించు కొంటారు. ఈ గ్రంథాల పరమార్థం తెలియనివారు రామాయణం రంకు–భారతం బొంకు అని చెప్పుకోవడమూ ఉంది. తమ దాయభాగం కొరకు ధర్మరాజు అడిగినట్లుగా జానపదుల నోట ఒక పద్యం వినిపిస్తుంది.

సీ॥ *అరవింద చరణంబు లర్పించి పూజించి*
*ముమ్మారు రాజుకు మ్రొక్కి తనుమి*

*రావద్ద వైరంబు పోవంగ నూహించి*
*మా భూములిమ్మను మనుజపతిని*
*అట్లన్న కురుపతి హర్షించ కుండిన*
*ఏవురికైదూళ్లు నెలమి నడుగు*
*పుడమీశు డామాట కొడబడకుండిన*
*నడవడి దినచర్య నడుపు మనుమి*

గీ॥ *బ్రతికి యుండిన పాండు సంతతిగ ననుమి*
*ఎచ్చటున్నను మమ్ము గుర్తించు మనుమి*
*క్రమము దప్పిన ప్రభు మము గానకున్న*
*కదనరంగానికిపుడే కదలు మనుమి.*

(వ్యవహర్త, మేఘారెడ్డి, పోలెపల్లె)

ఈ పద్యం చెప్పుకొంటున్న జానపదులకు ధర్మసూతి మెత్తని పులియన్న తిక్కనగారి మాట తెలిసే ఉంటుంది. కవిత్రయభారతం జనజీవితంలోకి వచ్చింతర్వాత, వాటి ననుసరించి యక్షగానాలు, వీధిభాగవతాలు, బయలాడలు, హరికథలు, బుఱ్ఱకథలు రూపొంది ప్రదర్శనలుగా రూపుదిద్దుకొని జనపదాల్ని భారత మహార్థాల్ని తెలిసికొనేట్టు చేశాయి. భారత నీతిని గ్రహించేటట్టుగా చేశాయి. పాలి పంచాయతీలోని లోగుట్టును తెలిసికొనేట్టు చేశాయి.

### వేదనీతే భారతనీతి

అయితే భారతానికి పంచమవేదమనే పేరున్నది. వేదం శాస్త్రం, అది రాజశాసనం వంటిదని ఆలంకారికుల అభిప్రాయం. వేదంలోని నీతులెన్నో భారతంలో ఉన్నాయి. అందుకే ఆదికవి నన్నయభట్టు వ్యాసులవారిని వివిధ వేదతత్త్వవేది అన్నారు.

* *ఓమ్ క్రతో స్మర* (యజో: 0–40–15)
  – కర్మ చేసే జీవుడా! నీవు ఓం కారాన్ని స్మరించు.

* *ఏకం సద్ విప్రా బహుధావదన్తి* (ఋక్ : 1–164–46)
  – ఒకే పరమాత్మను, విద్వాంసులు ఎన్నో పేర్లతో పిలుస్తారు.

* సనోరా స్వసువీర్యమ్ (అథః 20-108-3)
  – ఓ శక్తి ప్రదాతా! మాకు వీరత్వాన్ని ప్రసాదించు.

* మానో మర్తా అభిద్రుహాన్ (ఋక్ : 1-5-10)
  – మానవులు ఒకరినొకరు ద్వేషించకుందురుగాక!

* బృహస్పతే చయస ఇత్పియారుమ్ (ఋక్ : 1-160-5)
  – ఓ దేవా! నీవు హింసచేసినవానిని తప్పక శిక్షింతువుగాక!

* స్వస్తినో అభయంచనః (అథః 11-2-31)
  – మాకు సుఖంతోపాటు నిర్భయత్వం కలుగచెయ్!

* అభయం వచో అపావధీః (సామ: 353)
  –కఠోరంగా కటువుగా మాట్లాడవద్దు.

* మధుమతీం వాచముదేయమ్ (అథః 16-2-2)
  –నేను తీయగా సరళంగా పలుకుదునుగాక!

* శ్రద్ధయా విన్దతేవసు (ఋక్ : 10-151-4)
  –శ్రద్ధవల్ల సంపదలు కలుగుతాయి

* సఖా సఖిభ్యోవరీయః కృణోతు (అథః 7-51-1)
  –మిత్రుడు మిత్రుని క్షేమాన్ని కోరుకోవాలి.

* అహమనృతాత్ సత్యముపైమి (యజు:0-1-5)
  –నేను అనృతాన్ని విసర్జించి సత్యాన్నే పలుకుతాను.

నాలుగు వేదాలలో ఈ విధంగా కనిపించే సూక్తులన్నీ నీతి బోధకాలే. అనంతాలై వేదాః అని ఉండగా వాటిని నాలుగు వేదాలుగా విభజించి అందించిన వేదవ్యాసుల వారికి వేదం నీతిశాస్త్రమని తెలుసు. అందులో శాస్త్రనియమాన్ని ఎలా చెప్పారో వాటిని సూక్తులుగా, భారతకథలో సందర్భానుగుణంగా వారు పొందుపరిచారు. తెలుగు భారతంలో కవిత్రయం వారు వాటిని యథాతథంగా అనుసృజనాత్మకంగా పొందుపరిచారు. అందుకే భారతాన్ని నీతిశాస్త్రమన్నారు ఆదికవి నన్నయభట్టు.

సత్యప్రాధాన్యాన్ని ప్రవచించిన వేదార్థాల్ని గ్రహించి శకుంతలోపాఖ్యానంలో శకుంతల పాత్రచేత, దుష్యంతునికేకాక సభాసదులకందరికి ప్రవచింపజేసిన ఘట్టమే ఇందుకుదాహరణ.

చం॥ *నుతజల పూరితంబులగు నూతులు నూరిటి కంటె సూనృత*
*వ్రత మొకబావి మేలు, మఱి బావులు నూరిటికంటె నొక్క స*
*త్క్రతువదిమేలు, తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలు,త*
*త్సుత శతకంబకంటె నొక సూనృత వాక్యము మేలుసూడగన్,*
(–ఆది,4–94ప.)

సత్యవ్రత నిష్ఠ ఉన్న ఓరాజా! మంచి నీటితో నిండిన చేదుడు బావులు నూరింటి కంటె ఒక దిగుడుబావి మేలు, ఆ దిగుడుబావులు నూరింటి కంటె ఒక మంచి యజ్ఞం మేలు, అలాంటి నూరు యజ్ఞాల కంటె ఒక పుత్రుడు మేలు. అట్టి పుత్రులు నూరుమంది కంటె ఒక సత్యవాక్యం మంచిది.

ఈ పద్యంలోని మంచి మాటలన్నీ నీతులే. వేదంలోని నీతులు మహాభారత కథా కథనం ద్వారా ఆ కథల్లోని పాత్రల ద్వారా, సన్నివేశాల ద్వారా మహాభారత గ్రంథకర్తలైన మహాకవులు లోకానికందించారు. వివిధ వేదాతత్త్వ వేదియైన వేదవ్యాసులవారు వేదనీతినే మహాభారత నీతి శాస్త్రంగా అందించారు. కవిత్రయం వారు ఆ మార్గాన్నే అనుసరించారు.

**ఇంతకూ నీతిశాస్త్రమంటే యేమిటి?**

సూర్యరాయాంధ్ర నిఘంటువు 'నీతి' పదానికిచ్చిన అర్థాలూ, ఆకరాలూ ఇవి.

"కొనిపోవుట, ప్రాపణము, పొందించుట, పాడి, న్యాయము, ఉపాయము, రాజాదులు ప్రవర్తించవలసిన రీతిని తెలుపు శుక్రచాణక్య విదురాదులచే రచింపబడిన శాస్త్రము, రాజనీతి. అశ్వాదులను గూర్చి తెలుపు శాస్త్రము,

"......రథహయ నీతి యెఱుంగుదురె ధారుణీవలయమునన్, భార, అర,
2–171.

సత్ప్రవర్తనము, ధర్మానుకూలముగ నడచుట, విధము, రీతి (ఈ యర్థము తెలుగుననే కలదు).

" భరతు, నీతి సుహోత్రుని భాతి భార్గవు బలె రాము పోలిక భగీరథుని పోలుపు.

గీ. *ధాత్రిc బాలించు నవిభుండు దద్విభుండు. హంస, 1. 42.*

*...షోడశమహా దానంబులన్‌జేయ లేదే*
*నీతిన్ జమదగ్నిరాముడు సముం డిద్ధప్రసిద్ధోన్నమ*
*ద్దానక్షాత్ర గుణంబులం బురవరాంతఃక్షత్రియ శ్రేణికిన్.* (కవిత. 1.10)

కం॥ *ఈ నీతి సమాకర్ష*
*స్థానము లేర్పాటు గాగ దైవాసుర సం*
*తానంబు లైకమత్యము,*
*గానామృతాబ్ధిన్ మథింపc గడగిరి కడిమిన్* (దశా. 7.193)

భారతాది గ్రంథాలలోని ఈ నీతిపదాల ప్రయోగం న్యాయం, సత్ప్రవర్తనం, నియమం అనే అర్థాల్లోనే సందర్భానుగుణంగా సంధింపబడ్డాయి. శబ్దరత్నాకరం ఈ అర్థాలనే ఇచ్చింది.

ఇక శాస్త్ర పదానికి నియమన గ్రంథమని, ఇవి ఆరని, తర్క – వ్యాకరణ– ధర్మ– మీమాంస–వైద్య– జ్యోతిష శాస్త్రాలని వివరణ ఇచ్చింది (శబ్దరత్నాకరం).

శాస్త్ర మంటే ఆజ్ఞ అనీ, లేదా విహిత వాక్యమనీ, వేదమనీ, నియమనగ్రంథమని, వేదాంత – తర్క – అలంకార శాస్త్రము మొదలైనవని సూర్యరాయాంధ్ర నిఘంటువు. వివరణ ఇచ్చింది.

మొత్తంమీద నీతి– శాస్త్ర పదాలకున్న అర్థాలు వ్యక్తినీ, కుటుంబాన్నీ , సమాజాన్నీ, జాతినీ, పరిపాలననూ సరియైన మార్గంలో నడిచేందుకున్న నియమాలనీ తేలిన విషయం. ఈ నియమాలను విద్వత్పరిషత్తు ఆమోదిస్తుంది. పాలకులు అమలు చేస్తారు.

అయితే మహాభారతాది విశ్వజనీన గ్రంథాలలో నీతిశాస్త్ర అంశాలు అడుగడుగునా కనిపిస్తాయి. అంతర్గతంగా ఆత్మలా నీతి ప్రవహిస్తూనే ఉంటుంది.

అది తెలుసుకోవడం ప్రస్తుతకాలానికి అన్వయించుకోవడం, దేశకాల పరిస్థితులను బట్టి సవరించుకోవడం అధ్యయనశీలుర ధర్మం.

ఇక నీతిశాస్త్రమనగానే గుర్తుకు వచ్చేది భర్తృహరి నీతి వైరాగ్య శృంగార త్రిశతి. ఇందులో నీతిశతకం (దాదాపు వందశ్లోకాలు) ఎందరో అనువాదం చేశారు. మూడు కూడా అనువాదం చేశారు.

నీతిశతకంలో మూర్ఖపద్ధతి, విద్వత్పద్ధతి, మానశౌర్యపద్ధతి, అర్థపద్ధతి, దుర్జనపద్ధతి, సుజనపద్ధతి, పరోపకారపద్ధతి, ధైర్యపద్ధతి, దైవపద్ధతి, కర్మపద్ధతి మొదలైనవి ఉన్నాయి.

ఇవన్నీ అనుభవపూర్వకంగా చెప్పినవి. సమాజ శ్రేయస్సు వాంఛించి చెప్పినవి. ఏనుగు లక్ష్మణకవి, పొ. పల్లివెంకటకృష్ణయ్య తదితరులెందరో అనువాదం – అనుసృజనం చేశారు. నీతి ఇలా ఉంటుందని తెలియడానికి రెండు పద్యాలు చూద్దాం!

*ఆపదల ధైర్య, మభ్యుదయానసోర్మి,*
*సభల వాక్పటిమ, అనిలోన శౌర్యపటిమ,*
*సద్యశః కాంక్ష, వ్యసనంబు విద్యలందు,*
*ప్రకృతి సిద్ధముల్మహనీయులకు ఇవెల్ల.* (భర్తృహరి నీతి, 52ప.)

విపది ధైర్యమ్ అనే శ్లోకానికి యథాతథానువాదం. ఆపదలు వచ్చినప్పుడు ధైర్యముండాలి. సంపదలు కలిగినప్పుడు సహనముండాలి. సభల్లో మాట్లాడ్డానికి వాక్శక్తి ఉండాలి. యుద్ధంలో పోరాడే శక్తి ఉండాలి. కీర్తికాంక్ష ఉండాలి. విద్యలు గ్రహించాలనే కాంక్ష ఉండాలి. మహనీయులకివి సహజంగా ఉంటాయి.

ఈ గుణాలు లేదా లక్షణాలు లేకుంటే సాధనవల్ల కల్పించుకోవాలి. ఇవన్నీ జీవితానికి అవసరం. ఇవే నీతి బోధలు.

*చేతి కీవియు, గురుపద పాతము తల*
*కు, ముఖమునకు సత్యంబు, బలము భుజాల*
*కెదకు స్వచ్ఛత, శాస్త్రము లిరుచెవులకు*
*నగలు మహనీయులకు సిరుల్ నాస్తియైన.* (భర్తృహరి నీతి,53 ప.)

సంపదలు లేకున్నా చేతికి దానం, తలకు గురుపాద ప్రణామం, నోట సత్యం, భుజాలకు బలం, హృదయానికి స్వచ్ఛత, చెవులకు శాస్త్రాలు వినే శక్తి ఉత్తములైన వారికుంటాయి. శరీరానికివే భూషణాలు.

ఇలా భర్తృహరి నీతిశతకముంటుంది. ప్రతి శ్లోకం వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేసే నీతిని బోధిస్తుంది. నిజానికి నీతిశతకంలోని సుజనాది పద్ధతులన్నీ మహాభారతానికి అన్వయింపజేసి అధ్యయనం చేయవచ్చు; ఆలోచనలకాస్కార మివ్వవచ్చు. పై రెండు పద్యాలు భారత కృష్ణునికి అన్వయించి ఆలోచించవచ్చు.

## మహాభారతంలో నీతి, నీతిశాస్త్రం

ఇక ఈ నీతిశాస్త్ర అంశాలను ప్రధానకథలో, ఉపాఖ్యానాలలో, చిన్న కథలలో, విదుర - వ్యాస- భీష్మ- యక్ష- ధర్మరాజ- యయాతి - ద్రౌపది -సనత్సుజాత- శ్రీకృష్ణ తదితరుల ప్రవచనాల్లో వినవచ్చు, తెలుసుకోవచ్చు. శ్రీమద్భగవద్గీత, సనత్సుజాతీయ, విష్ణు సహస్రనామ తదితర గ్రంథ గణాంశాలలో అనేక నీతులను తెలుసుకోవచ్చు. అంతేగాక వ్యక్తిగతంగా, పరివారపరంగా, సామాజిక పరంగా, రాజనీతి విషయికంగా, ప్రకృతి జీవజంతు పర్యావరణపరంగా అధ్యయనం - అనుశీలనం చేయవచ్చు.

## ప్రధాన కథలో నీతిశాస్త్రం

భారత పౌరాణిక పరిపాలకులలో సూర్యవంశం, చంద్రవంశం, యదువంశం ప్రధానమైనవి. మహాభారత కథలో కౌరవ పాండవులది భరతవంశం అని కూడా ఉంది.

వరమున బుట్టితిన్, భరతవంశము జొచ్చితి, అందు పాండుభూవరునకు కోడలైతి...అన్న ద్రౌపది మాటనే ఇందుకు ప్రమాణం. నానారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు... (ఆది, 25) అన్న ఆదికవి ధర్మ వేదాంతాలతో నీతిశాస్త్రాన్ని చెబుతున్నారు. అందుకే తెలుగుభారతం నీతిశాస్త్రానికి నిలయమైంది. అంతేగాక అమితాఖ్యానక శాఖలతో ... వేదార్థామలచ్ఛాయయై, నానా గుణకీర్థనార్థ ఫలమై... (ఆది.. 1-66) ఒప్పుతుందన్నారు. దుర్నీతులకు అనిమిత్తాగమంబులయిన భయాలు కలుగుతాయి (ఆది1 -85) అన్నారు.

కౌరవ పాండవుల పూర్వ వృత్తాంతము, యయాతి పూరుల చరిత్ర, శకుంతలా దుష్యంతుల కథ, గంగాశంతనుల వృత్తాంతము, మత్స్యగంధి కథ, భీష్ముని వృత్తాంతము, చిత్రాంగద విచిత్రవీర్యుల వృత్తాంతము, ధృతరాష్ట్రపాండురాజ విదురుల జననం, వీరి వివాహాలు, కౌరవ పాండవుల ఆవిర్భావం, వారి ఎదుగుదల, వారి విద్యాభ్యాసం, ద్రోణాచార్యుని ఆగమనం, కుమారాస్త్రవిద్యా ప్రదర్శనం, దుర్యోధనుడు కర్ణుణ్ణి అంగరాజుగా ప్రకటించడం, తండ్రితో దురాలోచన చేసి పాండవులను వారణావతానికి పంపడం, అక్కడ రాత్రివేళ కుంతీసహిత పాండుపుత్రులు చనిపోవాలని లాక్షాగృహ దహనం చేయించడం, ప్రధానకథలో భాగంగా వచ్చిన విదురుని ఉపదేశం, తల్లి అడగడం ధర్మరాజు చెప్పడం ప్రధాన కథలో భాగమే... ఇంతవరకున్న కథలో అనేక సందర్భాలలో రాగద్వేషాల ఆలోచనలనీ, రాజ్యాధికార దాహంవల్ల నీతికి గోతులు తీయడమే ప్రధానంగా కనిపిస్తుంది. విదురుడు విషాగ్నుల విషయంలో జాగ్రత్తగా ఉండాలని చెప్పాడు.

కు॥ *ధనదానములను ప్రియ భో*
*జన దానములను విశిష్ట సద్విజతతులం*
*దనుపుచునుండగ తత్పుర*
*మున షణ్మాసములు భరతముఖ్యుల కరిగెన్.* (ఆది. 6ఆ, 159 ప)

ఇది ప్రధాన కథలో భాగంగానే కనిపిస్తుంది. కాని వారణావతంలో కుంతి, పుత్రులతో ఉన్న ఆరు నెలలలో అవసరమున్న వారిని గుర్తించి ధనదానం చేశారు, భోజనాలు పెట్టారు.

ఇది పాలకుల నీతిలో భాగమే. తామెవరో ప్రజలకు తెలుసు, అక్కడి విప్రులకు తెలుసు. తమ కెవరూ అండగా లేరు. ఆపదలో ఎవరాదుకుంటారో తెలియదు. అందుకే దానం చేయడమనే నీతిని పాటించారు.

లాక్షా గృహం నుండి బయటపడ్డ తర్వాత, అరణ్యంలో హిడింబా భీముల వివాహం జరగడం, ఏకచక్రపురంతో బక రాక్షసుని దుర్మార్గం అంతం కావాలని ఆలోచించి భీముణ్ణి కుంతి నియోగించి, పరదుఃఖ నివారణం పుణ్యం అని ధర్మరాజుతో అంటుంది.

ఉత్తమ క్షత్రియుడు కష్టాల్లో ఉన్న బ్రాహ్మణ వైశ్య శూద్రులను రక్షించాలి. అందువల్ల పుణ్యలోకాలు పొందుతాడు. (ఆది -6ఆ, 286ప.)

రాజమాత కుంతి బోధలో కనిపించేది క్షత్రియ ధర్మమే. రక్షించడం రాజనీతిలో భాగమే. అందుకే భీముడు వెళ్ళడానికి  ధర్మరాజు అంగీకరిస్తాడు. ఆ విధంగా బకాసుర వధ జరుగుతుంది.

ఆ తర్వాత పాండవులు ద్రుపదపురానికి మారువేషాల్లో వెళ్ళడం, ద్రౌపదీ స్వయంవరంలో పాల్గొనడం, వివాహ సందర్భంగా ఏర్పడ్డ సమస్యను  ద్రౌపది పూర్వ జన్మవృత్తాంతం చెప్పి వేదవ్యాసుల వారు అందరినీ ఒప్పించడం, ఈ సందర్భంగా అనేక ఉపాఖ్యానాలూ ప్రస్తావించారు.

పాండవులు బ్రతికి ఉన్నారని తెలిసి దుర్యోధనుడు ఏవేవో ఆలోచనలు చేస్తుండడం, తండ్రిని ఒప్పించడానికి ప్రయత్నాలు చేయడం గ్రహించిన భీష్మద్రోణులు దుర్యోధనునికి నీతిబోధలు చేస్తారు. పాండవులకు అర్ధరాజ్యం ఇవ్వాల్సిందే! అపకీర్తి రాకూడదంటే ఇది చేయాల్సిందే (భార, ఆది, 8ఆ, 30వ).

ఆ. *కీర్తిలేని వానికిని జీవనంబు ని*
*ర్రర్థకంబు చూవె యవని మీద*
*నిత్యమైన ధనము నిర్మల కీర్తియు*
*యట్టి కీర్తివడయుట శ్రమంబె*   (ఆది-8ఆ,  31 ప)

పాండవులు హస్తినకు వస్తారు, ఇంద్రప్రస్థపుర నిర్మాణం జరుగుతుంది. అర్జునుడు తీర్థయాత్రకు వెళతాడు. యాత్ర చివరలో సుభద్రా కళ్యాణం జరుగుతుంది. ఖాండవవన దహనం కథ; అర్జునునికి ఇంద్రుడు దివ్యాస్త్రాలిస్తాడు.

ఇంద్రప్రస్థంలో మయుడు నిర్మించిన సభ పాండవులకీర్తి ప్రతిష్ఠలు పెంచుతుంది. ధర్మరాజు దగ్గరకి నారదుడు వస్తాడు. స్వర్గంలోని పాండురాజు దీవెనలందించడానికి ముందు రాజనీతి విషయాలడుగుతాడు. రాజెలా ఉండాలో ఎలాంటి పురోహితుణ్ణి నియమించుకోవాలో తానే చెబుతాడు. యాజ్ఞికుడు సమబుద్ధితో తన పనులు చేసేవాడై ఉండాలి అంటాడు. మహావీరులు సేనాధ్యక్షులుగా

ఉండాలంటాడు. ధనాశలేనివారిని మంత్రులుగా నియమించుకోవాలంటాడు. పెద్దలను సేవించాలంటాడు. ఉత్తమ మధ్యమాధములుగా గుర్తించి ఉద్యోగులకు కొరతలేకుండా జీతాలియ్యాలంటాడు.

ఉ॥ *ఉత్తమ మధ్యమాధమ నియోగ్యత బుద్ధి నెఱింగి వారి న*
*య్యుత్తమ మధ్యమాధమ నియోగములన్ నియమించితె నరేం*
*ద్రోత్తమ భృత్యకోటికి సమానముగ దగు జీవితంబులా*
*యత్తము చేసి యిత్తె దయనయ్యయి కాలము దప్పకుండగన్.*

(సభా. 1ఆ. 37ప)

ప్రశ్నించిన అన్ని అంశాలు రాజనీతికి సంబంధించినవే. ప్రభువు వార్తను నిర్వహించి పరిపాలన కొనసాగించాలి అన్న నారదుని బోధ నేటికీ తెలుగు పత్రికా ప్రపంచంలో ప్రచలితమై ఉంది.

ఆ॥ *వార్తయందు జగము వర్తిల్లు చున్నది*
*యదియులేనినాడు యఖిల జనులు*
*నంధకారమగ్ను లగుదురు గావున*
*వార్త నిర్వహింపవలయు పతికి.* (సభా : 1ఆ, 51ప)

– ప్రపంచమంతా వార్తమీదే నడుస్తున్నది. అది లేకుంటే ప్రజలంతా పెనుచీకట్లో మునిగినట్లే. అందువల్ల ప్రభువు వార్తను బాగా నడపాలి.

నారదుని ప్రశ్నలన్నీ ఉపదేశాలే. అవన్నీ జరుగుతున్నవే. ఇవన్నీ సార్వకాలీన సత్యాలైన నీతిబోధలే. అనేక విషయాలు చెప్పి, ఇంద్ర – యమ –వరుణ – కుబేర– బ్రహ్మ సభలను వర్ణించి, రాజసూయయాగం చేయడానికి ప్రేరేపిస్తాడు.

శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థానికి వస్తాడు. ధర్మరాజు రాజసూయయాగం గురించి ప్రస్తావిస్తాడు. శ్రీకృష్ణుడు ఆమోదిస్తాడు. రాజసూయయాగంలో శ్రీకృష్ణణ్ణి పూజిస్తారు. భీష్మాదులు వస్తారు. దుర్యోధనుడు వచ్చి భంగపాటు పడతాడు. శిశుపాలుడు భీష్ముణ్ణి, శ్రీకృష్ణణ్ణి నిందిస్తాడు. శ్రీకృష్ణుని చక్రానికి శిశుపాలుడు బలి అవుతాడు.

పాండవుల వైభవానికి అసూయపడ్డ దుర్యోధనుడు దురాలోచనలోపడతాడు. శకునితో జరిగిన ఈ ఆలోచన అన్యాయం – అక్రమం– అనైతికం. పాండవుల వైభవలక్ష్మిని ఎలాగైనా అపహరించాలని నిర్ణయిస్తాడు. తండ్రిని ఒప్పిస్తాడు. పాండవులను జూదానికి పిలిపించే ప్రయత్నాలు చేయిస్తాడు.

విదురుడు జూదం మంచిది కాదంటాడు. పుత్రుల మధ్య జూదం వైరాన్ని కలిగిస్తుందని నచ్చ చెప్పే ప్రయత్నం చేస్తాడు. విదురుణ్ణి పంపి ధృతరాష్ట్రుడు కొడుక్కు చేసిన ఈ నీతిబోధ పరిశీలనార్హం.

క॥ *జూదమిదియేల? దీనను*
*భేదము మీలోన బుట్టు బెలుచన; యుష్మ*
*ద్భేదమున జేసి యెగ్గు*
*త్పాదిల్లు ధరిత్రప్రజకు భయజననంబై.*

ఉ॥ *ఇమ్మహి నీవు పాండవులు నెప్పటియట్ల పరస్పరానురా*
*గమ్మున నేలు చున్కి యిది కార్యము, పాండవ లక్ష్మి నీకస*
*హ్యమ్మన నేల? వంచన బరార్థ పరిగ్రహబుద్ధి జేసి పా*
*పమ్మగు; పాపకారులకు బాయు నవశ్యము నర్థ ధర్మముల్*

(–సభా, 2ఆ, 135, 136 ప)

ఇతరుల సంపద పరిగ్రహించాలనే ఆలోచన వల్ల పాపం కలుగుతుందని, పాపాత్ముల సంపద – ధర్మం నశిస్తాయంటాడు ధృతరాష్ట్రుడు. ఇది గొప్ప హిత బోధ. ఒక తండ్రిగా మహారాజుగా చేసిన నీతిబోధ. కాని ధృతరాష్ట్రుణ్ణి తనకనుకూలంగా మార్చుకోగల్గుతాడు.

చివరికి మాయాజూదం, ద్రౌపదికి అవమానం, పాండవుల ప్రతిజ్ఞలు, ఆ సందర్భంలో ధృతరాష్ట్ర, భీష్మ, ద్రోణుల మౌనం, పాండవులు వనవాసానికి వెళ్ళడం చకచకా జరిగిపోతాయి. ఈ కథా ప్రస్థానంలో ఎన్నో కౌటుంబిక, సామాజిక, పాలనా సంబంధి నైతికాంశాలు ప్రాస్తావికంగా సందర్భోచితంగా చోటు చేసుకొన్నాయి.

1. జూదంలో తనను ఫణంగా ఒడ్డడంలోని న్యాయాన్యాయాలకు సంబంధించి ద్రౌపది నిండుసభలో అడిగిన ప్రశ్నలు ఆలోచింపజేస్తాయి.

2. అన్న మాటకు కట్టుబడి పాండవులు వనాలకు వెళ్ళారు; జూదంలో మోసముందని తెలిసి కూడా ఎందుకు వెళ్ళారు?

3. ద్రౌపది విషయంలో సైంధవుని ప్రవర్తన నేర్పిన గుణపాఠాలు పగను పెంచాయి. ఇక్కడ నీతి వచనాలు ఎదురుదెబ్బతీశాయి.

4. ఘోషయాత్ర దుర్యోధనుని దురాలోచన. దుర్యోధనుణ్ణి బంధించి తీసుకొని వెళుతుంటే 'కాగల కార్యం గంధర్వులే తీర్చారు' అన్న భీముణ్ణి మందలించి ధర్మరాజు చేసిన బోధ, భారతీయులందరికి ఉపదేశంగా నిలిచింది. (వయం పంచాధికం శతమ్. మనం నూటా ఐదు మంది అన్నదమ్ములం).

5. అజ్ఞాతవాసంలో ఉండే పద్ధతిపై ఆలోచనలు. సేవా ధర్మానికి సంబంధించిన అనేక విషయాలు పాండవ పురోహితుడు ధౌమ్యుడుపదేశిస్తాడు.

6. అజ్ఞాతవాస కాలంలో కంకుభట్టు అయిన ధర్మరాజు విరాటరాజు సందేహాలను తీరుస్తుంటాడు.

7. ముఖ్యంగా కీచకవధకు పూర్వం ద్రౌపది (సైరంధ్రి) కీచకునికి చేసిన ఉపదేశం నీతిశాస్త్రంలో అంతర్భాగమే.

8. అజ్ఞాతవాస పరిసమాప్త్యనంతరం జరిగిన ధౌమ్య- సంజయ - శ్రీకృష్ణ రాయబారాల్లోని ఉపదేశాలన్నీ నీతిబోధల క్రిందికే వస్తాయి.

9. ఏ రాయబారాలు, ఏ ఉపదేశాలు, ఏ నీతిబోధలు దుర్యోధనుని దురాశముందు, అధికార దాహం ముందు నిలువలేదు. దానికి ఉదాహరణ అతని మనస్తత్వాన్ని ప్రస్ఫుటీకరించిన ఈ పద్యం-

శా॥ *రాధేయుండును దుస్ససేనుడును పోరం బ్రాపుగా పాండవ*
*క్రోధజ్వాలల నార్తు; నొండొకడు నాకుందోడె? నీవింక నన్*
*బాధం బెట్టకు; వాడి సూదిమొన మోవంజాలు నంతైననే*
*నీ ధాత్రీ తలమీను వారలకు; నాకేలింత సేగింబడన్*

(భార, ఉద్యోగ, 2-251)

ధృతరాష్ట్రుడు సంధి చేసుకొమ్మన్నాడు; దుర్యోధనుడు కర్ణుడు దుశ్శాసనుడుండగా నాకు ఇంకెవరి సహాయం అక్కర్లేదన్నాడు. 'వాడి సూదిమొన మోపినప్పుడు' ఆది ఆక్రమించేంత భూమిభాగాన్ని కూడా పాండవులకివ్వనన్నాడు.

ఇంత దురాశ; ఇంత దురాలోచన; దాయాదుల పగ; ఇన్ని అవమానాలు చేసి, 13 సం॥లు వారి నేలకు వారిని దూరం చేసి అప్పటికీ పగదీరక యుద్ధం చేయాలనే నిర్ణయించుకొన్నాడు. పాండవులను అంతం చేయడమే తన ధ్యేయంగా ముమ్ముందు వ్యవహరించాడు.

10. భీష్మ, ద్రోణ, కర్ణాదుల యుద్ధాల తర్వాత కూడా వారూ – వీరు చెప్పిన మంచిమాటలేవీ దుర్యోధనుని చెవికెక్కలేదు.

11. మనస్సు వికలమైన ధృతరాష్ట్రుడు మధ్య మధ్య విదురుని ఉపదేశాలు, సనత్సుజాతుని సత్యవచనాలు విన్న తర్వాత కలిగిన వేదన వైరాగ్యాదులు కూడా దుర్యోధనుని సంగ్రామాన్ని నిరోధించలేకపోయాయి.

12. యుద్ధంలో శల్యుని తర్వాత అశ్వత్థామ బాధ్యత స్వీకరించడం కృపాచార్యులకిష్టం లేదు. అందుకే ఆయన అశ్వత్థామతో దుర్యోధనుని అవివేకత్వాన్ని, దురాశనూ, భయాన్ని ప్రస్తావిస్తూ నీతిపథంలో నడవాలి అంటాడు. 'నీతి' ప్రస్తావన ఉన్న రెండు పద్యాలు చూద్దాం.

క॥ *ధర్మము దప్పక నయగతి*
*కర్మాచరణంబు నడపగా ఫలసిద్ధిన్*
*నిర్మల యశమగు; దప్పిన*
*పేర్మి సెడదె నిందరాన భేద్యోత్సాహ!* (సౌప్తిక; 1ఆ, 34ప.)

ఉ॥ *నీతి దొఱంగి కార్యముల నెట్టన యాగ్రహవృత్తి జేసినం*
*బ్రీతిగ సిద్ధి పొందినను భీతియు కుత్సయు బుట్టు; భూజను*
*ల్వేతురు, చేటు చేతలు ఫలింపక తక్కిన; మున్న వచ్చున*
*త్యాతురతాస్పదంబులగు నాపద; లిద్ధవివేక వైభవా!*

(సౌప్తిక, 1ఆ, 35ప)

నయగతి (నీతితో) కర్మాచరణముండాలి అని మొదటి పద్యంలో (34), అనాలోచితంగా నీతిని వదలి కార్యాలు చేస్తే తప్పు అని రెండో పద్యంలో (35) ఉంది. కృతవర్మముందే కృపాచార్యులవారు అశ్వత్థామతో చెబుతూ, దుర్యోధనుడు వివేకవిదూరుడని, క్రోధలోభాలు దురభిమానం ఉన్నవాడని, హితుల మాట వినక సజ్జనులైన (నీతిమంతులైన) పాండవులను పరాభవించాడని, సన్మార్గంలో నడవని వానికి నాశనం తప్పదని అనేక విధాలుగా చెబుతాడు.

13. అయినా అశ్వత్థామ వినడు; నిద్రిస్తున్న ద్రౌపదీపుత్రులను సంహరిస్తాడు. పరాభవింపబడి ప్రాణభిక్ష పొందుతాడు.

14. స్త్రీ పర్వంలో ధృతరాష్ట్రునికి విదురుని ఉపదేశాలు, వేదవ్యాసులవారు గాంధారీ ధృతరాష్ట్రులకు చేసిన బోధలు, తన పుత్రుల మరణానికి గాంధారి దుఃఖించడం, శ్రీకృష్ణునికి శాపమివ్వడం, కర్ణుడు తన కొడుకని కుంతీమాత ధర్మరాజుకు చెప్పడం... ఈ అన్ని సందర్భాలలో అనేక నీతి బోధలు మహాభారతాన్ని నీతిశాస్త్రంగా భావించేట్లు చేశాయి.

15. ఇక్కడి నుండి అంటే సౌప్తిక పర్వం చివరి నుండి ఆరు ఆశ్వాసాల శాంతి పర్వంలో నారదుడు, దేవస్థానుడు, వ్యాసుడు, శ్రీకృష్ణుడు, అశ్మకుడు, పట్టాభిషిక్త ధర్మరాజు, భీష్ముడు (దండనీతి), బృహస్పతి, వాయుదేవుడు, కుబేరుడు, ముచుకుందుడు, కణికుడు, విశ్వామిత్రుడు, మేధావి, భృగువు, కౌశికుడు, ఉతథ్యుడు, అంబరీషుడు, కలకవృషీయుడు, వసుహోముడు, బ్రహ్మదత్తుడు, పంచశిఖుడు, ప్రహ్లాదుడు, బలి, నముచి, దేవలుడు, జాజిలి, తులాధారుడు, కపిలుడు, జనకుడు, మాండవ్యుడు, హారీతుడు, అరిష్టనేమి, పరాశరుడు, వసిష్ఠుడు, యాజ్ఞవల్క్యుడు, సులభ, శుకుడు, విష్ణువు, వైశంపాయనుడు ... ఈవిధంగా ఎందరి ఉపదేశాలో ఈ శాంతి పర్వంలో ఉన్నాయి.

ఎప్పుడెప్పుడో ఎవరెవరో ఆయా సందర్భాలలో చెప్పిన కథనాలు – ఉపదేశాలు భీష్మలవారి ద్వారా, వ్యాసుల వారి ద్వారా చెప్పించడం శాంతిపర్వంలోని ప్రత్యేకత.

అంతేగాక వ్యాసభగవానులు, శ్రీకృష్ణపరమాత్మ, భీష్మ పితామహుల ఈ నీతిబోధలే మహాభారతాన్ని నీతిశాస్త్రంగా నిలబెట్టాయి.

16. ఇక అనుశాసనిక పర్వమంతా నీతిబోధలూ, ఉపదేశాలూ, చిన్నకథలూ ఉన్నాయి. శాంతిపర్వంలోని ఉపదేశాలలాంటివే ఉంటాయి. దాదాపుగా ఇవన్నీ భీష్ముడే చెప్పాడు. పరమేశ్వరుడు పార్వతికి చెప్పిన, పార్వతి పరమేశ్వరునికి చెప్పిన ధర్మాలన్నీ ఇందులోనే ఉన్నాయి. భీష్ముని అగ్ని సంస్కారంతో ఈ పర్వం సమాప్తమవుతుంది. అన్నిటా శ్రీకృష్ణుని నేపథ్యముంటుంది. ఈ పర్వంలోని ఏ అంశాన్ని స్పృశించియైనా భారతం నీతిశాస్త్రమే అని నిరూపించే అవకాశముంది.

17. ఇక అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వాది, ప్రధాన కథలో సందర్భానుగుణంగా అనేక నీతిబోధలు, ఉపదేశాలు దండిగా కనిపిస్తాయి. వేదవ్యాసులవారు, శ్రీకృష్ణుడు, జనకుడు, తదితరులెందరో బోధలు చేస్తారు. మౌసల పర్వంలో యాదవ వంశం అంతం కావడం, రామకృష్ణుల నిర్యాణముంటుంది. మహాప్రస్థానిక పర్వంలో ధర్మరాజు తప్ప మిగతావారు మహాప్రస్థానం చేస్తారు. శునకరూపంలో వచ్చిన ధర్ముడు ధర్మరాజుకు ప్రత్యక్షమవుతాడు. కథా కథనంలో అనేక నీతివచనాలు ఈ పర్వంలోనూ వస్తాయి.

18. ఇక చివరిదైన స్వర్గారోహణపర్వంలో ధర్మరాజు ప్రప్రథమంగా నరకాన్ని దర్శిస్తాడు. నారదుడు, ఇంద్రుడు యముడు ధర్మరాజుతో మాటాడుతారు. ఇవన్నీ మంచిమాటలే (నీతిసూక్తులే). ధర్మరాజు ఆకాశగంగలో స్నానం చేసిన అనంతరం దివ్యత్వాన్ని పొందుతాడు. తన వారు కూడా దివ్యత్వాన్ని పొందడం ధర్మజుడు చూస్తాడు.

**ఫలశ్రుతి**

తెలుగు మహాభారతం చివర ఫలశ్రుతి పది పద్యాలలో ఉంటుంది. అందులోని ఒకటి రెండు పద్యాలు చూద్దాం!

క॥ *అలఘుమతులార! పర్వం*
*బుల నీ యితిహాస రత్నమును వినిన నఘం*
*బులు వాయు; నాకలోకము*
*కలుగును; సిద్ధించు ముక్తి కాంక్షితమైనన్* (స్వర్గా:85 ప.)

క॥ *ఆద్యంతంబులు నీయన*
*వద్య కథవినంగ గనిన వారికి బాయున్*
*సద్యంబ బ్రహ్మహత్యా*
*వద్యము మొదలైన పాపవర్గంబెల్లన్.* (స్వర్గా: 86 ప.)

ఉ॥ *వ్యాసమునీంద్ర సారకరుణాతిశయంబున భారతార్థము*
*ద్భాసితమైనయట్టి నుతభాగ్యునకున్ సకలాగమార్థ పం*
*వాసన మావహిల్లు; జనపంక్తులు కీర్తనసేయు; శశ్వదు*
*ల్లాస సుఖానుభూతి నచల స్థితి నొప్పు నతండుదాత్తుడై*
(స్వర్గా: 92 ప)

సమస్త పురాణపారీణులైన సూతమహర్షి, శౌనకాది భూసురవరులకు ఈ మహాభారతాన్ని చెప్పారు; వీరు శ్రవణం చేశారు.

ఇది ఇతిహాసమన్నారు కవిబ్రహ్మ తిక్కన. పాపాలుపోతాయి; బంధ విముక్తి కలుగుతుంది అని ఫలశ్రుతి సంగ్రహార్థం. పరమపదప్రాప్తి కలుగుతుందని చివరి ఫలశ్రుతిలో ఉంటుంది. పరమపదం మోక్షమే. ఇన్ని ఉపదేశాలు, ఇన్ని నీతి బోధలు ప్రధాన కథను (కౌరవపాండవుల కథ) అనుసంధించుకొని వచ్చాయి. ధార్మిక – వేదాంత – ఐతిహాసిక – పౌరాణిక – కావ్యప్రబంధ నీతులన్నీ నిక్షిప్తం చేసుకొన్న మహాభారతం నిజంగా నీతిశ్రాస్తమే.

**ఉపసంహారం**

భారతనీతితో ప్రారంభం చేసి, నీతి లక్షణాలను చెప్పుకొని, భర్తృహరి బోధించిన నీతి పద్ధతులను నామమాత్రంగా ప్రస్తావించుకొని మహాభారత ప్రధాన కథలో

సందర్భానుగుణంగా వచ్చిన కొన్ని నీతుల గురించే తెలుసుకోగలిగాం. కాని ఇంకా ఎన్నో చెప్పుకోవాల్సిన అంశాలున్నాయి.

<u>ఉపాఖ్యానాలు</u> : ఉదంకోపాఖ్యానం, గారుడోపాఖ్యానం, శకుంతలోపాఖ్యానం, యయాతి చరిత్ర వంటి ఎన్నో ఉపాఖ్యానాలున్నాయి. యయాతి చరిత్రలో పూరునికి చెప్పిన  నీతుల వంటివి సహస్రాధికంగా ఈ ఉపాఖ్యానాల్లో కనిపిస్తాయి.

క॥ *ఎఱుక గల వారి చరితలు*
*గఱచుచు, సజ్జనుల గోష్ఠి కదలక ధర్మం*
*బెఱుగుచు నెఱిగిన దానిని*
*మఱవకనుష్ఠించునది సమంజసబుద్ధిన్*
(భార, ఆది, 3ఆ, 203 ప)

క॥ *మనమునకు ప్రియంబును హిత*
*మును, పథ్యము తథ్యమును నమోఘము మధురం*
*బును పరిమితమనునగు పలు*
*కొనరగ పలుకునది ధర్మయుతముగ సభలన్*
(భార, ఆది, 3ఆ, 205 ప)

ఈ విధంగా వేలకొలది నీతులీ ఉపాఖ్యానాల్లో ఉన్నాయి. ఉపాఖ్యానాలలోని ఈ నీతులవల్లనే మహాభారతం మహా నీతిశాస్త్రమయింది.

## చిన్నకథలు

తెలుగు మహాభారతంలో భీష్మాదులు నీతిబోధలు చేసే సందర్భంలో ఎన్నో నీతికథలు వచ్చాయి. అయితే సంస్కృత భారతంలోని కథలన్నీ కవిత్రయం స్వీకరించలేదు. భారతంలో చిన్నకథల పేరిట ప్రత్యేకంగా పుస్తకాలు వచ్చాయి.

మూడు చేపల కథ, గృధ్రజంబుకోపాఖ్యానం, నక్షత్రప్రస్థుని కథ,  గోవ్యాఘ్ర సంవాద కథ ఇలా ఎన్ని కథలో నీతినందిస్తాయి.

ఇందువల్ల కూడా మహాభారతం నీతిశాస్త్రంగా పరిగణింపబడింది.  మూడు చేపలకథలో దీర్ఘదర్శిగా ఉండాలని నీతికాగా, గృధ్ర జంబుకోపాఖ్యానంలో ఎవరి

ఆకలివారిదే మరొకరిని పట్టించుకొననివారూ లోకంలో ఉంటారనే నీతి అవుతుంది. ఈ కథల్లోని నీతి భారతాన్ని నీతిశాస్త్రంగా నిలిపింది.

### మహాత్ముల నీతిబోధలు

విదురుడు, భీష్ముడు, శ్రీకృష్ణుడు, వ్యాసుడు, ధర్మరాజు తదితరుల నీతిబోధల వల్ల మహాభారతం నీతిశాస్త్రమయింది.

### వివిధ నీతులు

వ్యక్తిగతనీతులు, కుటుంబ నీతులు, సామాజిక నీతులు, రాజనీతి అనబడే పరిపాలనా సంబంధనీతులు మహా భారతంలో ఉన్నాయి. అందువల్ల కూడా భారతం నీతిశాస్త్రమయింది.

### వివిధ పద్ధతులలో నీతులు

భర్తృహరి చెప్పిన నీతి శతకంలోని మూర్ఖ, విద్వత్, మౌన – శౌర్య, అర్థ, దుర్జన, సుజన, పరోపకార, ధైర్య, దైవ, కర్మపద్ధతుల లక్షణాలన్నింటిని అన్వయించి మహాభారతంలోని నీతులన్నీ అధ్యయనం చేసే అవకాశముంది. ఆ విధంగా కూడా మహాభారతం గొప్ప నీతిశాస్త్రమని నిరూపించే అవకాశముంది.

### ఎన్నో శాస్త్రాలు

మహాభారతంలో భగవద్గీతను గీతాశాస్త్రమంటారు; (గీతాశాస్త్ర మిదం పుణ్యమ్); సనత్సుజాతీయం వేదాంత నీతిశాస్త్రం; శ్రీవిష్ణుసహస్రనామం భక్తి నీతిశాస్త్రం.

ఇలా సహస్ర విధాలుగా మహాభారతం మహానీతి శాస్త్రమయింది. అవినీతిలో తేలియాడే వారికి నీతి మార్గాన్ని చూపే భారతం పంచమవేదమయింది. ప్రపంచ మానవులందరికి మార్గదర్శనం మహాద్భుత గ్రంథంగా నిలిచింది.

*( వ్యాసకర్త: విశ్రాంత ఆచార్యులు, సాహితీవేత్తలు, హైదరాబాద్ )*



# మహాభారతము - మహాకావ్యము

పద్మశ్రీ, డా.గరికిపాటి నరసింహారావు
98482 53135

ఆదికవి నన్నయభట్టు మహాభారతంలో ఎవరికి ఏది కావాలంటే అది దొరుకుతుంది అని ప్రత్యేకించి సీస పద్యంలో పేర్కొన్నాడు. అందుకే తెలుగులో **"తింటే గారెలు తినాలి వింటే భారతం వినాలి"** అనే సామెత పుట్టింది. గారెలకి ప్రత్యేకమైన రుచి ఉండదు. ప్రసిద్ధమైన ఆరు రుచులలో ఏ రుచీ గారెలకి సంబంధించింది కాదు. అందుకే గారెలలో ఏదో ఒక పదార్థం నంజుకోకపోతే రుచిగా ఉండవు. తేనెలో నంజుకుంటే తియ్యగా ఉంటాయి. అల్లం పచ్చడిలో నంజుకుంటే కారంగా ఉంటాయి. ఈరకంగా నంజుకునే పదార్థాలను బట్టి గారెల రుచి మారుతుంది. అలాగే చదివే వారి అభిరుచిని బట్టి భారతం రుచి మారుతుంది. అందుకే ఈ సామెత పుట్టింది. **"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని"** అని మొదలయ్యే ఈ పద్యం సుప్రసిద్ధమే. ఆ పద్యంలోనే **"కవివృషభులు మహాకావ్యమనియు"** అంటారని పేర్కొన్నారు. తెలుగుభారతంలో ఉ ండే నవరసభరితమైన కవిత్వాన్ని రుచి చూపించడమే ఈ వ్యాసరచనలో ఉద్దేశ్యం.

నన్నయగారి కవితా లక్షణాలలో అక్షర రమ్యత ప్రధానమైంది. సందర్భానికి తగిన ధ్వనిని వినిపించే అక్షరాలతో పద్యరచన చేయడం నన్నయ భారతంలో చాలా చోట్ల కనబడుతుంది. అయితే పద్యాల్లోనే కాకుండా గద్యంలో కూడా ఆయన ఆ సొగసు ప్రదర్శించడం విశేషం.

ఆదిపర్వంలో శంతనుడు గంగాతీరంలో విహరించే సందర్భం అది. ఎలాగోలా ఆయన్ని ఆకర్షించాలి అని గంగానది తాపత్రయపడిందట. స్త్రీ రూపం ధరించడానికి ముందు నదిగా కెరటాలతో తీరాన్ని ముంచేస్తూ శంతనుని పాదాలు తాకినప్పుడు కూడా ఆ కెరటాలలో సరసమైనవాంఛ వ్యక్తమైంది అని నన్నయ గారు వచనంలో రచించారు.

**"అనిలాలోలకల్లోలమాలాస్ఫాలనసముచ్చలజ్జలకణాసారశిశిరశిశిరంబగుచున్న గంగాపులినతలంబున"** - ఆది -04-141

జలం ప్రవహించేటప్పుడు గలగలగల అనే శబ్దం వస్తుంది. ఈ వచనంలో నన్నయ పన్నెండు లకారాలు ప్రయోగించి జలస్వభావానికి తగిన రచన చేశాడు. అంతేకాదు చివరలో **"శిశిరశిశిరంబగుచున్న"** అనేది విశేషమైన ప్రయోగం. కెరటాలు తీరంవరకు వచ్చి ఇసుక రేణువుల మధ్యలోంచి భూమిలో చేరుతున్నప్పుడు **శిశిశిశిశి** అనిధ్వని వస్తుంది. అందుకే ఆ ప్రయోగం. ఆ చల్లదనానికి శంతనుని ఒళ్ళు ఝల్లుమంది. తరువాత కథ అందరికీ తెలిసిందే. ఆదిపర్వంలోనే సత్యవతీదేవికి వ్యాసుడు చేసే ఉపదేశంలో మూలభారతంలో గొప్ప కవితాత్మకమైన ప్రయోగం ఉంది.

*అతిక్రాంతసుఖాః కాలాః పర్యుపస్థితదారుణాః ।*
*శ్వః శ్వః పాపిష్ఠదివసాః పృథివీ గతయౌవనా ॥* - ఆది - 127-06

సుఖపడే రోజులు పోయాయి. ముందు ముందు దారుణాలు జరగబోతున్నాయి. రేపు, ఎల్లుండి మరింత పాపభూయిష్ఠాలు కాబోతున్నాయి. అన్ని మాటలెందుకు! మొత్తం భూమండలం యౌవనాన్ని కోల్పోయి ముసలిదైపోతోంది. ప్రళయం రాబోతోంది. కాబట్టి ఓ తల్లీ! మునిమనవళ్ళ ముద్దుముచ్చట్లు అంటూ సంసారాన్ని పట్టుకు వేళ్ళాడకుండా వానప్రస్థానానికి వెళ్ళిపోవడం మంచిది- అని వ్యాసుడు సత్యవతీదేవికి ఉపదేశం చేశాడు. ఇందులో భవిష్యత్తు అంధకారమయం కాబోతోందని చెప్పడానికి **"పృథివీ గతయౌవనా"** అని గొప్ప కవితాత్మక ప్రయోగం చేశాడు. ఈ శ్లోకానికి నన్నయగారు స్వేచ్ఛానువాదం చేశారు.

కం. *మతిఁ దలఁపఁగ సంసారం*
*బతిచంచల మెండమావులట్టుల సంప*
*త్ప్రతతు లతిక్షణికంబులు*
*గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్* - ఆది-05-159

సభాపర్వంలో భీముడు జరాసంధుని వధించేటప్పుడు అమాంతంగా పైకెత్తి గిరగిరగిర కుడినుండి ఎడమకి ఎడమనుండి కుడికి తిప్పి కింద పారేశాడట. అప్పుడు నన్నయ గారు రచించిన పద్యంలో విచిత్రంగా గిరగిర తిప్పడం ధ్వనిస్తోంది.

ఉ. *ఆతనిఁ బట్టి యెత్తి నిహతాహితవీరుఁడు వానిముక్కునన్*
*వాతను గర్ణరంధ్రముల వారక శోణితధార లొల్కఁగా*
*వాతసుతుండు వీచె శతవారము లుద్ధతచండవాతసం*
*ఘాతవివర్తమానతృణఖండసముం దగుచుండ మాగధున్*

– సభా–01–209

పై పద్యంలో మూడవ పాదం మొదట్లో **వాత**, మధ్యలో **తవా**,చివర మళ్ళీ **వాత** అనే అక్షర ప్రయోగాలు చూస్తే అటూఇటూ జరాసంధుడి దేహాన్ని తిప్పి పడేసిన విషయం ధ్వనించడంలేదూ? అదీ నన్నయ గారి కవిత్వంలో శబ్దప్రయోగ చాతుర్యం.

అరణ్యపర్వంలో భీమసేనుడు కిమ్మీరుణ్ణి వధించినప్పుడు నన్నయ గారు రచించిన పద్యం హాస్యరసశోభితం!

తే. *బకహిడింబులు హతులైనఁబనివి పనివి*
*యఱచి శోకింపఁగానక యమపురమున*
*కరిగి తక్కట రాక్షస యనుచు దెరువు*
*వాయఁ బావని దత్కళేబరము వైచె* – అరణ్య– 01– 120

అప్పటికే భీముడు బకాసురుణ్ణి, హిడింబాసురుణ్ణి సంహరించాడు. వాళ్ళిద్దరూ కిమ్మీరుడికి సన్నిహిత మిత్రులట. వారికోసం వెతికి వెతికి భూమ్మీద కనబడకపోవడంవల్ల యమపురంలో ఉంటారేమో చూద్దామనే తీవ్ర వాంఛతో కిమ్మీరుడు యమలోకానికి పోయాడట. అంతేకాని భీముడు చేసిందేమీ లేదన్నమాట. అదీ నన్నయగారికవిత్వంలో సున్నిత హాస్యం. అటువంటి నన్నయగారికి పద్యంలోనే నమస్కారం చేద్దాం.

మ. *యతియుంబ్రాసయు నేత్ర యుగ్మముగ సాయంవేళ కెంజాయలో*
*శ్రుతి మార్గమ్ముల శబ్ద మర్థమును సంశోధించుచున్ సాగుచున్*

*ద్యుతిమత్ క్షీరము లార్ద్ర భావములతో దోసిళ్ళలో నింపుచున్*
*గతి సాగించెడి పద్య ధేనువుగతిన్ కన్పించు నన్నయ్యనాన్*

- సాగరఘోష - 03-78

అరణ్యపర్వ శేషాన్ని పూరించిన ఎఱ్ఱాప్రెగడ కూడా తాను రచించిన భాగంలో నవరసభరితమైన కవిత్వాన్ని పండించాడు. కుమారస్వామి ఆవిర్భావ ఘట్టాన్ని వర్ణిస్తూ గ్రహబలాల గురించి చెబుతూ పరమ చమత్కారంగా ఒక మాట అంటాడు. గ్రహాల దుష్ప్రభావాలన్నీ ఏ మనిషిమీద అయినా డెబ్భై ఏళ్ళ వరకే ఉంటాయట. ఆ తరువాత ఉండవట. ఎందుకో చూడండి

కం. *విను డెబ్బది యేండ్లగు దాఁ*
*కను మానవులకు గ్రహోపఘాతంబులు గ*
*ల్గు ననంతరంబ గ్రహముల*
*ముదిమి యెల్ల పనులకుఁ జాలున్* - అరణ్య - 05 - 254

డెబ్భై ఏళ్ళ తరువాత మొత్తం గ్రహాలు చూపించే ప్రతాపమంతా ఒక్క వార్ధక్యం అనే గ్రహమే చూపిస్తుంది కాబట్టి మిగిలినవాటి ప్రభావాలు పనిచేయాల్సిన అవసరంలేదట. అదీ ప్రబంధ పరమేశ్వరుని చమత్కారం.

**"అరచేతిని అడ్డుపెట్టి సూర్యకాంతిని ఆపలేరు"** అనే మాట విప్లవ కవిత్వంలో చాలా ప్రసిద్ధి చెందింది. కానీ ఆ భావం ఎఱ్ఱాప్రెగడ సొంత ఆలోచన. అరణ్యపర్వం ఏడో ఆశ్వాసంలో కుంతి పసిబాలుడైన కర్ణుణ్ణి నదిలో వదిలేస్తూ సూర్యపుత్రునివైన నువ్వు మరుగున పడిపోవడం జరగదు నాయనా అంటుంది. ఇనుఁ డఱచేత మాటువడు టెన్నఁడుఁ గల్గునె? అని ఎఱ్ఱాప్రెగడ పద్యంలో ప్రయోగించాడు. అత్యాధునిక ప్రయోగాలకు సైతం ఆదిబ్రహ్మ అయిన శంభుదాసునికి భక్తిగా నమస్కారం చేద్దాం.

ఉ. *దువ్వినపాపటన్ మిగిలి దుందుడుకొప్పు నటించు వెంద్రుకల్*
*క్రొవ్విరు లట్లుగా దురిమి కుంకుమ రేఖల దీర్చెగా నిజం*
*బవ్వ! అరణ్యపర్వ కవి వారిధి! వారధి యైన వాడు వే*
*రెవ్వరొకో! ప్రబంధ పరమేశ్వరు డొక్కడు దక్క తెల్గునన్*

- సాగరఘోష-03-84

ఆంధ్ర మహాభారతమనే సరస్వతికి నన్నయ తిక్కనలు పాయలు తీసి జడవేసి కేశాలంకారం చేశారు. అయినా పాపట్లో ఉండిపోయిన పిల్ల వెంద్రుకలు గాలికి అల్లల్లాడుతుంటే వాటి మీద అరణ్యపర్వ శేషమనే కుంకుమ రేఖ దిద్ది క్రొత్త పూలతో అలంకరించిన వాడు ఎఱ్ఱాప్రెగడ. స్వయంగా వారిధిలాంటి కవి ఇద్దరి మధ్య వారధి కావడానికి సిద్ధపడ్డాడు. తెలుగువారి ఔదార్యానికి ప్రతీక ఆ ప్రబంధ పరమేశ్వరుడు.

విరాటపర్వంలో ఉత్తరగోగ్రహణ ఘట్టం ప్రధానమైనది, కౌరవుల నెదుర్కోవడానికి మరెవ్వరూ లేక ఉత్తరుడు, అతనికి సారథిగా బృహన్నల యుద్ధానికి బయలుదేరి వస్తారు. వారిని దూరంనుంచి చూసిన భీష్మద్రోణులు 'వచ్చినవాడు ఫల్గుణుడు' అనే నిర్ణయానికి వస్తారు. అది గ్రహించిన దుర్యోధనుడు 'అర్జునుడే అయితే యుద్ధం చేసే అవసరమే లేదు. అతన్ని గుర్తించగలిగితే చాలు. మళ్ళీ 12+1 పథకం అమలు చేసేయవచ్చు' అంటాడు. అదేం కుదరదని చెప్పి భీష్ముడు అధికమాసాలతో సహా చెప్పి దుర్యోధనుని నోరు మూయిస్తాడు. ఓడిపోయినా ఓటమిని అంగీకరించని కురుసార్వభౌముడు 'అర్జునుడు అయితే ఏమిటి? అతనొక్కడు. మనం కొన్ని వేలమందిమి. దెబ్బకి ఊక ఊదినట్లు ఊది అవతల పారేస్తాం' అంటాడు. దానికి సమాధానంగా ద్రోణుడు 'మామూలుగా సరదాగా యుద్ధానికి వచ్చినా అర్జునుని జయించడం కష్టం. ఇప్పుడైతే మరీ కష్టం' అంటూ ఒక విచిత్రమైన ఉపమానంతో పద్యం చెబుతాడు.

మ. *సింగం బాకటితో గుహాంతరమునన్ జేడ్పాటుమైనుండి మా*
*తంగ స్ఫూర్జిత యూధ దర్శన సముద్యత్ క్రోధమై వచ్చు నో*
*జంగాంతార నివాస ఖిన్నమతి నస్మత్సేనపై వీడె వ*
*చ్చెం గుంతీ సుత మధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్*

– విరాట–04–95

'ఒక భయంకరమైన సింహాన్ని మీరు పన్నెండేళ్ళు అరణ్యవాసం నెపంమీద, ఏడాది అజ్ఞాతవాసం పేరుమీద బోనులో పెట్టి బంధించారు. ఆహారం కూడా పెట్టలేదు,

ఇప్పుడది విడుదలై వచ్చింది. ఆ పార్థ సింహానికి ఆహారంగా ఎదురుగా కౌరవ మత్తేభాలు బారులు తీరి ఉన్నాయి. ఈ స్థితిలో అర్జునుణ్ణి గెలవడం అమరేంద్రునికి కూడా సాధ్యం కాదు' అని ద్రోణాచార్యుని అంతరంగం.

సరిగ్గా దీన్ని మన విద్యా వ్యవస్థకు అన్వయించి చూడండి. ఇంగ్లీషు మీడియం పేరు మీద, ఇంటర్మీడియట్ రెసిడెన్షియల్ వంకన మన విద్యార్థుల్ని మనం పన్నెండేళ్ళు (10+2) ఆట, పాటలు లేకుండా ఊపిరాడని ప్రణాళికలతో ఉక్కిరిబిక్కిరి చేసేశాం. అది చాలదన్నట్లు ఎంసెట్ కోచింగ్ పేరుమీద మరో ఏడాది అజ్ఞాతవాసం చేయించాం. (నిజంగానే ఎంసెట్ లాంగ్ టెర్మ్ శిక్షణ తీసుకునే వారికి ఎండ, వాన ఎలా ఉంటాయో తెలియదు. వాళ్ళను బయటకు రానివ్వరుగా!). ఇలా పదమూడేళ్ళు సింహాలను బంధించినట్లు బంధిస్తే వారి ఉత్సాహం, చురుకుదనం, పోటీపడేతత్వం, చిలిపితనం, అల్లరి, దూకుడుతనం ఏమయిపోతాయి? అట్టడుక్కి పోయాయి. పదమూడేళ్ళ తరువాత ఇంజనీరింగ్ కళాశాలలోకి ప్రవేశించేసరికి అడుక్కిపోయిన సరదాలన్నీ అమాంతంగా పైకిలేచి ర్యాగింగ్ రూపంలో **"చిన్నవాళ్ళని బాధపెట్టి ఆనందించే"** పైశాచిక ప్రవృత్తిగా మారుతున్నాయి. ర్యాగింగ్ కి శాశ్వతంగా అడ్డుకట్ట వెయ్యాలంటే పాఠశాల, జూనియర్ కళాశాలల స్థాయిలోనే ఆటలు, పాటలు,నాటకాలు, ఉపన్యాసం, వ్యాసరచన మొదలైన వాటిల్లో పోటీలు పెట్టి గెలిచినా ఓడినా సమానంగా తీసుకోగలిగే క్రీడాస్ఫూర్తిని విద్యార్థుల్లో కలిగించాలి. అలా చేస్తే ర్యాగింగే కాదు ఆత్మహత్యలు కూడా ఆగిపోతాయి. నాటి భారతం నుంచి నేటి జీవితానికి గ్రహించవలసింది అదే. ఇంత గొప్ప సందేశాన్ని ఒక ఘట్టంలో ఒక పద్యం ద్వారా అన్యాపదేశంగా అందించిన తిక్కనగారికి భక్తితో నమస్కారం చేద్దాం.

మ. *వెలయన్ భారత గాథ వ్రాసెను మనో విశ్లేషణారీతి వా*
*గ్విలసన్మోహన పద్య గద్య రచనావిర్భూత మోద ప్రభా*
*నిలయంబుల్ గద తిక్కనార్య కృతులే, నిన్నైన నన్నైన సం*
*చలితుం జేయును యుద్ధఘట్టములు దృశ్యస్ఫూర్తి మంత్రాంగముల్*

– సాగరఘోష–03–83

తిక్కన తన భారతాన్ని పాత్రల మనో విశ్లేషణ చేస్తూ రచించాడు. పద్యమైనా గద్యమైనా ఎంతో మనోహరంగా నడిపిస్తాడు. నాటకీయ రచనా శిల్పంలో ఆయనకు ఆయనే సాటి. ముఖ్యంగా యుద్ధఘట్టాల్లో ఆయన వర్ణనలు కళ్ళకు కట్టినట్లుంటాయి.

సమర్థుడైన వ్యక్తికి సరైన సంస్థలో ఉద్యోగం దొరకకపోతే అతని ప్రతిభ రాణించదు. ఉన్నతమైన సంస్థలో సమర్థులైన ఉద్యోగులు లేకపోతే ఆ సంస్థ కూడా వృద్ధిలోకి రాదు. ఈ విషయంలో సంస్థలు, ఉద్యోగులు కూడా భారతంలోని ఒక పద్యం తెలుసుకొని తీరవలసిందే.

మ. *ధృతరాష్ట్రుండును పుత్రులున్ వనము, కుంతీ నందనుల్ సింహముల్*
*మతి నూహింపగ సింహమైన వనమున్ మర్దింతు రెందున్; వనా*
*వృత వృత్తంబులు కాని సింహములుకన్ వేగంబ చేటొందు; బీ గా*
*న తగంబొందుట కార్యమీయిరువురున్ సంతుష్టిమై యున్కికిన్*

– ఉద్యోగ–01–358

శ్రీకృష్ణుడు సంజయుడితో చెప్పిన మాటలివి. కౌరవులంతా ఒక మహారణ్యం లాంటివారు. పాండవులు సింహాల్లాంటి వారు. సింహాలు లేకపోతే ఎవరు పడితే వారు అడవిలో ప్రవేశించి స్వప్రయోజనాల కోసం చెట్లన్నీ నరికేస్తారు. అలాగే ఎంత సింహాలైనా అరణ్యంలో ఉండకుండా గ్రామాలమీద పడితే ఎలాగోలా తెగించి జనాలే చంపేస్తారు. అందువల్ల అరణ్యానికి సింహాల అవసరం ఎంత ఉందో సింహాలకి అరణ్యాల అవసరం కూడా అంతే ఉంది. అలాగే కౌరవులకి పాండవుల అవసరం ఎంత ఉందో పాండవులకి కౌరవుల అవసరం కూడా అంతే ఉంది. ఇదీ వంశీమోహనుని వాక్చాతుర్యం.

ఈ అవగాహన గొప్ప గొప్ప ఉద్యోగులకి ఉండటం చాలా అవసరం. సమర్థుడైన ఒకాయన పెద్ద సంస్థలో చేరతాడు. ముందు వాళ్ళు పెద్దపీట వేస్తారు. క్రమంగా ప్రక్కన పెట్టేస్తారు. ఆయన సొంతంగా ఎదిగిపోతాడేమోనని వాళ్ళ భయం. అప్పుడే ఆ ఉద్యోగికి వేరే సంస్థలోకి మారాలనిపిస్తుంది. ఎవరో చిన్న చితక సంస్థల వాళ్ళు అతన్ని సంప్రదిస్తారు. రెచ్చగొడతారు. ఆశలు కల్పిస్తారు. అందులోకి

మారిపోదామనిపిస్తుంది. అటువంటప్పుడే కాస్త ఆగి పై పద్యంలో చెప్పినట్లు ఆలోచించాలి. తొందరపడి అక్కడ చేరితే వాళ్ళు కొంతకాలం నెత్తిన పెట్టుకొని వాళ్ల సంస్థ బాగా ఎదిగాక వీళ్ళు చేసినట్లే చేస్తారు. సరిగ్గా అప్పుడే ఇంకో ఆలోచన వస్తుంది. సొంతంగా సంస్థ పెట్టేయాలనిపిస్తుంది. అలా చేస్తే మొత్తం తలనొప్పి తనొక్కడే తలకెత్తుకొన్నట్లు అవుతుంది. అప్పుడు బాధ్యతల భారానికి ప్రతిభ రాణించకపోగా క్రుంగి కృశించిపోతుంది. అందువల్ల ఏ మాత్రం సర్దుకోగలిగినా పాత సంస్థలోనే కొనసాగితే ఏదైనా దెబ్బ తగిలినప్పుడు మళ్ళీ ప్రాధాన్యం పొందే అవకాశం ఉంది.

అలాగే గొప్ప సంస్థల యజమానులు కూడా సమర్థులైన ఉద్యోగుల్ని వదులుకోవడం మంచిది కాదు. అంతటి వాళ్ళు మళ్ళీ దొరకడం కష్టం. కొత్త వాళ్ళకి శిక్షణ యిస్తూ కూర్చుంటే కొత్త సంస్థలు రంగంలోకి వచ్చి అవకాశాలు తన్నుకుపోతాయి. అందుకని సంస్థలు కూడా కాస్త అహాన్ని పక్కకు పెట్టి సమర్థుల్ని కాపాడుకోవాలి. 'బ్రాండ్ నేమ్' అని కొందరు విర్రవీగుతారు. కానీ ఆ 'బ్రాండ్'కి అంత 'నేమ్' బ్యాండుమేళం వల్ల రాలేదనీ, ప్రతిభావంతులైన ఉద్యోగుల వల్లే వచ్చిందనీ గ్రహించడం మంచిది. రూపకాలంకారంలో రచింపబడిన ఈ పద్యం మన సమర్థతకి నిరూపకాలంకారం.

భీష్మపర్వం ప్రారంభంలోనే సంజయుడు చేసిన సాత్యవతేయస్తుతిలో తిక్కనగారి రూపనిర్మాణశిల్పం కవితాతత్త్వం వ్యక్తమవుతాయి.

ఉ. *ప్రాంశుఁ బయోదనీలతనుభాసితు, నుజ్జ్వలదండధారుఁ, బిం*
*గాంశుజటాచ్ఛటాభరణు, నాగమపుంజపదార్థతత్త్వని*
*స్సంశయకారుఁ, గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు, భారతీ*
*వంశవివర్ధనుం, ద్రిదశవందితు, సాత్యవతేయుఁ గొల్చెదన్*
– భీష్మ–01–71

విష్ణువు అంశ కావడంవల్ల వ్యాసుడు కూడా నీలమేఘశ్యాముడే. ఉజ్జ్వలమైన దండం తపశ్శక్తిని నిల్వ చేసుకొనే ధర్మరక్షాకోదండం. రాగిజుట్టు విరాగిత్వానికి సంకేతం. వేదశాస్త్రాలు చదువుతుంటే వచ్చే సందేహాలను మహాభారతం నివారణ చేస్తుంది.

అందుకే వ్యాసుడు **"ఆగమపుంజపదార్థతత్త్వనిస్సంశయకారుడు"**. ఆయన ధరించే నల్లజింకచర్మం మహర్షుల తపశ్శక్తికి భూమి క్రుంగిపోకుండా కాపాడే రక్షాకవచం. ఆయన భారత వంశాన్నే కాదు భారతదేశాన్నే ఉద్ధరించిన మహానుభావుడు. దేవతలే నమస్కరించే ఆ వ్యాసమహర్షిని తిక్కనగారు ఉత్పలమాలతో అర్చించారు.

కర్ణపర్వంలో కర్ణుని అస్తమయం సూర్యాస్తమయ సమయంలోనే జరిగింది. ఆ సందర్భంలో తిక్కన రచించిన పద్యం కరుణరసానికి ప్రతీక. అందులోనే అంత్యక్రియలకు సంబంధించిన ఆచారం కూడా ఉండడం తిక్కనగారి సంప్రదాయాభిజ్ఞతకు దర్పణం.

తే. *నిర్గతప్రాణు రాధేయు నిజకరములఁ*
*గరుణ పెంపున నంటుట కారణముగఁ*
*బావన,స్నానమొనరింపఁ బోవునట్టు*
*లపరజలనిధిలోనికి నరిగె నినుఁడు* – కర్ణ– 03–369

తానస్తమించకుండానే అస్తమించిన కుమారుని మృతదేహాన్ని ముట్టుకున్నాడు కాబట్టి స్నానం చేయడానికి సూర్యుడు పశ్చిమసముద్రంలో మునిగాడట. ప్రత్యక్ష దైవమైన సూర్యుడు కూడా మానవబంధాలకు లోబడడంవల్ల మానవులలాగే మైలస్నానం చేయాల్సి వచ్చింది. అదీ ఇందులో తాత్త్విక రహస్యం.

సౌప్తిక పర్వంలో అశ్వత్థామ అర్ధరాత్రి చూసిన దృశ్యమే అతనిలో పైశాచిక భావాలు రేకెత్తించింది. ఆ సందర్భంలో బీభత్సరస ప్రధానంగా తిక్కనగారు రచించిన పద్యంలో రసాలంకారాలే కాకుండా ఈనాటి సమాజానికి – ముఖ్యంగా బాలబాలికలకి – గొప్ప సందేశం కూడా ఉంది.

ఉ. *కొన్నిటి కంఠముల్ నులుపుఁ గొన్నిటి కాళులు ద్రుంచు నుగ్రతం*
*గొన్నిటి పక్షముల్ నఱకుఁ గొన్నిటి పొట్టలు వ్రచ్చు లీలమైఁ*
*గొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ నుఱుమాడు నిట్టు ల*
*య్యన్నిటి నయ్యులూకము రయం బెసఁగన్ వధియించె భూవరా*
– సౌప్తిక–01–18

ఒక గుడ్లగూబ కాకుల్ని భయంకరంగా చంపిన విధానాన్ని పై పద్యంలో వర్ణించారు. కంఠాల్ని నులిమేసిందట, కాళ్ళు విరగ్గొట్టేసిందట, రెక్కలు నరికేసిందట, పొట్టలు చీల్చేసిందట, ఎముకలు ముక్కలు ముక్కలు చేసేసిందట. ఇంత బీభత్సమైన దృశ్యాన్ని చూడబట్టే అశ్వత్థామ పైశాచిక యుద్ధం చేసి నిద్రిస్తున్నవాళ్ళని కొన్ని వేలమందిని చంపేశాడు. ఇలాంటి దృశ్యాల్ని, ఇంతకంటే భయంకరమైన వాటిని యూ ట్యూబుల్లో , వెబ్ సిరీస్ ల్లో అర్ధరాత్రివరకు చూస్తున్న మన బాలబాలికల భవిష్యత్తు ఎలా ఉంటుందో ఊహించుకోమని తిక్కనగారు హెచ్చరిక చేస్తున్నారు. ఇదే నాటి భారతంలో నేటి జీవితం.

శాంతిపర్వంలో భీష్ముడు ధర్మరాజుకి చేసిన ఉపదేశాలలో బ్రహ్మజ్ఞాన సాధన చాలా ముఖ్యమైంది. అందులో జ్ఞానమార్గానికి కర్మ మార్గానికి ఉండే తేడాని తిక్కనగారు చక్కని ఆలంకారిక శోభతో వర్ణించారు.

ఉ. *గుమ్మడిపువ్వుఁ దేనియయుఁ, గూపము నైందవరేఖకాంతియుం*
*జుమ్మరయంగఁ గర్మఫలశోభనసంపద జున్ను నేఁ బూ*
*ర్ణమ్మగుచంద్రబింబము ననందగు నిర్మలవిద్య, గాఢఫా*
*కమ్ము ఫలోదయం బది యఖండసుఖాత్మపదంబు పుత్రకా*

– శాంతి–05–128

గుమ్మడిపూలు హేమంత ఋతువులో బాగా వికసిస్తాయి. కానీ ఆ పూవుల్లోంచి బయటపడ్డ తేనె బిందువులు విస్తారంగా కురిసే మంచు కారణంగా చెదిరిపల్చనైపోతాయి. నూతిలో ప్రతిబింబించే చంద్రరేఖ కూడా అంతే. కొద్ది సేపు కనిపిస్తుంది. చంద్రుడు పక్కకి జరగగానే ఇంక కనబడదు. కర్మమార్గం కూడా అంతే. మనిషికి తాత్కాలికంగా భోగాలని, వైభవాల్ని అందిస్తుంది. శాశ్వత శాంతిని ఇవ్వలేదు. తేనెపట్టులో తేనె ఎక్కువగా ఉంటుంది. ఎక్కువ కాలమూ ఉంటుంది. ఇంట్లో తెచ్చి పెట్టుకుంటే జీవితాంతం మాధుర్యాన్ని అందిస్తుంది. పూర్ణచంద్రబింబం కూడా అటువంటిదే. పున్నమి నాడే కాదు పక్షం రోజుల పాటు అమితానందాన్ని కలిగిస్తుంది. సరిగ్గా జ్ఞాన మార్గం అటువంటిదే. సత్యం శివం సుందరమైన స్థానాన్ని పొందజేస్తుంది. ఇంత గొప్ప అధ్యాత్మ తత్త్వాన్ని ఉత్పలమాలలో తేనె బిందువుల రూపంలో తిక్కనగారు మనకి అందించారు.

ఆశ్రమవాస పర్వంలో పాండవుల్ని ఆశ్రయించి జీవితం గడుపుతున్న ధృతరాష్ట్రుని స్థితిని తిక్కన గారు వర్ణించిన విధానం ఎంతటి నాయకులకైనా ఒక హెచ్చరికే.

కం. *కరిదశసహస్రబలవి*
*స్ఫురితుఁ డగు విచిత్రవీర్య పుత్త్రుఁ డొక తలో*
*దరి నూఁతగొనియె విధి యె*
*వ్వరి హీనులఁ జేయఁ డకట వక్రుండైనన్*

– ఆశ్రమవాస – 01–40

పదివేల ఏనుగుల బలం కలిగిన ధృతరాష్ట్రుడు కూడా ముసలితనం మీద పడేసరికి కావాలని కళ్ళకి గంతలు కట్టుకొన్నగాంధారి నడిపించకపోతే నడవలేని స్థితిలో ఉన్నాడట. విధి వక్రిస్తే ఎవ్వరి గతయినా అంతే. రథం సమీపిస్తుంటే జెండా ముందు కనిపించినట్టే మరణం వచ్చే ముందు ముసలితనం రూపంలో హెచ్చరిస్తుంది. అప్పుడైనా జాగ్రత్తపడి అధ్యాత్మ జ్ఞానం పొందాలి కాని ఇంకా ఆవకాయ, వెన్నపూస అంటూ రుచుల వ్యామోహంలో పడకూడదు. ఈ సందేశాన్ని చక్కని కవిత్వంలో అందించిన తిక్కనగారికి పదివేల నమస్కారాలు. మహాప్రస్థానిక పర్వంలో ఆదిపర్వానికి సంబంధించిన ఒక ఘట్టంతో అనుబంధం కనిపిస్తుంది. ఆదిపర్వంలో కుక్కకు జరిగిన అవమానంతో కథ మొదలైంది. మహాప్రస్థానిక పర్వంలోకుక్కకి జరిగిన సన్మానంతోనే కథ ముగిసింది. మనం ఎవరిని బాధ పెట్టామో వారిని తిరిగి సంతోషింపజేసేవరకు జీవితంలో శాంతి ఉండదు అని మహాభారత సందేశం.

అసలు వ్యాసమహర్షి రచించిన భారత భాగవతాల కథలు రెండూ చక్ర సంచారం చేశాయనిపిస్తుంది. భారత కథ పరీక్షిత్తు పట్టాభిషేకంతో ముగుస్తుంది. భాగవత కథ పట్టాభిషిక్తుడైన పరీక్షిత్తువేటకు వెళ్ళడంతో మొదలవుతుంది. భాగవత కథ పరీక్షిత్తు మరణానికి సిద్ధపడుతూ జనమేజయునికి పట్టాభిషేకం చేయడంతోముగుస్తుంది. భారత కథ పట్టాభిషిక్తుడైన జనమేజయుడు సర్పయాగం చేయడంతో మొదలవుతుంది. మానవ జీవితంలో జనన మరణ చక్రంలాగే భారత భాగవత కథా చక్రాన్ని కూడా నిర్మాణం చేసిన వేదవ్యాసునికి అంజలి ఘటిద్దాం.

*మ. మునియై, యెవ్వడు యుక్త కర్మధునియై,ముక్తాత్ముడై, జ్ఞానియై,*
*తన దైనందిన జీవితమ్మున మహోతత్త్వంబు దర్శించి, దా*
*నిని నా జాతికి కృష్ణభారత కథా నిర్మాతయై, వ్రాసియి*
*చ్చెనొ! ఆ వ్యాసు దలంతు ముక్తిపథ నిశ్రేణిన్ పదంబూనగన్*

– 11-12-2022.

*(వ్యాసకర్త: మహా సహస్రావధాని, ప్రవచన కిరీటి, హైదరాబాద్)*



అందం కంటిని ఆకట్టుకుంటుంది. సౌశీల్యం హృదయాన్ని దోచుకుంటుంది.



ధనం పోతే తిరిగి సంపాదించుకోవచ్చు. ఆరోగ్యం చెడితే మందులు సేవించి ఆరోగ్యాన్ని కాపాడుకోవచ్చు. కాని వ్యక్తి తన శీలగుణ సంపదని కోల్పోతే సమస్తమూ కోల్పోయిన వాడవుతాడు.



నిరాడంబరమైన జీవనం, ఉన్నతమైన, ఉత్తమమైన, ఆదర్శవంతమైన ఆలోచనలు గల వ్యక్తులను మాత్రమే సమాజం గౌరవిస్తుంది.



మనసులో ఉండే మంచి భావాలు మాటలుగా, మాటలు చేతలుగా, చేతలు అలవాట్లుగా క్రమేపీ మారడం వల్ల మానవునికి శీలం పెరిగి మేలు కలుగుతుంది.

# మహాభారతము –
# బహుపురాణ సముచ్చయము

డా॥ నందివాడ అనంతలక్ష్మి
99491 98141

అధ్యయన సౌలభ్యం కోసం వేదాలను వ్యాసీకరించిన కృష్ణద్వైపాయనుడు వేదార్థ బృంహణాత్మకంగా పదునెనిమిది పురాణాలని, పదునెనిమిది ఉపపురాణాలని, మహాపురాణాన్ని రచించాడు. వేదం రాజు వలె శాసిస్తే, పురాణాలు మిత్రుడి లాగా మనసుకి హత్తుకునే విధంగా చెవుతాయి. ఆధికారికంగా చెపితేవినాలని అనిపించదు. అప్పటి వరకు చేద్దామనుకుని కూడా ఎవరో నాపై పెత్తనం చేయట మేమిటి? అనిపిస్తుంది సగటు మనిషికి. "సత్యం వద"అని శాసించిన దాని కన్న హరిశ్చంద్రుడి జీవితం గురించి చెపితే హృదయానికి హత్తుకుంటుంది. చెప్పిన నియమాన్ని అనుసరించటం వల్ల కలిగిన ప్రయోజనం ఉదాహరణ పూర్వకంగా నిరూపించ బడింది కదా!

పురాణాలు వేదోపబృంహణాలు. పురాణం అంటే ఎంత పాతదో అంత కొత్తగా అంటే సమకాలికంగా సమన్వయమౌతుందని అర్థం – "పురాపినవం". వేదం ప్రతిపాదించిన ధర్మాన్ని నిండుగా ఉండేట్టు పూరిస్తుందని కూడా పురాణ శబ్దానికి అర్థం చెప్పారు పెద్దలు. ఒక ధర్మాన్ని లేక భావాన్నీ ఆకర్షణీయంగా చెప్పటానికి ఒక ఇతివృత్తంతో పరిపుష్టం చేసి నిండుదనం తీసుకు రావటం జరుగుతుంది. పురాణాలలో ఉన్న ఇతివృత్తాలన్నీ వేదార్థాన్ని ప్రతిపాదించి, నిరూపించే పురాగాథలు. కల్పితాలు కావు. జరిగిన వాటినే చెప్పటం జరిగింది. ఎప్పుడో జరిగినవి అని చెప్పిన దాని కన్న జరుగుతున్న విషయాన్ని ప్రస్తావిస్తే నమ్మకం కలుగుతుంది.

కనుక సమకాలిక చరిత్రని గ్రంథస్థం చేశాడు వ్యాసభగవానుడు. అందులో అసత్యానికి తావు లేదు. తాను కూడా అందులో భాగస్వామి. తన గ్రంథంలో

కనిపించే వ్యక్తుల గురించి అక్కడి వారందరికీ తెలుసు. కనుక జరిగిన దానిని జరిగినట్టు మాత్రమే చెప్పక తప్పదు. చరిత్రని యథాతథంగా చెపుతూనే ధర్మాన్ని బోధించాడు. నిజానికి శాశ్వత ధర్మాన్ని ప్రతిపాదిస్తూ ధర్మానికి జయం కలుగుతుందని నిశ్చయంగా చెప్పటానికే ఆ గ్రంథానికి 'జయం' అని నామకరణం చేశాడు. అష్టాదశపురాణాలు, రామాయణం, పంచమవేదము కార్ష్ణము అయిన మహాభారతం, శాశ్వతాలైన విష్ణుధర్మాలు, శివధర్మాలు పండితుల చేత జయం అనే నామంతో వ్యవహరింపబడతాయి అని భవిష్యపురాణోక్తి.

*అష్టాదశపురాణాని,రామస్య చరితం తథా*
*కార్ష్ణం వేదం పంచమం చ యన్మహాభారతం విదుః*
*తథైవ విష్ణుధర్మాశ్చశివధర్మాశ్చ శాశ్వతాః*
*జయేతి నామ తేషాం చ ప్రవదంతి మనీషిణః*

కాని, జయ నామం భారతానికి రూఢమైనట్టు అనిపిస్తుంది. జయ శబ్ద వాచ్యమైన అన్నిటి సమ్మేళనంగా భారతం ఉండటమే దానికి కారణం అయి ఉండవచ్చు. లేదా ఏకదేశమైన అష్టాదశపురాణ సముచ్చయం అవటం కూడా కారణం కావచ్చు.

అష్టాదశ పురాణ సారం శ్లోకార్థేన ప్రవక్ష్యామి
పరోపకారాయ పుణ్యం, పాపాయ పరపీడనం

ఈ పురాణ సారం అడుగడుగునా ప్రతి అక్షరంలోనూ ద్యోతకమవుతూ ఉంటుంది భారతంలో. దానిని నొక్కి వక్కాణించటానికా అన్నట్టు పురాగాథలను సందర్భానుసారంగా చెప్పటం జరిగింది. ఇవన్నీ ఇంతకు ముందు మన వ్యాసుడి చేత కూర్చబడిన పురాణాలలో ఉట్టంకించ బడినవే. పురాణానికి నిర్వచనమే అది కదా! అవే పురాణ లక్షణాలుగా పేర్కొన బడ్డాయి.

పురాణానికి ఐదు లక్షణాలు ఉంటాయి.

"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంతరాణిచ
వంశాను చరితంచైవ పురాణం పంచ లక్షణం"

ఈ ఐదు లక్షణాలు ప్రతి పురాణంలో ఉంటాయి. పురాణ సముచ్చయమైన భారతంలో కూడా ఉన్నాయి. ఆ రాజకుటుంబాలచరిత్ర వర్ణించటమే కాక ఆ యా సందర్భాలలో ప్రపంచ సృష్టి, స్థితి, లయాదులు మన్వంతరాలు కూడా ఎంతో విస్తృతంగా వర్ణించబడ్డాయి.వంశానుచరితం అన్న దానికి ప్రాధాన్యం ఇస్తూ సాగింది భారత రచన. పురాణాలలో అది ఒక అంశం మాత్రమే. చంద్రకురువంశచరిత్రని జనమేజయుడి కాలం వరకు వివరంగా చెప్పటం ఉంది. ఆ యా రాజుల చరిత్రని చెపుతూ "యతోధర్మఃస్తతోజయః" అని నొక్కి వక్కాణించటం జరిగింది.

ఒక్కొక్క పురాణంలో ఒక తత్త్వానికి ప్రాధాన్యం ఇస్తూ దానిని నిరూపించటానికి తత్సంబంధమైన పురావృత్తాలని ఒక క్రమంలో పేర్చి అందించాడు కృష్ణద్వైపాయన మహర్షి. తత్త్వాలని అనుసరించి ఆ పురాణాలు సాత్త్విక, రాజసిక, తామసిక–అని మూడు విధాలు. సాత్త్వికపురాణాలని చెప్పబడేవి విష్ణుపారమ్యాన్నిప్రతిపాదించేవి. రాజసిక పురాణాలు శక్తి అంటే జగన్మాత అన్నిటికీ మూలము అని ప్రతిపాదించేవి. శివపరమైన గాథలతో శివుడే పరతత్త్వం అని ప్రతిపాదించేవి తామసికపురాణాలు. ఇది స్థూలమైన విభజన మాత్రమే. వీటి నన్నిటిని రచించినది వ్యాసుడే. మరి ఈ భేదాలు ఏమిటి? ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్క తత్త్వానికి ప్రాధాన్యం ఉంటుంది. వాస్తవానికి అన్ని ఒకటే అనితెలియ చేయటానికి అన్ని పురాణాల సముచ్చయంగా ఉ ండే విధంగా తన సమకాలిక చరిత్రని గ్రంథస్థం చేస్తూ అన్ని పురాణాలలోనూ శాశ్వత ధర్మాన్ని ప్రతిపాదించే అంశాలనన్నిటిని క్రోడీకరించాడు. వాటిని అందుకున్న వైశంపాయనుడి నుండి సూతుడు గ్రహించి శౌనకాదిమహామునులకు వినిపించాడు. నైమిశారణ్యంలో మునులు సూతుణ్ణి

*ఏయది హృదయ మపూర్వం*
*బే యది యెద్దాని వినిన నెఱుక సమగ్రం*
*బై యుండు నఘ నిబర్హణ*
*మే యది యక్కథయు వినగ నిష్టము మాకున్*

అని అడిగారు. అంటే ఏ ఒక్కటి వింటే సమగ్రమైన జ్ఞానం కలుగుతుందో?

అని అర్థం. వేద, శాస్త్ర, పురాణ విషయాలు పుష్కలంగా ఉన్నవైతేనే సమగ్రమైన జ్ఞానాన్ని అందించగలవు. సత్యాన్ని వేదం చెపుతుంది, శాస్త్రం నిర్ధారించి నిరూపిస్తుంది. పురాణం సోదాహరణంగా వివరిస్తుంది. మునుల పరిప్రశ్నకి సమాధానంగా సూతుడు భారతాన్ని వారికి చెప్పాడు.

కొన్ని ఇతివృత్తాలు అన్ని పురాణాలలోనూ, కొన్ని కొన్ని పురాణాలలోనూ దర్శనమిస్తాయి. ఉదాహరణకి రామకథ మొదలైనవి అన్ని పురాణాల్లోనూ ఉన్నాయి. అన్ని పురాణాలు చదవ వలసిన పని లేకుండా ప్రధానమైన గాథలు చాలా వరకు జయకావ్యంలో నిబంధించాడు భావితరాల మీద అపారమైన ప్రేమ ఉన్న వ్యాసభగవానుడు. మొత్తం మీద అన్ని పురాణాలలో ఉన్న అవసరమైన పురాగాథలు చాల వరకు భారతంలో ఉన్నాయి.

ఆదిపర్వంలో జనమేజయుడికి అతడి వంశంలోని ప్రముఖులైన పూర్వుల వృత్తాంతాలను చెపుతాడు వైశంపాయనుడు. వాటిలో కొన్ని ఎన్నో పురాణాలలో దర్శనమిస్తాయి. ఉదాహరణకి పురూరవుడి వృత్తాంతం. అరణ్యపర్వంలో ధర్మజుడి ప్రశ్నలకి సమాధానంగా మార్కండేయాది మునులు చెప్పిన పురాగాథలు అన్నీ పురాణాలు చదివిన భావనని కలిగిస్తాయి. శాంతిపర్వం అంతా కథలకు నిలయం. ఏ పురాణం లోనూ కనపడని గాథలు కూడా భారతంలో వీనులవిందు చేస్తాయి. మిగిలిన పర్వాలలోనూ సందర్భానుసారంగా పురాణగాథలు ఉన్నాయి. వాటి అన్నిటి ప్రయోజనం ఒకటే – అష్టాదశపురాణ సారాన్ని మళ్ళీ, మళ్ళీ ప్రతిపాదించి హృదయాలలో గాఢంగా నాటుకునేట్టుచేయటం. అందుకే భారతసంహితలో లేనిది భారతదేశంలో కనపడదు, భారతదేశంలో కనపడే ప్రతిదీ భారతేతిహాసంలో కనపడుతుంది అని ప్రతిన కదా!

*ధర్మే చార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ*
*యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్*

ఈ పురుషార్థాలని సాధించే క్రమాన్ని కూడా ప్రారంభంలోనే ఎంతో సున్నితంగా సూచించారు వ్యాసులవారు. అది నన్నయ భట్టారకులు చెప్పినట్టు "లోనారసిచూసి" నప్పుడే బాగా అర్థం అవుతుంది.

*మన్వాది భారతం కేచి దాస్తీకాది తథా పరే*
*తథోపరిచరాద్యన్యే విప్రాస్సమధి గచ్ఛతి*

భారతం మనుచరిత్రతో ప్రారంభం అవుతుందని కొందరు, ఆస్తీక చరిత్రతో మొదలు అని మరి కొందరు, ఉపరిచర వసువు వృత్తాంతంతో నని ఇంకొందరు విప్రులు అంటారు. దేనితో మొదలు? 'అస్తి' అంటే ఉన్నది. అంటే ఈ లోకంలోనే ఉన్నది. అనగా కంటికి కనపడే – అర్థకామాలు. కొంచెం పరిణతి వచ్చిన తరువాత ఉండే మననశీల స్థితి మనువు చూసిన దానిని మననం చేసుకునే స్థితికి ప్రతీక మనువు. దానిని అధిగమించి చూడవలసిన భూమిక 'ఉపరిచర'. అన్నిటి కన్న పైన ఉన్న స్థాయిలో చరించేది అని అర్థం. దీనిని మోక్షంగా చెప్పవచ్చు. మొదటిది భౌతికం, రెండవది మానసికం, మూడవది ఆధ్యాత్మికం. భౌతికం అర్థకామాలకు పరిమితం. మానసికంలో ధర్మం స్థాయికి ఎదగటం ఉంటుంది. ఆధ్యాత్మికం అన్నిటికీ పై స్థాయిది అయిన మోక్షాన్ని ఇస్తుంది. లౌకిక జీవితం ధార్మిక జీవనానికి, అది మోక్షసిద్ధికి దారి తీయాలన్న ఆదర్శాన్ని బోధిస్తుంది సమస్త ఆర్షవాఙ్మయం. లౌకిక జీవితానికి ప్రతీక అయిన ఆస్తీకుడు నరత్వాన్ని, ధార్మిక జీవనానికి ప్రతీక అయిన మనువు నరోత్తమత్వాన్ని, ఆధ్యాత్మిక జీవనానికి ప్రతీక అయిన ఉపరిచరుడు నారాయణత్వాన్ని సూచిస్తారు. ఇది తాత్త్విక కోణం. ఈ విషయాన్ని అంతకు ముందు జరిగిన ఇతివృత్తాల ఆధారంగా నిరూపించి నిర్ధారించటమే పురాణాల ప్రయోజనం. ఈ సూత్రం ఆధారంగా సాగిన మహాభారతం అన్ని పురాణాల సారసంగ్రహం అనటంలో ఎటువంటి విప్రతిపత్తి లేదు.

అన్ని పురాణాలలోను ఉన్న పురాగాథలు చాలవరకు భారతేతిహాసంలో దర్శన మిస్తాయి. ఎన్నో ఆఖ్యానాలు, పురాణాంతర్గతమైనవి ఎక్కువ మార్పులు లేకుండా భారతంలో కనిపిస్తాయి. యయాతి చరిత్రము, సావిత్ర్యుపాఖ్యానం మొదలైనవి పురాణాలలోనూ, భారతంలోనూ ఒకే విధంగా కనపడతాయి. మత్స్యపురాణంలోను, భారతంలోనూ ఎన్నో ఉపాఖ్యానాలు సరిసమానంగా ఉన్నాయి. పైగా ఇతివృత్తం మాత్రమే కాదు భాషావిషయికంగా కూడా పోలిక కనపడుతుంది. చెప్పినది ఒకరే కదా!దీర్ఘతముడి వృత్తాంతం మొదలైనవి దానికి ఉదాహరణంగా చెప్ప వచ్చు. మరి

కొన్ని వృత్తాంతాలు కూడా భారత మార్కండేయ పురాణాలలో యథాతథంగా కనిపిస్తాయి. మార్కండేయ పురాణ ప్రశస్తి భారతంలో ఉంది.

మహాభారతంలో కొన్ని ఘట్టాలు వాయుపురాణంలోని కొన్ని ఘట్టాలు ఒకే విధంగా కనపడతాయి. ఉదాహరణకి భీష్మపర్వంలోని భూగోళ వర్ణన వాయుపురాణం లోని భూగోళ వర్ణన వంటివి ఒకే తీరులో ఉంటాయి.

ఇక స్కాందపురాణం సంగతి చెప్పనక్కరలేదు. స్కందుడి చరిత్ర, సూర్యాష్టోత్తర శతనామాలు, సుకన్యాచ్యవనుల వృత్తాంతం మొదలయినవి స్కాందపురాణంలోనూ, మహాభారతంలోనూ సమాంతరంగా ఉంటాయి. సుకన్యా చ్యవనుల వృత్తాంతం భాగవతంలో కూడా కనపడుతుంది. రామకథ దరిదాపుల్లో అన్ని పురాణాలలో సంక్షిప్తంగానో, కొద్ది వివరంగానో కనపడుతుంది. వాల్మీకి రామాయణంలో లేని కొన్ని విశేషాలు వీటిలో చోటు చేసుకున్నాయి. మన్వంతర భేదం కారణం అయి ఉండవచ్చు అని విమర్శకుల వివరణ. తాను చెప్పదలచుకున్న దానికి అవసరం లేదని వాల్మీకి వదలి ఉండ వచ్చు. మూలకథకి విఘాతం కలిగించనివి పురాణ కథలలో చేరి ఉండవచ్చు. విష్ణుపురాణంలోని కథలు ఎన్నో మహాభారతంలో కానవస్తాయి. సంస్కృతంలో అయితే శ్లోకాలు యథాతథంగా ఉంటాయి. తెలుగు భారతం అనువాదమే కనుక భావం మాత్రమే గ్రహించ బడింది. పద్మపురాణాంతర్గతమైన ఎన్నో చరిత్రలు, తీర్థవృత్తాంతాలు, మాహాత్మ్యాలు, వింధ్యపర్వత గర్వహరణము, ఋష్యశృంగ అణిమాండవ్యులచరిత్ర, మొదలైన ఇతివృత్తాలు భారతంలోను కానవస్తాయి.

పురాణాలు సంవాదాత్మకంగా ఉంటాయి. తఱచుగా శౌనకాది మహామునుల కోరిక మేరకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుడైన సూతుడు ప్రవచిస్తూ ఉంటాడు. మధ్య మధ్యలో శౌనకాదులు ప్రశ్నిస్తూ ఉంటారు. దానితో కథనం కొనసాగుతూ ఉంటుంది. రామాయణేతిహాసం కథాకథనాత్మకంగా ఉంటుంది. శ్రోతల ప్రమేయం ఉండదు. ఇతిహాసమే అయినా భారతం సంవాదాత్మకంగానే ఉంది. జనమేజయుడికి వైశంపాయనుడు చెప్పినట్టుగా దానిని విన్న సూతుడు శౌనకాదులకు చెప్పినట్టుగా ఉంటుంది. మధ్యలో శ్రోతలు సందేహాలను వెలిబుచ్చటం, కథకుడు వాటిని తీర్చటం, శ్రోతలు కోరిన అంశాలను వివరించటం, లేదా తత్సంబంధమైన

కథ నొక దానిని చెప్పటం ఉంది. కనుక భారతం ఒక చరిత్రగ్రంథమో, ఒక మహాకావ్యమో మాత్రమే కాదు కథన రీతిని బట్టి ఒక పురాణంగా కూడా పరిగణించ వచ్చు. ఒక పురాణం అన్నదాని కన్న పురాణ సముచ్చయం అనటం సమంజసంగా ఉంటుంది. ఈ కారణంగానే "బహుపురాణ సముచ్చయ" మని పేర్కొనటం జరిగింది.

కావ్యం ఏకనాయకం అయి ఉంటుంది. వస్త్వైక్యం ఉంటుంది. భారతంకూడా మొదటి నుండి చివరి వరకు కురుపాండవ గాథగానే సాగింది. వస్త్వైక్యం కుంటుపడకుండా ముఖ్యమైన పురాణగాథలన్నీ పొందుపరచటానికి తగిన చక్కని ప్రణాళికారచన ఉంది భారతంలో. ఒక్కొక్క కథ చెప్పటానికి వీలుగా ఒక సందర్భం కల్పించటం జరిగింది. ప్రారంభంలో జనమేజయుడు తన పూర్వుల వృత్తాంతాలు తెలుసుకోవాలని ప్రశ్నించటంతో పౌష్యమహారాజు ఉదంకుల వృత్తాంతం, శకుంతలాదుష్యంతుల కథ, తపతీసంవరణుల కథ, దేవవ్రతుడు భీష్ముడుగా పేరు పొందటానికి గల కారణాన్ని పేర్కొంటూ గంగా శాపం, వసువుల దుందుడుకు చర్యలు మొదలైనవి చెప్పటానికి అవకాశం ఏర్పడింది. ద్రౌపదీస్వయంవరం తరువాత ఐదుగురికి భార్య అవటం ఎట్లా కుదురుతుంది? అనే ధర్మసందేహానికి సమాధానంగా నాలాయని గురించి, ఐదుగురు ఇంద్రులు మొదలైన విషయాలు చెప్పటానికి సందర్భం కుదిరింది.

గరుత్మంతుడి పుట్టుక, మాతృదాస్య విమోచనం, ఆ సందర్భంగా గజకచ్ఛపాల వృత్తాంతం, వాలఖిల్యుల విశేషాలు కౌరవవంశచరిత్రకి సంబంధించినవి కావు. అసూయ వల్ల కలిగే నష్టం, సంతానం తల్లితండ్రుల కష్టాలను పోగొట్టాలనే ధర్మాన్ని ప్రతిపాదించ టానికి చెప్పబడింది.

ఎక్కువగా ధర్మరాజు ధర్మసూక్ష్మాలు తెలుసుకోవాలని అరణ్యవాస సమయంలో తన పర్ణశాలకి వచ్చిన మహర్షులను అడిగినప్పుడు, అంపశయ్య మీద ఉన్న భీష్మపితామహుణ్ణి దర్శించుకోటానికి వెళ్ళినప్పుడు చెప్పినవి ఉన్నాయి. తన వలె తప్పు చేయకుండానే కష్టాలు పడినవారెవరైన ఉన్నారా? అని ధర్మరాజు అరణ్యవాస సమయంలో తన పరిస్థితి మీద తానే జాలిపడుతూ అడిగినప్పుడు నలదమయంతుల చరిత్ర చెప్పటం జరిగింది. సైంధవుడు ద్రౌపదితో అనుచితంగా ప్రవర్తించిన

సందర్భంలో పరితపిస్తున్న ధర్మజుడికి నీ బాధ రాముడి బాధ కన్న ఎక్కువా? అని మార్కండేయ మహర్షి రామకథని చెప్పాడు. పాతివ్రత్య మాహాత్మ్యాన్ని నిరూపించే పతివ్రత ఇతివృత్తంలో అంతర్భాగంగా ధర్మవ్యాధుడి కథని, అతడి పూర్వజన్మ వృత్తాంతాన్ని చెపుతూ ధర్మస్వరూపాన్ని గురించి ఎంతో చర్చ చేయటం జరిగింది. వ్యాసుడి లక్ష్యం నెరవేరినట్టే కదా!

అగస్త్య మహర్షి గురించి చెపుతూ వాతాపి, ఇల్వలుల వృత్తాంతం పేర్కొనటం జరిగింది. ఈ కథ రామాయణంలో కూడా ఉంది. అంటే త్రేతాయుగానికి ముందు వృత్తాంతమే కదా! ఆంజనేయుడు భీముడికి సముద్ర లంఘనం నాటి తన రూపం చూపించాడు. అంటే అప్పటి చరిత్రని చెప్పినట్టే! మాంధాత, శిబి చక్రవర్తి,అష్టావక్రుడు, ఇంద్రద్యుమ్నులచరిత్రలు, కువలయాశ్వచరిత్ర, కుమారసంభవం, వైవస్వత మనువు చరిత్ర కూడా భారతంలో ఉన్నాయి.

దురహంకారం కీడు చేస్తుందని కృష్ణరాయబారం తరువాత దుర్యోధనుడికి దంభోద్భవుడివృత్తాంతాన్ని జమదగ్ని మహర్షి, గరుత్మంతుడి గర్వభంగ ఇతివృత్తాన్ని కణ్వుడు, గాలవుడి కథ నారద మహర్షి చెపుతారు. ఇంద్ర వృత్రాసురసంగ్రామం, నహుషుడి కథ మద్రదేశాధిపతి, నకుల సహదేవుల మేనమామ అయిన శల్యుడు ధర్మరాజుకి చెపుతాడు కష్టాలు కలకాలం ఉండవు అని ఓదార్చుతూ.

సువర్ణష్ఠీవి కథ, వ్యాఘ్ర గోమాయుసంవాదం, ఒంటె సోమరితనం, శునకం నీచబుద్ధి, కాపవ్యోపాఖ్యానం, గృధ్రజంబుకోపాఖ్యానం, మార్జాలమూషికసంవాదం, నాడీజంఘుడు, మంకి, అజగర చరిత్రలు మొదలైన ఎన్నో నీతిప్రబోధకమైన కథలకు కాణాచి శాంతిపర్వం. ఈ జంతువులు, పక్షులు మానవుల మనస్తత్వానికి ప్రతీకలుగా చెప్పవచ్చు. అంతే కాదు. ఇవన్నీ పశుపక్ష్యాదులతో మానవులు దగ్గరగా ఉన్నప్పటి సంగతులు. అప్పుడు అవి కూడా మానవుల వలె ప్రవర్తించిన ఘట్టాలు తెలుసు కదా! ఈ కథల మధ్యనే అద్భుతమైన ధార్మిక విషయాల చర్చ కూలంకషంగా నిర్వర్తించటం వ్యాసుల రచనాప్రణాళికలో ఉన్న ఘనత.

ఒక్క భారత గ్రంథాన్ని పూర్తిగా చదివితే భారత ప్రశస్తిలో నన్నయ భట్టారకుడు చెప్పిన అన్ని అంశాలు అంటే ధర్మం, ఆధ్యాత్మిక పరిజ్ఞానం, న్యాయం,చరిత్ర

తెలియటంతో పాటు కావ్యం చదివితే కలిగే కావ్యానందం లభిస్తాయి. కొసమెరుపుగా అన్ని పురాణాల సారము అవగతమౌతుంది. అంటే పాప పుణ్యాలు, వాటి ఫలితాలు తెలుస్తాయి. సామాన్యులకి నిత్యజీవితంలో చేసే ప్రతి పని పాపమా? పుణ్యమా? అని తెలియ వలసిన అవసరం ఉంది కదా! పాప పుణ్యాల గురించి నిర్వచనంగా కన్న ఉదాహరణ పూర్వకంగా, ఆచరణయోగ్యంగా తెలియ చేస్తాయి పురాణాలు. అన్నిటినీ సమగ్రంగా తెలుపుతుంది మహాభారతం.

ఒక వెయ్యి సంవత్సరాలుగా సనాతన ధర్మానికి ఊపిరులు పోస్తూ, నిలబెట్టిన గ్రంథం తెలుగు మహాభారతం. ప్రారంభించిన నన్నయ భట్టు, కొనసాగించి నిలబెట్టిన తిక్కనామాత్యుల వారు, పూరించి స్థిరీకరించిన ఎఱ్ఱాప్రెగడ ప్రాతః స్మరణీయులు. తెలుగు జాతి, సనాతన ధర్మానుయాయులు వారికి సదా కృతజ్ఞులై ఉండాలి.

"యతోధర్మః స్తతోజయః"

*( వ్యాసకర్త్రి : విశ్రాంత ప్రధానాచార్యులు, ప్రవచనకారిణి, హైదరాబాద్ )*



# మహాభారతము - సర్వలక్ష్య సంగ్రహము

*గురుసహస్రావధాని*
డా. కడిమిళ్ళ వరప్రసాద్
92478 79608

ఆదికవి నన్నయ్య తెలుగు మహాభారతానికి శ్రీకారం చుడుతూ సంస్కృతమహాభారతం ఎవరికి ఎలా కనబడేలా వ్యాస మహర్షి నిర్మించాడో తెలుగుభారతాన్ని కూడ అలానే నిర్మించాలని అనుకొన్నాడు. వ్యాసభారతాన్ని జ్ఞాననేత్రంతో దర్శించాడు నన్నయ. అది ఏడు రూపాలుగా దర్శనమిచ్చింది ఆ మహాకవికి.

కొంతసేపు తాను ధర్మతత్త్వజ్ఞుడయ్యాడు. అంతే భారతం ఆయనకు ధర్మశాస్త్రంలా కనిపించింది. ఒకమారు ఆధ్యాత్మికదృష్టితో పరిశీలించాడు. అపుడది ఒక వేదాంతగ్రంథంలా కనిపించింది. నీతివిచక్షణుడుగా గమనిస్తే భారతం నీతిశాస్త్రంలా కనిపించింది. నిజానికి నేను కవిని గదా అనుకొన్నపుడు మహాకావ్యంలా కనిపించింది. తానొక లాక్షణికుడు అనుకొన్నపుడు సర్వలక్ష్య సంగ్రహంలా దర్శన మిచ్చింది. ఐతిహాసిక దృష్టితో గమనించినపుడు ఇతిహాసంలాగ అనిపించింది. పరమ పౌరాణికునిగా నన్నయమహాకవి పరకాయప్రవేశం చేసినపుడు మహాభారతం బహు పురాణ సముచ్చయంగా భాసించింది. ఇలా ఏడు పాయల గోదావరి నదిలా కనిపించింది భారతం, గోదావరి ఒడ్డున ఘంటం పట్టి, భారత రచనకు శ్రీకారం చుట్టినపుడు.

ఈ ఏడింటిలో ఐదవ లక్షణం లాక్షణికులకు సర్వలక్ష్య సంగ్రహంగా సాక్షాత్కరించడం. అదేమిటో కొంత పరిశీలిద్దాం. లక్షణము అంటే శాస్త్రము. లక్ష్యము అంటే ఆ శాస్త్రవాక్యానికి ఉదాహరణం. లక్షణమంటే శాస్త్రము కనుక లాక్షణికులు అంటే శాస్త్రజ్ఞులు. వేదాంగాలుగా చెప్పుకొనేవి ఆరు శాస్త్రాలున్నాయి. అవి శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అనేవి. భారతాన్ని సాహిత్య దృష్టితో పరిశీలించినపుడు లక్ష్యలక్షణ సమన్వయం ప్రధానంగా రెండు శాస్త్రాలతో అనుసంధింప బడుతుంది. అవి ఛందోవ్యాకరణాలు.

తెలుగులో ఎన్నో ఛందో లక్షణగ్రంథాలు వచ్చాయి. అన్నింటికీ ఆదర్శము, పరమ ప్రమాణము కవిత్రయ భారతమే. అలాగే వ్యాకరణ విషయానికి వస్తే నన్నయ వాగనుశాసనుడు కదా! ఆంధ్రశబ్ద చింతామణి నన్నయకృతమనియే పలువురి విశ్వాసము కదా! అదియే ప్రధానభూమికగా తెలుగులో తయారయిన వ్యాకరణశాస్త్రము పరవస్తు చిన్నయసూరి బాలవ్యాకరణము. చిన్నయసూరి కవిత్రయ భారత ప్రయోగాలనే ప్రమాణంగా తీసికొని సూత్ర రచన చేయడం జరిగింది. దానికి పూరణ గ్రంథంగా బహుజనపల్లి సీతారామాచార్యులు రచించిన ప్రౌఢవ్యాకరణంకూడ ప్రధానంగా కవిత్రయ ప్రయోగాలనే అనుసరించడం జరిగింది. అనంతర కవుల ప్రయోగాలను కూడ కొంతవరకు తీసికోవడం జరిగింది.

*'కాదనకిట్టిపాటి యపకారము తక్షకుడేక విప్ర సం*

*బోధన జేసి చేసె"* అని నన్నయమహాకవి దధలకు ప్రాస వేస్తే, ఆ ప్రాసను తదనంతర కవులు నెత్తికెత్తుకొన్నారు. అలాగే "జ్ఞానికి నుపదేశవిధి ప్రకాశము సేయన్" అని తిక్కనగారు ప్రయోగిస్తే కేవలం ఆ ఒక్క ప్రయోగమే ప్రమాణంగా తీసికొని అప్పకవి తన ఛందశ్శాస్త్రంలో ప్రత్యేకయతి అనే పేరుతో జ్ఞ కార కవర్గలకు యతిని కుదిర్చాడు.

సంస్కృతంలో ఆదికవి వాల్మీకి శ్రీకారంతో కావ్యారంభం చేయలేదు.

*"తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్*

*నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్"*॥ అని రామాయణ మహాకావ్యం ఆరంభమయింది. అలాగే కాళిదాసుకూడ శ్రీకారంతో ఏ కావ్యాన్ని ఆరంభించలేదు.

'వాగర్థావివ సంపృక్తౌ' అంటూ రఘువంశాన్ని,

'అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా' అంటూ కుమారసంభవాన్ని

'కశ్చిత్కాన్తా విరహగురుణా' అంటూ మేఘసందేశాన్ని ఆరంభించాడు. అలాగే అభిజ్ఞాన శాకుంతలమ్ నాటకం 'యా సృష్టిస్స్రష్టురాద్యా' అంటూ ఆరంభమయింది. కాని తెలుగులో నన్నయ 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ దధతో' అంటూ శ్రీకారంతో ఆరంభించేసరికి తిక్కన కూడా అదే సంప్రదాయాన్ని పాటించి, 'శ్రీయన గౌరినాఁ బరగు' అంటూ శ్రీకారంతోనే భారత రచనకు శ్రీకారం చుట్టాడు. బహుశః మొదలుపెట్టుట అనే అర్థంలో 'శ్రీకారం చుట్టారు' అనే నుడికారం పుట్టడానికి తెలుగు

భారతమే కారణం కావచ్చు. తెలుగు భారతం శ్రీకారంతో ఆరంభమయింది కనుక శ్రీకారంతో ఆరంభించుట శ్రేయస్కరమని తెలుగు ఛందోలక్షణగ్రంథాలు చెప్పాయి.

*శ్రీకారము కృత్యాదినిఁ*
*బ్రాకటముగ నున్నఁ జాలు బహుదోషములం*
*బోకార్చి శుభములొసఁగును*
*బ్రాకృతముగ నినుము సోఁకు పరుసము భంగిన్॥*

అని సులక్షణ సారము అనే లక్షణగ్రంథంలో చెప్పబడింది (189).

*నవ్యసుఖప్రదాయి భగణంబు, జకారము రుక్ప్రదంబగున్*
*ద్రవ్యముఁజేయు నా, లయకరంబు సకారము, మా శుభంబు,యా*
*దివ్యసువర్ణకారి, వెతఁదెచ్చును రేఫ, విభూతినిచ్చుఁదాఁ*
*కావ్యములందు నాదినిడఁ గర్తకు భర్తకు నంబుజోదరా! ॥*

అని అనంతుడు ఛందోదర్పణము అనే లక్షణగ్రంథంలో చెప్పాడు(23). దానికి నన్నయ మగణంతో 'శ్రీవాణీ' అని ఆరంభించడం, తిక్కన భగణంతో 'శ్రీయన' అని ఆరంభించడం లక్ష్యములుగా పేర్కోవచ్చు. ఎఱ్ఱన అరణ్యపర్వం నడుమనుండి స్వీకరించాడు కనుక అది కృత్యాది కాదు కనుక శ్రీకారారంభంకాని, మగణంతోనో, భగణంతోనో ఆరంభించడం కాని చేయలేదు. 'స్ఫురదరుణాంశు రాగరుచిఁ బొంపిరివోయి' అంటూ చంపకమాలతో నగణాదిగా ఆరంభించాడు. 'ద్రవ్యముఁజేయు నా' అన్నారు గనుక మంగళ గణమే. పైగా స్ఫురత్ అంటే ప్రకాశించుట కనుక ఆ పదముకూడ మంగళాత్మకమే. అది అలా ఉండగా ఐదవ ఆశ్వాసాన్ని 'శ్రీయువతీప్రియ' అని, ఆరవ ఆశ్వాసాన్ని 'శ్రీలలితమూర్తి' అని, ఏడవ ఆశ్వాసాన్ని 'శ్రీకర సోమాన్వయ' అని, ఆరంభించాడు కనుక శ్రీకారాదిగా చెప్పుట మంచిది అన్న లక్షణోక్తికి ఎఱ్ఱన భారతంకూడ లక్ష్యంగా నిలిచింది అన్నది నిర్వివాదాంశం.

మధ్యాక్కరలో నన్నయ ఐదవ గణం మొదటి అక్షరం యతిమైత్రి నిలిపాడు. కాని ఎఱ్ఱన నాలుగవ గణం మొదటి అక్షరాన్ని యతిమైత్రికి స్వీకరించాడు.

*తడయక పుట్టిన నాఁడ తల్లిచేఁ దండ్రిచే విడువఁ*
*బడితినిప్పుడు పతిచేతను విడువబడియెద నొక్కొ!*

*నుడువులు వేయు నింకేల? యిప్పాటి నోములు తొల్లి*
*కడఁగి నోఁచితిని గాకేమి యనుచును గందె డెందమున॥*

దుష్యంతోపాఖ్యానంలో అనగా నాలుగవ ఆశ్వాసంలో 103వ పద్యమైన ఈ మధ్యాక్కర ఛందస్సులో నన్నయ ఐదవ గణం మొదటి అక్షరాన్ని యతిమైత్రికి స్వీకరించడం జరిగింది. నన్నయ రచనలో మొత్తం 39 మధ్యాక్కరలు కనిపిస్తాయి. అన్నిటిలోను ఐదవ గణం మొదటి అక్షరమే యతికి తీసికోవడం జరిగింది. తిక్కన మధ్యాక్కరల జోలికి పోలేదు. ఎఱ్ఱన ఒకే ఒక్క మధ్యాక్కర వ్రాయడం జరిగింది. అందులో 4వగణం మొదటి అక్షరానికి యతి వేయడం జరిగింది. నన్నయకు పూర్వం యుద్ధమల్లుని బెడవాడ శాసనంలో మధ్యాక్కర పద్యపాదాలు ఉన్నాయి. వాటిలోకూడ ఐదవ గణం మొదటి అక్షరానికే యతిని కూర్చడం జరిగింది.

*"స్వస్తి నృపాంకుశాత్యంతవత్సల సత్యత్రినేత్ర"*... ఇత్యాది పద్యం. ఆనాటికి అది అలవాటుగా ఉంది కనుక నన్నయ ఆ పద్ధతినే స్వీకరించి ఉండవచ్చు. కాని పద్యంలో ఎక్కడ ఊనిక వస్తుందో అక్కడ యతి వేయడం జరుగుతుంది. ఇందులో ఆరు గణాలుంటాయి. రెండు ఇంద్రగణాలు ఒక సూర్యగణం, మళ్లీ రెండు ఇంద్రగణాలు, ఒకసూర్యగణం. ఇలా ప్రతిపాదం రెండు భాగాలుగా ఉన్నపుడు రెండవ భాగం మొదటి అక్షరానికే ఊనిక ఏర్పడుతుంది కనుక 4వ గణం మొదటి అక్షరానికే యతివేస్తే బాగుంటుందన్న భావన ఎఱ్ఱన కాలానికి కవులలో కలిగి ఉంటుంది. అందుకని ఎఱ్ఱన ఆ పద్ధతిని పాటించి తన భారత రచనలో వ్రాసిన ఒకే ఒక్క మధ్యాక్కరలో 4వగణం మొదటి అక్షరానికే యతిని వేసాడు.

*అసదృశతేజుఁడు బ్రాహ్మణానీక సహితుఁడై కడగి*
*వసుమతియందు నధర్మ వర్తులై యున్న మ్లేచ్ఛులను*
*మసలక నిజశక్తిఁ జేసి మడియించి ధర్మంబు నిలిపి*
*వసునిభుండొనరించుఁ బేర్మి వాజిమేధము నిష్ఠ యొప్ప*

(అర. 4. 309)

లాక్షణికులు ఎఱ్ఱన పద్ధతికే పెద్దపీట వేసారు. అనంతర కవులు ఆ మార్గాన్నే ఎంచుకొన్నారు. మొత్తంమీద మధ్యాక్కర యతి అనే విషయంలో భారతమే లక్ష్యగ్రంథం అయింది. నన్నయ రచన కాకపోతే ఎఱ్ఱన రచన. ఈ రెండిటిని నన్నయ పద్ధతి అని,

లాక్షణిక మతము అని సాహితీలోకం వ్యవహరిస్తుంటుంది. అయితే విశ్వనాథ సత్యనారాయణగారు రెండిటికీ సమప్రాధాన్యం ఇచ్చి, రామాయణ కల్పవృక్షంలో రెండురకాల యతులతోను పద్యాలు వ్రాసారు. విశ్వనాథ మధ్యాక్కరలు అనే పేరుతో ప్రసిద్ధమైన పదిశతకాల రచనలో మాత్రం నన్నయ పద్ధతినే పాటించారు.

ఈ యతిప్రాసలు తెలుగు పద్యానికే కాని, సంస్కృతానికి లేవు. 'యతిర్విచ్ఛేదః' విరుపు ఉంటే యతి పాటించినట్లే గీర్వాణభాషలో. నియత స్థానంలో పూర్వపదాక్షరం లేకుండా క్రొత్తపదం ప్రారంభం కావాలి. "కస్తూరీ తిలకం లలాటఫలకే-వక్షస్థలే కౌస్తుభమ్" అన్నట్లుగా. కాని తెలుగులో ఆ స్థానంలో యతి మైత్రినికూడ పాటించాలి. దానికి ఇదమిత్థముగా నియమాలు ఏర్పరచాలి. ఆ పని లాక్షణికులది. వారికి ప్రయోగాలు కావాలి. భారత ప్రయోగాలే ఛందోలక్షణగ్రంథాలకు ఆధారం. సంస్కృత వృత్తములవరకు గణాలను వృత్తరత్నాకరంవంటి సంస్కృతచ్ఛందో లాక్షణిక గ్రంథాలు చెప్పినవాటినే తెలుగు లాక్షణికులు తీసికోవచ్చు. కాని తెలుగు ఛందస్సుల సంగతి ఏమిటి? యతిప్రాసల సంగతి ఏమిటి? భారతము తప్ప వేరే దిక్కు లేదు. అందుకని ఛందస్సు విషయంలో సర్వలక్ష్యసంగ్రహమంటే కేవలం భారతము మాత్రమే. నన్నయ ఒక ప్రణాళికను తయారు చేసికొని దానిప్రకారం ఛందస్సును నడిపిస్తే దానినే ప్రమాణంగా తిక్కన ఎఱ్ఱనలుగూడ స్వీకరించి ముందుకు సాగారు. సాధారణ ప్రాసల సంగతి అటుంచి, విశేష ప్రాసల సంగతిని కాస్త పరిశీలిద్దాం.

ద ధప్రాస. అల్పప్రాణాలకు మహాప్రాణాలకు ప్రాస కుదురదు. కాని దధలకు ఒకే ఒక్క పద్యంలో నన్నయ ప్రాస వేయడం జరిగింది. అందుకని అప్పకవి దానిని స్వీకరించి, స్వవర్గజప్రాసలో భాగముగా చెప్పాడు.

*"కాదనకిట్టిపాటి యపకారము తక్షకుడేకవిప్ర సం*
*బోధనఁజేసి చేసె"* (భా.ఆ.2-201).

అయితే దీనికి సంచోదన అని పాఠాంతరాన్ని చూపించారు కొందరు. కాని మౌసలపర్వంలో తిక్కన "హ్రోదుఁడును వక్రదంతుఁడు- గ్రోధనామ కుందు..." (భా.మౌ.77) అని ప్రాసయతిని వేస్తే దానికెవ్వరూ పాఠాంతరాలు చూపించలేదు. కనుక ద ధప్రాసను అంగీకరించాల్సిందే. దానికి లక్ష్యంగా భారతాన్ని స్వీకరించాల్సిందే. అరసున్న ముందు కలది లేనిది ఆ రెంటికీ ప్రాస వేస్తే అది ఖండాఖండ ప్రాస.

*"ఆ పన్నగముఖ్యులఁ దన*

*వీఁపునఁ బెట్టికొని పఱచి విపినములు..."* (భా.ఆ. 2-44). 'ధకార థకారాలకు' ప్రాస వేస్తే దానిని స్వవర్గజప్రాస అంటారు.

*అంధకవృష్ణిభోజకుకురాన్వయ భూపతులెల్ల నీదెసన్*
*బాంధవ సౌహృదప్రణయ భక్తివిశేషములొప్పనీ మనో*
*గ్రంథి యడంగఁ జేయ నెసకంబునఁ బూనినవారు లోభమో*
*హాంధులు ధార్తరాష్ట్రులు జనాధిప! మార్కొనువారె వారలన్?*

(అర. 4-159)

రేఫతో కూడిన వర్ణానికి, కూడని వర్ణానికి ప్రాసవేస్తే సంయుతాసంయుత ప్రాస అంటారు. దానికి లక్ష్యం భారతం ఆదిపర్వంలో కనిపిస్తుంది. ఋ ర లకు ప్రాస నన్నయ సృష్టియే. ఋష్యశృంగుని కథలో

*"ఆ ఋషిపుత్రుఁడు కట్టిన*
*చీరలు"* (అర 3-104).

*దానిని ఋప్రాసగా చెప్పింది లక్షణం.*

*క్షత్రియవంశ్యులై ధరణిఁ గావగఁ బుట్టిన వారు బ్రాహ్మణ*
*క్షత్రియవైశ్యశూద్రులనఁగాఁ గల నాలుగు జాతులన్ స్వచా*
*రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితు కాచినయట్లు రామ మాం*
*ధాతృ రఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యే యుగంబులన్*

(ఆది 2-175)

ప్రాసల సంగతి అలా ఉంది. ఇక యతులవిషయం కొద్దిగా పరిశీలిద్దాం.

జ్ఞానము కేవల కృప న
*జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రకాశము సేయం*
*గానది సకల ధరిత్రీ*
*దానంబునకంటె నధికతర ఫలదమగున్ ॥* (శాంతి4-255)

అని తిక్కనమహాకవి మొత్తం భారతంలో ఒక్క పద్యంలో జ్ఞ కార క కారాలకు యతి కూర్చేసరికి దానిని శిరోధార్యంగా భావించి, జ్ఞకారానికి కఖగఘ అనే నాలుగు

అక్షరాలతోను యతిమైత్రి నిర్ణయించి దానికి 'విశేషయతి' అని పేరు పెట్టాడు అప్పకవి. దానిని తదనంతర కవులందరూ ఎంతగానో ఆదరించారు. వర్గములోని మొదటి నాలుగు అక్షరాలకు పరస్పరం యతి చెల్లుతుంది కాని ఐదవ అక్షరంతో సరిపడదు. ఈ నాలుగింటిలో ఏదైనా బిందుపూర్వకమైతేనే అనునాసికాక్షరంతో యతిమైత్రి కుదురుతుంది. కాని నన్నయ ఆదిపర్వంలో బు–ము అనే అక్షరాలకు యతిని నిలిపాడు.

*ఎట్టి విశిష్టకులంబునఁ*
*బుట్టిన సదసద్వివేకములు గలిగినఁదాఁ*
*గట్టిన కర్మఫలంబులు*
*నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్॥*

(ఆది. 5–58)

అది ప్రమాణంగా తీసికొని ము విభక్తియతి అనేపేరుతో ఒక యతిభేదముగా అప్పకవి చెప్పడం జరిగింది.

*వేదముఖమున 'వబయోరభేద' యనుట*
*వలన వబలొక్కటొక్కటి నిలుచు విరతి*
*కవని లడలకు ళళలకు నట్ల కలిమిఁ*
*జేసి తమలోన నివియును జెల్లుచుండు॥* (అప్ప. 87)

'వబయో రభేదః' అన్నది ప్రసిద్ధమైన మాట కనుక ఆ రెంటికి, వాటితోబాటుగా లడలకు, ళళలకు కూడ యతిని చెప్పింది లక్షణగ్రంథం. దానికి ఆధారం నన్నయ దుష్యంతోపాఖ్యానంలో సత్యప్రశస్తిని గూర్చి శకుంతలద్వారా చెప్పించిన పద్యం.

*నుతజలపూరితంబులగు నూతులు నూరిటికంటె సూనృత*
*వ్రత! యొక బావి మేలు, మఱి బావులు నూరిటికంటె నొక్క స*
*త్క్రతువది మేలు, తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు, త*
*త్సుతశతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు చూడఁగన్॥*

(ఆది. 4–94)

ఇందులో వకార బకారాలకు యతిమైత్రి నిలిపాడు నన్నయ. అంతేనా! 'ప,

ర్వతము గ్రసించునట్లు తన బాహుల వాని గ్రహించి'...(అర.1-311) అని అరణ్యపర్వంలో కూడ ప్రయోగించాడు ఆదికవి. ల ళ అనే రెంటికి అభేదయతిని చెప్పడానికి "లలితకృశోదరంబు దరళత్రివళీయుత రోమ రాజియున్"(4-42) అన్న ఆది పర్వంలోని ప్రయోగం ఆధారమయింది. 'వబ'లకు అభేదయతి చెప్పడం సరే! వకారానికి బకారంతో యతి కుదిరినపుడు పఫబభలకు పరస్పరం యతిమైత్రి ఉన్నపుడు వకారానికి పఫభ అనే ఆ మూడు అక్షరాలతోకూడ యతి నిలుపవచ్చని ఆలోచించారు లాక్షణికులు. దానికి అభేద వర్గయతి అని పేరు పెట్టారు.

దానికి ఆధారం ఆదిపర్వంలోని నన్నయ పద్యమే.

*ప్రల్లదుడైన యొక్క కులపాంసను చేసినదానఁ దత్కులం*
*బెల్లను దూషితంబగుట యేమి యపూర్వము కావున న్మహీ*
*వల్లభ! తక్షకాధము నెపంబున సర్పములెల్ల నగ్నిలో*
*ద్రెళ్లఁగ సర్పయాగ మతిధీయుత! సేయుము విప్రసమ్మతిన్॥*

(ఆది.1-126)

నగి నగియేనియున్ విను జనార్దన!... (అర.4-397)

*మును వెఱతునేయ మీరలు*
*నను నేసినఁ గాని యనుడు నాకేశసుతున్॥* (వి.5-124)

అనే భారత ప్రయోగాలనుండి నిత్యసమాసయతి పుట్టుకు వచ్చింది. దీనినే అఖండయతి అనికూడ అంటారు. కాని సమాసంతో పనిలేకుండగా సంధి కలిసినచోటకూడ పరపదాదిస్వరానికి కాకుండగా పూర్వపదాంత్య హల్లునకు యతి వేసి దానిని అఖండయతి అంటున్నారు కొందరు. అది అప్రామాణికం. ఇలా చెప్పుకొంటూ పోతే ఒకటా! రెండా! అనేకానేక ప్రయోగాలు భారతమునందలివే లక్ష్యములుగా నిలిచి, ఛందోలాక్షణిక గ్రంథాలకు అస్తిత్వాన్ని కలిగించాయనడం అక్షర సత్యం.

ఇటుపై వ్యాకరణంపై కాస్త దృష్టి సారిద్దాం. మిగిలిన కవులు వేరు. ఆదికవి నన్నయ్య గాసటబీసటగా ఉన్న భాషను ముందు సంస్కరించి, దానికోసం ఒక వ్యాకరణగ్రంథాన్ని తయారు చేసి, వాగనుశాసనుడై భారతరచన చేయాల్సి వచ్చింది

కదా! చింతామణి నన్నయ వ్రాయలేదు అని అంటే ఎవరైతే వ్రాసారో వారికి నన్నయ భారత ప్రయోగాలే లక్ష్యములయ్యాయి కదా! నన్నయ్యే వ్రాసాడని ఒప్పుకుంటే ముందుగా లక్షణగ్రంథాన్ని తయారు చేసి, దానికి లక్ష్యముగా భారత రచన సాగించాడని ఒప్పుకోవాల్సిందే కదా! ఆ తరువాత వచ్చిన బాలవ్యాకరణం కాని, ప్రౌఢవ్యాకరణం కాని ప్రధానంగా భారత ప్రయోగాలనే ప్రమాణంగా తీసికొని సాగినవే కదా! అలాగే సంస్కృత వ్యాకరణ మర్యాదకుకూడ తెలుగు భారతం పరమప్రమాణంగా నిలిచింది కదా! విచిత్రమేమంటే నన్నయ మహాకవి తన మొదటి పద్యంలోనే ('శ్రీవాణీగిరిజాశ్చిరాయ' అన్నది శ్లోకం, 'అని సకలభువన రక్షణ ప్రభువులై' అంటూ తరువాత చెప్పినది గద్యం. రాజకులైకభూషణుడు అన్నదే భారతంలోని మొదటి పద్యం.) వ్యాకరణపరమైన తమాషాలు చేసాడు.

*రాజకులైక భూషణుఁడు రాజమనోహరుఁడన్యరాజ తే*
*జోజయశాలిశౌర్యుఁడు విశుద్ధ యశశ్శరదిందు చంద్రికా*
*భ్రాజితసర్వలోకుఁడపరాజిత భూరి భుజాకృపాణ ధా*
*రాజల శాంతశాత్రవ పరాగుఁడు రాజమహేంద్రుఁడున్నతిన్॥*
*(ఆది 1-3)*

ఇందులో శౌర్యుఁడు అనే పదప్రయోగం కాస్త విలక్షణమైనది. ఎందుకంటే శూర శబ్దం ధర్మివాచకం. 'శూరస్య భావః శౌర్యమ్' శూరుని భావము శౌర్యము కనుక శౌర్యము అనేది ధర్మవాచకం. మళ్లీ శౌర్యశబ్దం ధర్మిగా మారి శౌర్యుడు అనే రూపం ఏర్పడదు. కాని ఇక్కడ కేవల శౌర్యశబ్దం కాదు. 'అన్యరాజతేజో జయశాలి శౌర్యుడు' అనేది మొత్తం ఒకటే సమాసం. ఇతరరాజుల తేజస్సును లేదా పరాక్రమాన్ని జయించుటయే స్వభావముగా గల శౌర్యము కలవాడు అనే అర్థంలో శౌర్యుఁడు అనే పదాన్ని ప్రయోగించాడు. ధర్మివాచకమునుండి ధర్మవాచకం ఏర్పడుతుంది కాని ధర్మవాచకమునుండి ధర్మివాచకం ఏర్పడదు అనే సాధారణ వ్యాకరణ నియమానికి భిన్నంగా కొన్ని ప్రత్యేక సందర్భాలలో ధర్మవాచకమే ధర్మివాచకంగా మారిపోతుందనడానికి ఈ ఆదికవి నన్నయ్య ఆది పద్యమే పరమ ప్రామాణికమైన లక్ష్యం. పోతనకు సహజపాండిత్యుడు అన్న బిరుదవాచకముకూడ ఇలాంటిదే.

పండితుని భావము పాండిత్యము. సహజమైన పాండిత్యము కలవాడు సహజ పాండిత్యుడు. పండితస్య భావః పాండిత్యమ్. సహజం పాండిత్యం యస్య సః

సహజపాండిత్యః. సంస్కృతంలో శ్లోకంలో ఏ పాదానికి ఆ పాదం విరిగిపోవాలి తప్ప ఒకే పదంలో కొన్ని అక్షరాలు పూర్వపాదంలోను, మిగిలిన అక్షరాలు తరువాతి పాదంలోను కనబడవు. కాని తెలుగులో అలా ఉంటే అందం. ఆ సంప్రదాయాన్ని ప్రారంభించినది కూడ ఆదికవి ఆదిపద్యమే. 'తే, జోజయశాలి శౌర్యుఁడు,' అలాగే 'ధా, రాజల శాంత శాత్రవ పరాగుఁడు'.

తెలుగులో సమాసాలను మూడు విధాలుగా చెప్పాడు చిన్నయసూరి. "సాంస్కృతి కాచ్ఛిక మిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు" (బా.సమా.2). సాంస్కృతికం సిద్ధము, సాధ్యము అని రెండు రకాలు. కేవల సంస్కృతపదాలకు సంస్కృతములోనే సమాసం చేసి వాటికి సంబంధించిన సంస్కృత సంధులనుకూడ చేసి అపుడు దానిని తెలుగు విభక్తి ప్రత్యయములను చేర్చినపుడు అది సిద్ధ సమాసమవుతుంది. 'రాజకులైక భూషణుడు' అన్న ఆదికవి ఆదిపర్వంలోని ఆది పద్యంలోని ఆది పాదమే లక్ష్యము. ఏపదానికి ఆపదం తత్సమంగా మార్చుకొని ఆ రెంటికీ సమాసం చేస్తే అది సాధ్య సమాసం. రెండు అచ్చతెనుగు పదాలకు సమాసం చేస్తే అది ఆచ్ఛిక సమాసం. ముందు తెలుగుపదం తరువాత సంస్కృతపదం వేసి సమాసం చేస్తే అది మిశ్రమ సమాసం. వీటన్నిటికీ ఉదాహరణలు భారతంలోనే కోకొల్లలు.

కాని ముందు సంస్కృత శబ్దాన్ని ఉంచి, పిదప అచ్చతెలుగు పదం పెట్టి సమాసం చేస్తే మాత్రం అది అలాక్షణికం. దుష్ట సమాసం లేదా వైరిసమాసం అంటారు. "కేవల సంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు దానం జేసి యనేకమాఱు లల్పదండీత్యాదులు దుష్టములని తెలియునది" (బా.సమా.3 వృత్తి) కాని ప్రాణగొడ్డము అని తిక్కన ప్రయోగం. స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు" (బా.సమా.6) అను లక్షణమునకు విరుద్ధముగా కఱకంఠుడు అని నన్నయ ప్రయోగం. ఇటువంటివానికి సాధుత్వం కల్పించేందుకు 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు' (బా.సం.23) అని ఒక సూత్రమే పుట్టింది. సంస్కృతవ్యాకరణానికి ఒదగని ప్రయోగాలు సంస్కృత రామాయణ భారతాలలో కనిపిస్తే 'ఆర్షత్వాత్ సాధుః' ఋషులు ప్రయోగించారు కనుక దానిని సాధువుగా భావించండి అన్నారు కాని తరువాతి కవులు ప్రయోగించేందుకు అనుమతినీయలేదు

సంస్కృత లాక్షణికులు. కాని తెలుగు లాక్షణికులు వారి లక్షణసూత్రములకు ఒదగని వాటిని భారతకవులు ప్రయోగిస్తే 'గ్రాహ్యము' గ్రహించవచ్చని చెప్పి కవిత్రయానికి చాల పెద్దపీట వేసారు.

"తెలుగునకున్న వ్యాకరణదీపము చిన్నది" అన్న తిరుపతి వేంకటకవులు ఆ తరువాత "దిద్దకుండయ్య భారతము దిద్దుడు వ్యాకరణమ్ము" అన్నారంటే భారతానికి లక్షణగ్రంథాలకంటె అధిక ప్రాధాన్యం ఇచ్చినట్లే కదా! నిజమే మఱి. ప్రయోగశరణము వ్యాకరణము కాని వ్యాకరణ శరణము ప్రయోగము కాదుగదా! "భారత భారతీ సముద్రముఁ దఱియంగ నీదను విధాతృనకైనను నేరఁబోలునే" (ఆ. 1-19) అన్న నన్నయ ప్రయోగం లక్ష్యంగా "విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్తుల కత్వ స్త్రీవద్భావంబులు విభాషనగు" (బా. తత్స. 53) అన్న సూత్రం పుట్టింది. "నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు" (బా. తత్స. 54) అన్న సూత్రానికి ప్రక్కనే "ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు" (బా. తత్స. 55) అన్న సూత్రం పుట్టింది. దానికి" శ్రీయన గౌరినాఁ బరగు" అన్న విరాటపర్వం మొదటి పద్యం మొదటి పాదమే లక్ష్యం. "వాక్యావసానంబున సంధి లేమి దోషంబు గాదని యార్యులండ్రు" (బా. సం. 55) అనే సూత్రంతో బాలవ్యాకరణం సంధిపరిచ్ఛేదం పూర్తి అయింది. ఈ సూత్రానికి మూలం అధర్వణ కారిక "న స్యాద్వాక్య విరామేతు సంధ్యభావో పి దోషకృత్".

*సర్వతీర్థాభిగమనంబు సర్వవేద*
*సమధిగమము సత్యంబుతో సరియుఁ గావు*
*ఎఱుఁగుమెల్లధర్మంబులకెందుఁ బెద్ద*
*యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు॥* (ఆ. 4-96)

అన్న ఆదిపర్వంలోని దుష్యంతోపాఖ్యానంలోని ఈ పద్యం ఆ లక్షణానికి సరియైన లక్ష్యం. విచిత్రమేమంటే వారి పేర్లుకూడ లక్ష్యాలే. "శ్రేష్ఠతావాచకంబులగు నార్యాంబాద్యర్థక శబ్దంబులు పరంబులగుచో నన్ని యచ్చులకు సంధి నిత్యము" (ప్రౌ. సం. 1). అన్న ప్రౌఢవ్యాకరణం సంధిపరిచ్ఛేదం మొదటిసూత్రానికి నన్నయ్య, తిక్కన్న, ఎఱ్ఱన్న అన్న పేర్లే లక్ష్యాలుగా చెప్పుకోవచ్చుగదా! ఆదికవి ఆదిపర్వం మూడవ ఆశ్వాసంలో అను ఇష్టసఖి కలిపి ద్రుతానికి ద్విత్వం చేసి

'అన్నిష్టసఖినూదియున్నదాని' (ఆది. 3-140) ప్రయోగించడమే కాకుండా బెసకకుండా ప్రాసయతిస్థానంలో నిక్షేపించాడు. అందువలన "కొన్నియెడలఁ బ్రామాణిక ప్రయోగంబులం ద్రుతంబున కచ్చు పరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి" (ప్రౌ.సం. 3) అనే ప్రౌఢవ్యాకరణసూత్రం పుట్టింది. ఇలా చెప్పుకుంటూపోతే ఆంధ్రశబ్ద చింతామణి, బాలవ్యాకరణం, ప్రౌఢవ్యాకరణం వంటి లక్షణగ్రంథాలకు లక్ష్యాలు కోకొల్లలుగా కనిపిస్తాయి తెలుగుభారతంలో. తెలుగులో దండకం పుట్టింది భారతంలోనే. ఉదంకోపాఖ్యానంలో నాగస్తుతిలో 'మాకు ప్రసన్నుడయ్యెడున్' అన్న మాట పునఃపునరుక్తిగా చెప్పడం శతకానికి మకుటమనే లక్షణానికి లక్ష్యంగా నిలిచింది.

'ఛందోవ్యాకరణాదివిత్' అన్న ఆలంకారికవాక్యంలో ఆదిశబ్దం చేత అలంకార శాస్త్రాన్ని తీసికోవాలి. ఎందుకంటే 'కావ్యాలంకరణజ్ఞమేవ కవితాకన్యా వృణీతే స్వయమ్' అనికదా ఆర్యోక్తి.

నన్నయ 'రాజకులైకభూషణుదు' అన్న మొదటిపద్యంలోనే శబ్దాలంకారం, అర్థాలంకారం నిక్షేపించాడు. రాజశబ్ద పునఃపునరావృత్తి ద్వారా వృత్యనుప్రాస అనే శబ్దాలంకారం, అలాగే రూపకము అనే అర్థాలంకారం రెండూ ఏకకాలంలో ప్రయోగించాడు ఆదికవి. ఉపమాన ఉపమేయాలకు అభేదం చెపితే అది రూపకాలంకారం అవుతుంది. యశస్సుకు చంద్రికకు, కృపాణధారకు జలానికి, శత్రువులకు పరాగానికి అభేదం చెప్పడంచేత ఇది రూపకం. ఇందులో రాజశబ్దం ఐదుమార్లు ప్రయోగింపబడింది. ఈ భారతంలో నిజమైన రాజులు ఐదుగురే. వారే పాండవులు అన్నది ధ్వని. ఇందులో రాజరాజనరేంద్రునకు వేసిన విశేషణాలన్నీ ఉత్తమ కావ్యనాయక లక్షణాలై ధర్మరాజు సామర్థ్యాన్ని ఇందుమూలంగా ధ్వనింపజేసినట్లయింది. కావ్యస్యాత్మా ధ్వనిః అన్న ఆనందవర్ధనుని సిద్ధాంతానికి అడుగడుగునా భారతం లక్ష్యంగా కనిపిస్తుంది.

*వలలుండెక్కడఁ జూచె నొండెడ నసేవ్యక్ష్మాజముల్ పుట్టవే*
*ఫలితంబై వరశాఖలొప్పఁగ ననల్పప్రీతి సంధించుచున్*
*విలసచ్ఛాయ నుపాశ్రిత ప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ*
*గల యీ భూజము వంటకట్టియలకై ఖండింపఁగా నేటికిన్॥*

(వి. 2-136)

ఈ పద్యం అక్కడి సభాసదులకు ఒకలా అర్థమవుతుంది. భీమునకు ద్రౌపదికిమాత్రం వేరుగా అర్థమవుతుంది. ఇలా చెప్పడం చేత ఇది గూఢోక్తి అలంకారమవుతుంది. ప్రస్తుతంచేత ప్రస్తుతం గమ్యమానమవుతోంది కనుక ప్రస్తుతాంకురాలంకారం అవుతుంది. అసేవ్యక్ష్మాజములు అంటే సేవింపదగని చెట్లు ఉన్నాయి వాటిని కూల్చు అనుటద్వారా విరాటుడు సేవ్యవృక్షం. మనకు నీడనిచ్చిన చెట్టు. కౌరవులు అసేవ్యక్ష్మాజములు. మనను బయటకు గెంటిన చెట్లు. నీ కోపాన్ని వారిపై చూపించు. వారిని కూల్చు. అలా కూల్చేందుకు గాను అజ్ఞాత వాస సమయాన్ని జాగ్రత్తగా పూర్తి కానియ్యి అనే సందేశం ధ్వనిస్తోంది. అలాగే ఉద్యోగపర్వంలో ద్రౌపది కృష్ణునితో మాట్లాడిన తీరు సంధికి కాక యుద్ధానికే ప్రాధాన్యమిమ్మనే విషయం ధ్వనిస్తుంది.

*ఇవి దుస్ససేను వ్రేళ్ళం*
*దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి, కౌ*
*రవులకడఁ దీఱుమాటల*
*యవసరమునఁ దలఁపవలయు నచ్యుత! వీనిన్॥* (ఉ.3-116)

పద్యమే అందుకు సాక్ష్యం. ఇలా భారతమంతా ధ్వనిలక్షణానికి లక్ష్యంగా కనిపిస్తుంది. సరే! ఏ కావ్యానికైనా రసము అత్యంత ప్రధానమైనది. 'ప్రాగ్విపశ్చిన్మతము లందు రసము వేయిరెట్లు గొప్పది' అంటారు విశ్వనాథవారు రామాయణ కల్పవృక్షంలో.

మహాభారతంలో నవరసాలు పరిపూర్ణంగా పండాయన్నది నిర్వివాదాంశం. శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము, శాంతము అనే తొమ్మిది రసాలు భారతంలో చక్కగా ఆవిష్కృతమయ్యాయి ఆయా సందర్భాలలో. హిడింబాభీమసేనులు, సుభద్రార్జునులు, ఉత్తరాభిమన్యులు వంటి జంటల నడుమ శృంగారరసం హాయిగా ప్రవహించింది. అరణ్యపర్వంలో ద్రౌపది ఇష్టపడిందని సౌగంధిక పుష్పాన్ని తీసుకురావడంకోసం భీమసేనుడు పెద్దయుద్ధమే చేయాల్సిరావడం కూడ చక్కని శృంగారరసావిష్కారం.

హాస్యానికి వస్తే విరాటపర్వంలో ఉత్తరుని పాత్రద్వారా నవ్వులు విరబూస్తాయి. ఉత్తరప్రగల్భాలు అనే జాతీయంకూడ పుట్టింది. ఉద్యోగ పర్వంలో పాండవులు వారివారి

అభిప్రాయాలను దూతగా వెళ్లబోతున్న కృష్ణునికి విన్నవించుకొనే సందర్భంలో భీముని శాంతవచనాలు, దానికి కృష్ణుని అధిక్షేపం, భీముని ఉక్రోషం ఊరికే నవ్వులాటకన్నాను అని కృష్ణుడు శాంతపరచడం ఇదంతా హాస్యరసానికి వేసిన పెద్దపీట.

ద్రౌపదీవస్త్రాపహరణ సన్నివేశంలోను, సౌప్తిక స్త్రీపర్వాలలోను కరుణరసం పొంగి పొర్లింది. జరాసంధ, బకాసురాదుల వధలోను, కీచకవధలోను దుశ్శాసనుని గుండె బ్రద్దలుకొట్టి చంపడం, దుర్యోధనుని తొడలు విరుగగొట్టి చంపడంలో భీమసేనునిద్వారా రౌద్రరసం పొంగితే వారిని చంపుతానని భీముడు చేసిన 'ధారుణి రాజ్యసంపదమదంబున' 'కురువృద్ధుల్ గురువృద్ధబాంధవులు' అనే పద్యాలలోని ప్రతిజ్ఞలలోను, ఉత్తర గోగ్రహణంలోను, భీష్మ, ద్రోణ, కర్ణులతో అర్జునుడు చేసిన యుద్ధంలోను వీరరసం పరవళ్లు త్రొక్కుతుంది. దుశ్శాసనుడి రక్తం త్రాగే సన్నివేశంవంటివి భయానక రసానికి తావలమయ్యాయి. యుద్ధభూమి వర్ణనం, అలాగే ఉపపాండవ వధవంటివి బీభత్సరసాన్ని ప్రవహింపజేసాయి. ఘటోత్కచుని రంగప్రవేశంలోను, విశ్వరూపసందర్శనంలోను అద్భుతరసం ఆవిష్కృతమౌతుంది. ధర్మరాజు మాట్లాడినప్పుడల్లా శాంతరసం పాఠకులను పలుకరిస్తూనే ఉంటుంది. నవరసాలతోబాటు రసాభాసకూడ ఒకటి ఉంటుంది కదా! అందుకని ద్రౌపదీ కీచకుల నడుమ శృంగారరసాభాసనుకూడ చాల పరిపుష్టంగా పండించాడు మహాకవి తిక్కనసోమయాజి. ఇలా రసలక్షణానికి పరిపూర్ణలక్ష్యగ్రంథం మహాభారతం.

*వేదములకు నఖిలస్మృతి*
*వాదములకు బహుపురాణవర్గంబులకున్*
*వాదైన చోటులను దా*
*మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్॥* (వి.1-4)

అని తిక్కన వక్కాణించినది సంస్కృతభారతానికే కాదు తెలుగుభారతానికికూడ అన్వయిస్తుంది. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని అంటూ చెప్పిన ఏడు విషయాలలో మిగిలిన ఆరూ సర్వలక్ష్యసంగ్రహము అన్నమాటలోనే గతార్థమవుతాయి. ఎందుకంటే ధర్మలక్షణాలకు భారతం లక్ష్యగ్రంథం. వేదాంతశాస్త్రాలకు లక్ష్యం భారతం. నీతిశాస్త్రానికి భారతమే లక్ష్యం. అష్టాదశవర్ణనాది కావ్యలక్షణాలన్నిటికి భారతమే పరిపూర్ణ లక్ష్యం.

ఇతిహాసలక్షణాలకు, పురాణలక్షణాలకు లక్ష్యంగా నిలిచేది మహాభారతమే. కనుక 'లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని' అన్నవాక్యం సూత్రప్రాయమైతే మిగిలిన ఆరు దానికి వ్యాఖ్యాప్రాయములు.

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ

వివిధవేదతత్త్వ వేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁజేసె భారతంబు॥ (ఆ. 1-32)

నిడివి యున్నంతలోఁ జెప్ప నేర్చినాను
తృప్తిపడినారొ మీరసంతృప్తి పడిరొ
సెలవొసంగినఁ బోయివచ్చెదను నేను
ధన్యవాదాలు ధన్యవాదాలు మీకు॥

*( వ్యాసకర్త: సహస్రావధాని, రాజమహేంద్రవరం )*



# మహాభారతము–భగవద్గీత

శ్రీ ఎల్.వి. గంగాధరశాస్త్రి
98489 11223

**ఉపోద్ఘాతం**

**భగవద్గీత!**

శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి నిమిత్తంగా చేసుకుని ప్రపంచ మానవాళికి చేసిన కర్తవ్యబోధ! ప్రపంచంలో అత్యధిక ప్రాంతం అజ్ఞానాంధకారంలో మునిగి ఉన్న సమయంలో భారతదేశం ఆధ్యాత్మిక ప్రకాశమై, జాగృతమై విరాజిల్లిందని మహాత్ములు చెబుతున్నారు.

ఏది తెలుసుకున్న తర్వాత కూడా ఇంకా తెలుసుకోవలసి ఉంటుందో దాన్ని'సైన్స్'.... అంటారు. కానీ – ఏది తెలుసుకున్న తర్వాత మరొకటి తెలుసుకోవడానికి మిగిలి ఉండదో దాన్ని 'స్పిరిట్యువల్ సైన్స్' అంటారు.

అదే... అధ్యాత్మ జ్ఞానం!

ఆ అధ్యాత్మజ్ఞాన సారమే – భగవద్గీత!

మిగతా మతగ్రంథాలన్నీ దేవుని కుమారులుగా ప్రకటించుకున్నవారి శిష్యుల చేత రాయబడితే – 'భగవద్గీత' మాత్రం తాను భగవంతుడిగా ప్రకటించుకున్న శ్రీకృష్ణ పరమాత్మ చేత బోధించబడింది... పైగా మతాలేవీ ఆవిర్భవించని కాలంలో!

అంటే – కలియుగానికి పూర్వం... అనగా ద్వాపర యుగాంతంలో 'గీత' బోధింపబడింది. కలియుగం ప్రారంభమై – భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చేనాటికి అంటే 1947 నాటికి 5048 సంవత్సరాలైంది. అంటే గీతా బోధ జరిగి ఇప్పటికి 5118 సంవత్సరాలైందన్న మాట! శ్రీకృష్ణ పరమాత్మ ఈ భూతలంపై 125సంవత్సరాల 7 నెలల 8 రోజుల 30 ఘడియలు నివసించాడు. గీత బోధించే సమయానికి శ్రీకృష్ణుడి వయస్సు సుమారు 87 సం॥లు.

* * *

'బాధలన్నీ మనిషి చేసిన పాపాలకు శిక్షలు' అని క్రీస్తుకి 2000 సంవత్సరాల క్రితం నివసించిన హిబ్రూలు భావిస్తే 'అహింసే పరమధర్మం' అని జైనులు విశ్వసించారు. 'కోరికలను చంపుకోవడమే శాంతికి మూలం' అని బుద్ధుడు భావిస్తే, 'మానవ సంబంధాల్లో ఉన్న మాధుర్యం' గురించి కన్ఫ్యూషియస్ వివరించాడు. భగవంతుడు మనిషిని పట్టించుకోనంత దూరంలో ఉండి తన ఆనందం తాను చూసుకుంటూ ఉంటాడనీ, కాబట్టి మనిషి నిర్భీతిగా సుఖపడవచ్చనీ, ఆనందం తప్ప ఈ ప్రపంచంలో మరేదీ లేదనీ క్రీస్తుకి 300 సంవత్సరాల క్రితం నివసించిన ఎపిక్యూరియన్స్ భావించేవారు. 'పశ్చాత్తాపమే పాపానికి పరిహారం' అని క్రైస్తవులు నమ్మారు.  'భగవంతుడికి తనకు తాను పూర్తిగా అర్పించుకోవడమే జీవితం' అని ఇస్లాం నమ్మితే, 'భగవంతుడొక్కడే' అని గురునానక్ ప్రవచించాడు.

అయితే...

వీరందరి కంటే ముందే శ్రీకృష్ణ పరమాత్మ ఈ జగతికి పంచిన జ్ఞానసంపదే 'భగవద్గీత'!

* * *

ఏ పని చేసినా త్రికరణ శుద్ధిగా, ఫలితం పరమాత్మకు అర్పించి, భవబంధాలను వదలి చేయడమే మనిషి కర్తవ్యం అని చెప్పిన కర్మ, భక్తి, జ్ఞాన మార్గాల ప్రబోధమే... 'భగవద్గీత'! ఇతర మతగ్రంథాల్లాగా ఇది విడిగా రాయడానికి గ్రంథం కాదు. 'మహాభారతం' అనే లక్ష శ్లోకాల ఇతిహాసంలో భీష్మ పర్వంలో 25వ అధ్యాయం నుండి 42వ అధ్యాయం వరకూ 700శ్లోకాల రూపంలో జరిగిన శ్రీకృష్ణార్జున జ్ఞానసంవాదం – భగవద్గీత! సర్వోపనిషత్తుల సారమైన భగవద్గీతకు తొలిగా భాష్యం రాసిన శంకరాచార్య –

**శ్లో॥ నారాయణః పరో ఽ వ్యక్తాత్ అండమవ్యక్త సంభవమ్ ।**
**అండస్యాంతస్త్విమే లోకాః సప్తద్వీపాచ మేదినీ ॥**

అనే ప్రాచీన శ్లోకాన్ని  ఉదాహరిస్తారు.

అంటే –

* పరమేశ్వరుడు, అంటే శ్రీమన్నారాయణుడు – మొదటివాడు, అవ్యక్తానికి అతీతుడు.
* ఈ అవ్యక్తాన్నే మాయ, అవిద్య లేక ప్రకృతి అంటారు.
* ఈ అవ్యక్తం నుండే బ్రహ్మాండం ఉద్భవించింది.
* ఈ బ్రహ్మాండంలోనే 14 లోకాలు ఉన్నాయి.
* ఈ లోకాలలో ఒకటి సప్తద్వీపాలతో కూడిన ఈ భూగోళం!
* ఈ భూగోళంపై 84 లక్షల రకాల జీవరాశులు ఉన్నాయి.
* వీటిలో మానవులు ఒక జీవరాశికి చెందినవారు. ఈ జీవరాశులు అన్నింటిలోనూ మానవజన్మ అత్యున్నతమైనది.
* ఈ మానవులు సక్రమమార్గంలో ప్రవర్తించడానికి పరమేశ్వరుడు ధర్మాన్ని ఏర్పాటు చేశాడు.
* ధర్మంలో రెండు భాగాలు ఉన్నాయి. ఒకటి ప్రవృత్తి ధర్మం. రెండవది నివృత్తి ధర్మం.
* ఆ ధర్మాలను వివరించడానికి పరమేశ్వరుడు అందించినవే వేదాలు.
* వేదాలలోని మొదటి మూడు భాగాలైన సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకాలు ప్రవృత్తి ధర్మాన్నీ.... అంటే కర్మ మార్గాన్నీ... నాల్గవ భాగమైన ఉపనిషత్తులు నివృత్తి మార్గాన్నీ – అంటే మోక్షమార్గాన్నీ వివరిస్తాయి.

వీటన్నింటి సారాంశమే... భగవద్గీత!

జ్ఞాన పరిణతిని బట్టి ఒక్క స్థాయిలో ఒక్కో విధంగా అర్థమయ్యే నిత్యనూతన, సార్వజనీన గ్రంథం భగవద్గీత! భారతీయులు గర్వించదగ్గ విశేషమేమిటో తెలుసా... ప్రపంచంలో ఏ గ్రంథానికీ, ఏ బోధకీ పుట్టిన రోజులు జరుపుకోవడం సంప్రదాయంగా లేదు. ఒక్క 'భగవద్గీత'కు తప్ప!

అదే మార్గశిర ఏకాదశి!

గీ...తా.... జ...యం...తి!

**భగవద్గీత ఏం చెబుతుంది?**

* చేయవలసిన పనిపైన లోతైన అవగాహన, నిశితమైన దృష్టి, లక్ష్యంపైన ఏకాగ్రత కలిగి ఉండాలి. (1-22).
* పిరికితనాన్ని వదలిపెట్టి ధైర్యంతో లక్ష్యం వైపు అడుగువెయ్యి. (2-2,3).
* అనవసరమైన విషయాల గురించి బాధపడకు (2-11).
* ఆత్మజ్ఞానాన్ని తెలుసుకో! (2-20).
* ఆత్మకు శాంతి, అశాంతి అనేవి ఉండవు. (కాబట్టి చనిపోయిన వ్యక్తి ఆత్మకు శాంతి చేకూరాలని ప్రార్థించడంలో అర్థం లేదు.) (2-23).
* గౌరవం తెచ్చిపెట్టే పనులే చెయ్యి. అపకీర్తి తెచ్చే పనులు చెయ్యకు. (2 -33,34).
* జయాపజయాలతో ప్రమేయం లేకుండా ధర్మం కోసం పోరాడు. (2-38).
* ఫలితం కోసం ఎదురు చూడకుండా నువ్వు చేయవలసిన పనిని చేసుకుంటూ వెళ్ళు! (2-47).
* పనిలో నైపుణ్యాన్ని పెంచుకో! (2-50).
* ధ్యాస మరల్చకుండా ఏకాగ్ర చిత్తంతో పనిచెయ్యి. (2-53).
* ఎలాంటి పరిస్థితులు ఎదురైనా చలించక స్థితప్రజ్ఞుడిలా ఉండు. (2-56).
* ఉత్తమ జీవితం గడపాలంటే ఇంద్రియాలను అదుపులో పెట్టుకోవాలి. (2-60,61).
* అధఃపతనానికి దారితీసే స్వార్థపరమైన కోరికల విషవలయంలో చిక్కుకోకు. (2-62,63).
* శాంతం ఉన్నవానికే సౌఖ్యం లభిస్తుంది. (2-66).
* లోక కళ్యాణం కోసం ఆలోచించే నిస్వార్థ పరుడిలా, జ్ఞానిలా జీవించు! (2-69).
* విషయ భోగాలపైన ఆసక్తి ఉన్నవాడు శాంతిని పొందలేడు.(2-70).

* నీవు చేయవలసిన పనిని ఫలాపేక్షారహితంగా, లోకహితార్థమై, ఇతరులకు ఆదర్శం అయ్యేటట్లుగా చెయ్యి. (3-19,20,21).
* కర్మఫలాన్ని పరమాత్మకు అర్పించి జీవన పోరాటాన్ని సాగించు. (3-30).
* రాగద్వేషాలకు లోను కాకుండా పని చెయ్యి. (3-34).
* నీకు విధించబడిన ధర్మాన్నే ఆచరించు అది నిన్ను రక్షిస్తుంది. (3-35).
* కోరికలను తప్పనిసరిగా జయించు (3-43).
* అధర్మాన్ని ఆచరించకు. దేవుడు శిక్షిస్తాడు. (4-8).
* భగవంతుణ్ణి ఏ దృష్టితో సేవిస్తే ఆ విధంగా అనుగ్రహిస్తాడు. (4-11).
* గుణాలను, కర్మలను బట్టి నాలుగు వర్ణాల వ్యవస్థను పరమాత్మ ఏర్పాటు చేశాడు. (4-13).
* పూర్వులు నడిచిన కర్మమార్గంలోనే ప్రయాణించు. (4-15).
* నిస్వార్థ బుద్ధితో పనిచెయ్యి. అప్పుడు నీకు ఏ పాపమూ అంటదు. (4-21).
* పవిత్రమైన భావనతో పనులు చెయ్యి. లేకపోతే జీవితానికి అర్థం లేదు. (4-31).
* భక్తి శ్రద్ధలతో గురువులను సేవించడం వల్ల పొందే జ్ఞానానికి విలువ, శాశ్వతత్వమూ ఉంటాయి. (4-34).
* జ్ఞానంతో సమానమైనది, పవిత్రమైనదీ మరి యొకటి లేదు. కాబట్టి జ్ఞాని కావడానికి ప్రయత్నించాలి. (4-38).
* జ్ఞానాన్ని ఆర్జించడానికి శ్రద్ధ, పట్టుదల, ఇంద్రియ నిగ్రహం అవసరం. (4-39).
* జ్ఞానం లేకపోయినా, శ్రద్ధ లేకపోయినా, నిశ్చయాత్మకత లేకపోయినా జీవితంలో ఏమీ సాధించలేము. (4-40).
* లే...! సందేహిస్తూ కూర్చోకు. కార్యరంగం లోకి దూకు! (4-42).
* ఫలితాన్ని పరమాత్మకు వదిలిపెట్టి పనులు చేసేవాడికి పాపపుణ్యాలుండవు. (5-10).

* నువ్వు చేసే పాపపుణ్యాలతో పరమాత్మకు సంబంధం లేదు. ఆ రెండూ నువ్వే అనుభవించాలి. (5-15).
* జ్ఞానం సూర్యుని వంటిది. దానివల్ల పరమార్థ తత్త్వం స్పష్టంగా బోధపడుతుంది. (5-16).
* పరమాత్మే సర్వమని నమ్మిన వాడికి మోక్షం తప్పక లభిస్తుంది. (5-17).
* సర్వ ప్రాణులయందు సమదృష్టి కలవాడే పండితుడు. (5-18).
* ఆనందంగా జీవించాలంటే ఉద్వేగాలను అణచుకోవాలి.(5-26).
* వృద్ధి, పతనాలు రెండూ నీ చేతుల్లోనే ఉన్నాయి. కాబట్టి నిన్ను నువ్వే ఉద్ధరించుకో! (6-5).
* ఉత్తమ లక్షణాలను, ఉత్తముల లక్షణాలను అలవరుచుకో! (6-9).
* ఆహార నియమాలను పాటించి ఆరోగ్యాన్ని కాపాడుకో! (6-17).
* అభ్యాసంతో, వైరాగ్యంతో మనస్సును నిగ్రహించుకోవచ్చు. (6-35).
* నువ్వు చేసే మంచి పనులే నిన్ను రక్షిస్తాయి. (6-40).
* పరమాత్మ సర్వవ్యాపి అని తెలుసుకో! (7-7).
* ఏ దేవత ద్వారా మన అభీష్టాలు నెరవేరినా అది పరమాత్మ అనుగ్రహమే! (7-21, 22).
* పరమాత్మను చేరడమే అంతిమ గమ్యంగా పెట్టుకో! (7-23).
* కనిపించనంత మాత్రాన దేవుడు లేడనుకోకు. యోగమాయ కారణంగా దేవుడు కనిపించడు. (7-25).
* మనం చేసే పనుల్ని పరమాత్మ గమనిస్తున్నాడు. (7-26).
* అభ్యాసంతో, ఏకాగ్ర చిత్తంతో పనిచేసేవాడు పరమలక్ష్యాన్ని తప్పక చేరుతాడు. (8-8,9).
* ప్రాణులు నశించినా పరమాత్మ మాత్రం శాశ్వతుడు. (9-4).
* అనన్య భక్తితో సేవించే వారిని దేవుడు కంటికి రెప్పలా కాపాడుతాడు. (9-22).

* దేవుని నమ్మినవాడు ఎన్నడూ చెడిపోడు. (9-31).
* ఈ జగత్తు పరమాత్మలోని ఒకానొక అంశము మాత్రమే! (10-42).
* పరమాత్మ దృష్టిలో మనం నిమిత్తమాత్రులమే అయినప్పటికీ మన కర్తవ్యాన్ని ఆచరించవలసిందే! (11-33).
* ఉన్నతమైన లక్ష్యాన్ని చేరడానికి అనన్యమైన శ్రద్ధ, భక్తి అవసరం. (11-54).
* పరమాత్ముడే సర్వమని జీవించేవాడు పరమాత్మని చేరుతాడు. (11-55).
* ధర్మమార్గంలో నడచేవాడు పరమాత్మకు మిక్కిలి ప్రీతి పాత్రుడు. (12-20).
* పరమాత్మ సర్వవ్యాప్తి కనుక ఎవరూ తమను తాము హింసించుకొనరాదు. (13-28).
* మనం పనిచేసే విధానాన్ని బట్టే ఫలితాలుంటాయి. (14-16).
* సత్వ రజ స్తమో గుణాలకు అతీతంగా ప్రవర్తించడం అలవాటు చేసుకోవాలి. (14,25).
* ఈ జన్మలో మనం చేసే పనులను బట్టే మరుజన్మ ఆధారపడి ఉంటుంది. (15-8).
* 'వైశ్వానరుడ'ను జఠరాగ్ని స్వరూపంలో ఉన్న పరమాత్మే మనం తినే ఆహారాన్ని జీర్ణం చేస్తున్నాడు. (15-14).
* మనిషి పతనానికి కారణాలైన కామ, క్రోధ, లోభాలను వదలివేయాలి. (16-21).
* ధర్మమార్గాన్ని వదలి, విశృంఖలంగా ప్రవర్తించేవాడు ఇహ పరలోకాల్లో సుఖాల్ని పొందలేడు. (16-23).
* ఏది చేయాలో, ఏది చేయకూడదో నిర్ణయించడానికి శాస్త్రమే (వేదమే) ప్రమాణము. (16-24).
* శాస్త్ర విరుద్ధంగా, శరీరాన్ని కృశింపజేయడమంటే - పరమాత్మను హింసించడమే. (17-6).

* ఎవరి మనసూ నొప్పించకుండా – సత్యము, ప్రియము, హితము అయిన విధంగా మాట్లాడు. (17–15).
* నీ గౌరవాన్ని పెంచుకోవడం కోసం ఆడంబరంతో ఏ పనులూ చేయకు. (17–18).
* ప్రతిఫలాన్ని ఆశించకుండా దేశ, కాల, పాత్రముల నెరిగి దానం చేయడమే ఉత్తమం. (17–20).
* కర్మ ఫలాన్ని పరమాత్మకు అర్పించడమే త్యాగము. ఈ లక్షణాన్ని అలవాటు చేసుకోవాలి. (18–2).
* నీ సామర్థ్యాన్ని సరిగా తెలుసుకోకుండా, కలుగబోవు దుష్పరిణామాలను సరిగా అంచనా వెయ్యకుండా ఏ పనీ ప్రారంభించవద్దు. (18–25).
* అహంకార, మమకారాలను వదలిపెట్టి, ఫలితం గురించి ఆలోచించకుండా, ధైర్యోత్సాహాలతో  పనిచెయ్యి. (18–26).
* తొలుత కష్టంగా ఉన్నా చివరకు సుఖాన్నిచ్చే పనులనే చెయ్యి (18–37).
* తొలుత సుఖంగా ఉండి చివరకు కష్టాలలోకి నెట్టే పనులు చేయకు. (18–38).
* సోమరితనాన్ని పెంచే సుఖాల జోలికి పోవద్దు. (18–39).
* పరమాత్మే సర్వమనుకుని ప్రవర్తిస్తే అంతా శుభమే జరుగుతుంది. కాదని అహంకరిస్తే పతనం తథ్యం.  (18– 57,58).
* పరమాత్మను శరణుకోరితే శాంతి, మోక్షమూ లభిస్తాయి. (18–62).
* ఏ పనైనా  జాగ్రత్తగా ఆలోచించి చెయ్యాలి. (18–63).
* సమస్తాన్నీ పరమాత్మకు అర్పించి శరణు వేడితే ఆయనే రక్షిస్తాడు. (18–66).
* ఏ విషయాన్నైనా శ్రద్ధాసక్తులు ఉన్నవారికే బోధించాలి. (18–67).
* పురుష ప్రయత్నానికి దైవానుగ్రహం తోడైతే విజయాన్ని తప్పక సాధిస్తావు. (18–78).

ఇవీ 'గీతా' ధర్మసింధు చెప్పే ప్రధానమైన విషయాలు.... 'గీత'లో మానవ జీవన విధానానికి సంబంధించి ప్రస్తావించని  అంశమంటూ లేదు.

అందుకే 'గీత' ప్రపంచం చేత 'గ్రేట్' అనిపించుకునే 'మేనేజ్‌మెంట్ గ్రంథం' అయ్యింది.

శ్రీకృష్ణుడు 'బెస్ట్ మేనేజ్‌మెంట్ గురు' అయ్యాడు.

ఇతర ప్రపంచ భాషల్లో మీకు స్ఫూర్తినిచ్చిన ఒక్క సూక్తి చెప్పండి. దానికి స్ఫూర్తి, దానికి మాతృక 'భగవద్గీతే' అయి తీరుతుంది.

అంతటి సమగ్రమైన జీవన విధాన గ్రంథం 'భగవద్గీత!'

## గీత చదివితే ఏమొస్తుంది?

'గీత'లోని 700 శ్లోకాలను బట్టీ పట్టేసినంత మాత్రాన ఫలితమేమీ ఉండదు. 'గీత' పఠనాగ్రంథం కాదు. ఆచరణ గ్రంథం. అదే గీత పరమప్రయోజనం! ఇది రిటైర్మెంట్ సబ్జక్టు కాదు. జీవితానికి గైడ్! దీన్ని జీవితం ప్రారంభదశలోనే తెలుసుకుని ఆచరించడం ప్రారంభిస్తే మనిషి మనీషి అవుతాడనడంలో సందేహం లేదు. అందుకే విద్యార్థి దశనుండే భగవద్గీతను నేర్పించాలి.

'మత'మంటే ఒక వర్గానికి చెందినది. 'ధర్మం' అంటే సార్వజనీనమైనది. భగవద్గీత జగత్తులోని ప్రతి మానవుణ్ణీ ఉద్దేశించి చేసిన మహోదాత్తమైన ధర్మోపదేశం! గీతోపదేశ ప్రారంభానికి ముందు యుద్ధ విముఖుడైన అర్జునుడు గీతాబోధ తర్వాత కర్తవ్యోన్ముఖుడయ్యాడు. మరి 'గీతా' వైద్యం అర్జునుడికి పనిచేసినప్పుడు మనకి పనిచెయ్యదా? ఇదే లాజిక్కు! అందుకే కర్తవ్య దీక్షకు, నైతిక విలువల ప్రబోధానికి, ఉత్తమ సమాజ నిర్మాణానికి 'భగవద్గీత' కంటే మించిన మార్గదర్శక గ్రంథం, వ్యక్తిత్వ వికాసగ్రంథం మరొకటి లేదని నిస్సందేహంగా చెప్పవచ్చు. వృత్తిగత, వ్యక్తిగత జీవితాలు ధర్మబద్ధంగా నడవాలంటే, ఆదర్శవంతమైన సమాజస్థాపన జరగాలంటే గీతాచరణం ఒక్కటే మార్గం. 'గీత' చదివితే జీవితమనే డిక్షనరీ లోంచి 'నేను' అనే అహంకారం, 'నాది' అనే 'మమకారం', ఇతరులు హర్షించని 'స్వార్థం'... అనేవి తొలగిపోతాయి. కర్తృత్వ భావన పోయి కర్తవ్యదీక్ష మొదలవుతుంది.

## శ్లోకాలు కాదు మహామంత్రాలు...

'గీత'కు 'సర్వశాస్త్రమయి' అని పేరు. 'గీత' 'అద్వైతామృత వర్షిణి' గా సాగే సర్వోపనిషత్తుల సారం. దీన్ని 'గీతాశాస్త్రమ'ని కూడా పిలుస్తారు. 'గీత' ఒక్కటి చదివితే

సర్వశాస్త్రాలూ చదివినట్లే! ఐశ్వర్యమునకు,బలమునకు, కీర్తికి, సంపదకు,జ్ఞానమునకు, వైరాగ్యమునకు.... ఈ ఆరింటికి 'భగము' అని పేరు. ఈ ఆరూ కలిగిన వాడికి భగవంతుడని పేరు. అటువంటి వాడు చెప్పింది కాబట్టి దీనికి 'భగవద్గీత' అని పేరు వచ్చింది. సాక్షాత్తూ భగవానుడే బోధించాడు కాబట్టి వీటిని శ్లోకాలుగా కాక మానవులకు లౌకిక, పారమార్థిక ఫలితాలనిచ్చే మహామంత్రాలుగా ప్రకటించారు వేదజ్ఞులైన ఋషులు. తెలిసినా తెలియక పోయినా ప్రకృతి శక్తుల ప్రభావం మనమీద కనిపించినట్టే అర్థం తెలియకుండా చదివినా 'గీతా' మంత్రాలకున్న సహజ శక్తి ప్రభావం మన జీవిత ప్రయాణానికి మేలు చేకూరుతుందంటారు ఋషులు! ఆ విధంగా చూస్తే ఏ శ్లోకాన్ని మంత్రంలా జపిస్తే ఏ ఫలితాలను చేకూరుస్తుందో కూడా చెప్పారు మహాత్ములు.

| | |
|---|---|
| సర్వకార్య సిద్ధి కోసం | : సర్వధర్మాన్ పరిత్యజ్య (18-66) |
| రోగ నాశనం కోసం | : మత్తః పరతరం నాన్యత్ (7-7) |
| విపత్తులు తొలగడం కోసం | : భోక్తారం యజ్ఞ తపసాం (5-29) |
| స్వప్న సిద్ధి కోసం | : కార్పణ్య దోషోపహత స్వభావః (2-7) |
| పూర్వజన్మ జ్ఞానం కోసం | : బహూని మేవ్య తీతాని (4-5) |
| ఐశ్వర్య ప్రాప్తి కోసం | : సుదుర్దర్శమిదం రూపం (11-52) |
| శత్రువులపై విజయం కోసం | : బన్ధురాతాత్మ నస్తస్య (6-6) |
| సర్వప్రియత్వం కోసం | : యోమాం పశ్యతి సర్వత్ర (6-30) |
| ఋణ విముక్తి కోసం | : తేషామహం సముద్ధర్తా (12-7) |
| శత్రుబాధా విముక్తి కోసం | : అభ్యాసయోగ యుక్తేనా (8-8) |
| సంతాన ప్రాప్తి కోసం | : నచమాం తాని కర్మాణి (9-9) |
| యోగక్షేమ ప్రాప్తి కోసం | : అనన్యాశ్చింతయంతో మాం (9-22) |
| సుఖ ప్రాప్తి కోసం | : పత్రం పుష్పం ఫలం తోయం (9-26) |
| భయ నాశనం కోసం | : శ్రద్ధయా పరయా తప్తం (17-17) |

| | |
|---|---|
| సిద్ధులు కలుగడం కోసం | : మన్మనాభవ మద్భక్తో (9-34) |
| దుఃఖ నాశనం కోసం | : శ్రేయోహిజ్ఞాన మభ్యాసాత్ (12-12) |
| విఘ్న నాశనం కోసం | : దివ్యమాల్యాంబరధరం (11-11) |
| ప్రేమ వృద్ధి కోసం | : త్వమాది దేవః పురుషః పురాణః (11-38) |
| భూతప్రేత బాధా నివారణ కోసం | : స్థానే హృషీకేశ (11-36) |
| మృత్యుకాల జ్ఞానము కోసం | : యదా సత్త్వే ప్రవృద్ధేతు (14-14) |
| ఉదరరోగ నాశనము కోసం | : అహం వైశ్వానరో భూత్వా (15-14) |
| దోషనాశనము, క్రోధశమనము కోసం | : త్రివిధం నరకస్యేదం (16-21) |
| వైభవ ప్రాప్తి కోసం | : యోమామేవ మసమ్మూఢో (15-19) |

ధర్మ బద్ధమైన సంకల్పంతో ఈ 'గీతా' మంత్రాలను పఠించి తత్ఫలితాలను పొందవచ్చు. అయితే 'గీత' చరమ లక్ష్యం లౌకికమైన కోరికలు తీర్చుకోవడం కాదని గుర్తించాలి.

**ఇది 'జీవన గీత'.. 'మరణగీత' కాదు...**

'భగవద్గీత'లో ఒక్క శ్లోకమైనా గురు ముఖతః అధ్యయనం చేసినవాడు ధన్యుడవుతాడని జగద్గురు శంకరాచార్య.... తన కర్తవ్య దీక్షకు 'భగవద్గీత' ఎప్పుడూ శక్తినిస్తూ ఉండేదని మహాత్మాగాంధి, ఉత్తమ లక్ష్యానికి చేర్చే 'ధర్మసింధు' గీత అని స్వామి వివేకానంద వంటి భారతీయులు, భగవద్గీత లేకపోతే ప్రపంచ వాఙ్మయం పరిపూర్ణమైనట్లు కాదని ఎడ్విన్ ఆర్నాల్డ్ (ఇంగ్లండు కవి), జ్ఞానానికి పరాకాష్ఠ భగవద్గీత అని మాక్స్ ముల్లర్ (జర్మనీ సాహితీవేత్త), అణుబాంబు ప్రయోగ సమయంలో తనకు 'గీతే' గుర్తొచ్చిందని జె.రాబర్ట్ ఓపెన్ హేమర్ (అమెరికా అణుశాస్త్రవేత్త), ఇంకా వారన్ హేస్టింగ్స్, ఐనిస్టియన్, ఆల్డస్ హక్స్లీ వంటి పాశ్చాత్యులు భగవద్గీత గొప్పతనాన్ని అనుభవ పూర్వకంగా ప్రశంసిస్తూంటే - మన తెలుగు వాళ్ళు మాత్రం 'భగవద్గీత' ఎక్కడైనా వినిపిస్తుంటే ఎవడో చనిపోయాడని నిశ్చయించుకునే స్థాయికి తీసుకురావడం అత్యంత దురదృష్ట కరం... అజ్ఞానం! ఈ దుష్ట సంప్రదాయాన్ని

తొలగించడంలో ప్రతీ తెలుగువాడూ కంకణబద్ధుడు కావాలి. భగవద్గీత 'జీవనగీత'... 'మరణగీత' కాదు, కారాదు. ఒక డాక్టర్, ఒక లాయర్, ఒక ఇంజనీర్, కావాలంటే వందల పుస్తకాలు చదవాలి. కానీ గొప్ప వ్యక్తి కావాలంటే, మనిషి శాశ్వతుడు కావాలంటే 'గీతా మార్గదర్శకత్వం'లో నడిస్తే చాలు! పరమాత్ముడు మనిషిని సృష్టించి, వాణ్ణి సన్మార్గంలో నడిపించడానికి అందించిన 'ప్రోడక్టు మాన్యువల్' భగవద్గీత!

## కృష్ణం వందే జగద్గురుమ్

ఇహ పర లోకాలలో సౌఖ్యం సమకూర్చుకోవడాన్ని అభ్యుదయం అంటారు. 'శాశ్వతానందమయ స్థితి' అయిన మోక్షాన్ని ప్రాప్తింప చేసుకోవడాన్ని శ్రేయస్సు అంటారు. ఒక కాలానికి చెందిన, ఒక ప్రాంతానికి చెందిన, ఒక మనిషి యొక్క అభ్యుదయాన్నీ శ్రేయస్సునూ కోరుకుంటూ తగిన మార్గాలను బోధించేవాడు గురువవుతాడు. సర్వదేశాలకు, సర్వకాలాలకు, సర్వజాతులకూ వర్తించే విధంగా – జగత్తులోని ప్రతి మానవుణ్ణీ ఉద్దేశించి అభ్యుదయ, నిశ్రేయస మార్గాలను రెండింటినీ మహోదాత్తమైన పద్ధతిలో, విశ్వజనీనమైన భగవద్గీతా రూపంలో ఉపదేశించడం ద్వారా శ్రీకృష్ణుడు జగద్గురువయ్యాడు.

* భగవానుడైన శ్రీకృష్ణ పరమాత్మ చేతనే ఉపదేశింపబడుట వలన 'భగవద్గీత' అనీ...
* వేదాంతములను సంగ్రహించి చెప్పియున్నందున 'ఉపనిషత్సారమ'నీ...
* పరబ్రహ్మమును తెలిపెడు విద్య కావున 'బ్రహ్మవిద్య' అనీ...
* ఆత్మానాత్మ వివేకమును స్పష్టపరిచే సాంఖ్యయోగము, కర్మయోగము చెప్పబడియున్నందున 'యోగశాస్త్రమ'నీ....
* కృష్ణ పరమాత్మకూ, అర్జుననకూ జరిగిన ప్రశ్నోత్తర రూపంగా ఉన్నందున 'శ్రీకృష్ణార్జున సంవాదమ'నీ భగవద్గీతలో చెప్పబడుతోంది.
* ప్రతీ అధ్యాయము నందు పరమాత్మను ప్రాప్తింపజేయు సంవిధానము ఒక్కో యోగముగా వర్ణింపబడినది.

## 'గీత' నేర్చుకో.... 'రాత' మార్చుకో....!

పాశ్చాత్యులు సైతం 'గీత' మహాగ్రంథమని కొనియాడుతుంటే – మతాలు ఆవిర్భవించని కాలంలో ఈ దేశంలో పుట్టిన 'గీత'ను జాతీయ గ్రంథంగా ప్రకటించాలా వద్దా అనే చర్చదశలోనే ఉండడం శోచనీయమైన విషయం. ఒక పక్క అమెరికన్ కాంగ్రెస్ ఉమెన్ తులసీ గబ్బార్డ్ – భగవద్గీత పైన ప్రమాణం చేసి పదవీ ప్రమాణం చేస్తే – మరో పక్క మన దేశంలోని జస్టిస్ ఎ.ఆర్. ధవే– 'నాకే కనుక అధికారం ఉంటే 'భగవద్గీత'ను బాల్యదశ నుండే నిర్బంధ విద్యగా ప్రవేశపెట్టి ఉండేవాణ్ణ'ని వాపోయారు. ఇదీ మన దేశ దుస్థితి! ఈ స్థితిలో ప్రభుత్వ నిర్ణయాల కోసం ఎదురు చూడకుండా ప్రతి తల్లి, తండ్రీ తమ పిల్లలకు 'భగవద్గీత' నేర్పించడం బాధ్యతగా గుర్తెరగాలి. మానసిక దుర్బలులై మాదక ద్రవ్యాలకూ, మద్యానికీ, సిగరెట్లకూ అలవాటు పడుతున్న యువత శాతం నానాటికీ పెరుగుతున్న ఈ రోజులకు అత్యవసరం! చెయ్యవలసినవీ చెయ్యకూడనివీ, ఏం చేస్తే ఏ ఫలితం ఉంటుందో 'భగవద్గీత' చెబుతుంది. 'గీత' చదివితే వైరాగ్యంతో సన్న్యాసుల్లో కలిసిపోతామనే భయం అవసరం లేదు. కారణం – 'గీత' బోధించిన వాడూ, దాన్ని శ్రద్ధగా విని ఆచరించినవాడూ ఇద్దరూ గృహస్తులే! పైగా గీత విన్న అర్జునుడిలో అజ్ఞానం పూర్తిగా తొలగిపోయి, కర్తవ్యోన్ముఖుడై, ఆదర్శప్రాయుడిగా నిలిచాడు. మన భాషలో, ఆలోచనల్లో, నడవడికలో, అభివృద్ధిలో విశేషమైన మార్పు తెస్తుంది గీత!'గీత' సంస్కృతంలో ఉండడం వల్ల, దానికి – అర్థం చేసుకోలేని స్థాయిలో భావాలు రచించడం వల్ల – గీతా పఠనం పట్ల సామాన్యులు ఆసక్తి కనబరచడం లేదు. ఇది గమనించిన 'భగవద్గీతా ఫౌండేషన్' సంపూర్ణ భగవద్గీతను సంగీత భరితంగా, తెలుగు తాత్పర్య సహితంగా దశాబ్దం పాటుగా పరిశోధనాత్మక కృషితో శ్రీకృష్ణార్జున సంవాదాన్ని ప్రత్యక్షంగా వింటున్న అనుభూతిని కలిగించే శబ్ద సాంకేతిక పరిజ్ఞానంతో సి.డి.లుగా రూపొందించి సామాన్యులకు చేర్చే ప్రయత్నం చేసింది.

**గమనించండి ఆధ్యాత్మిక బంధువులారా...**

భగవద్గీత .... మతం కాదు జ్ఞానం!

భగవద్గీత .... ఉత్తమ జీవన విధాన మార్గం!

భగవద్గీత .... ఉన్నత వ్యక్తిత్వ వికాస సాధనం!

భగవద్గీత .... సర్వ మానవులకు ఆశాదీపం!

భగవద్గీత .... సాధువులకు కల్ప వృక్షం!

*సర్వేజనాస్సుఖినోభవంతు!*

*(వ్యాసకర్త: గీతాగాన ప్రవచన ప్రచారకర్త, గాయకుడు, వ్యవస్థాపక అధ్యక్షులు – భగవద్గీతా ఫౌండేషన్, హైదరాబాద్)*



సంస్కృతి ఆంతరిక జీవనసరళి. నాగిరికత బాహ్య జీవనసరళి.



వర్ధమాన దేశాలలో విదేశీ మారక ద్రవ్యం తరిగిపోతే, ఆర్థిక వ్యవస్థ దెబ్బ తిన్న రీతిగా, మన నైతిక, ఆధ్యాత్మిక వనరులు తరగడం వల్ల, జాతీయ లక్ష్యాలైన సర్వజన శ్రేయోభ్యుదయములు దూరవుతున్నాయి.



సంస్కృతి ఆధారంగా ఏర్పడే సమైక్యత వల్ల దేశభక్తి పెంపొందడమే కాక ఆత్మగౌరవ హేతువవుతుంది.